# స్వాస్
# మింట్స్




అమృతాంజన్ లిమిటెడ్
వారి మరొక గొప్ప తయారి

**Amrutanjan Limited** 

# భారతి

మాసపత్రిక

*

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938-1972)

*

సంపుటము : 65 జూన్ 1988 సంచిక : 6

విడిపత్రిక వెల ఐదురూపాయలు


# విషయానుక్రమణిక

జూన్ - 1988

# స్వ విషయం

సుప్రసిద్ధ పురావస్తు శాస్త్రజ్ఞులు శ్రీ డా॥ ఇంగువ కార్తికేయశర్మగారి మరొక వ్యాసం ఈ నెల భారతిలో వెయ్యగలుగుతున్నందుకు సంతోషంగా ఉన్నది...

ఈ సంచికలో భారతదేశం సాధిస్తున్న ఆర్థికాభివృద్ధిని గురించి ప్రొ. వి. ఎల్. శి. [illegible] రాసిన వ్యాసం వేస్తున్నాము. ఇందులో అన్నిరకాల పఠితలనీ ఆకర్షించగలిగిన సమాచారం ఉన్నదంటే అతిశయోక్తి కాదు!

స్వర్గీయ దీనదయాళ్ ఉపాధ్యాయ రచన ఒకటి జూన్ నెల భారతిలో చోటు చేసుకోవటం కూడా చదివేవారికి చాలామందికి హర్షం కలిగించగలదని అనుకుంటున్నాము....

"మన ధ్యేయము – మన గమ్యము" హిందీ మూలానికి అనువాదం అయితే "ఏనాటికీ ముగియని కథ" కన్నడంనుంచి అనువాదం చెయ్యబడినది. ఒరియా, హిందీ, కన్నడం, తమిళ భాషలనుంచి అనువాదం చెయ్యబడిన రచనలు అప్పుడప్పుడు భారతిలో పడుతూనే ఉంటాయి. ఇతర భాషలనుంచి కూడా మంచి తర్జుమాలు వస్తే వెయ్యాలని ఉన్నది!

ఈ మధ్యనే చిలుకూరి వీరభద్రరావుగారిని గురించి భారతిలో మల్లంపల్లి సోమశేఖరశర్మగారు రాసిన వ్యాసం ఒకదానిని మళ్ళీ అచ్చు వేశాము. ఇప్పుడు సోమశేఖరశర్మగారు పరిష్కరించిన 'కవుల చరిత్ర'ని గురించి (నిడుదవోలు వెంకటరావుగారి కుమారుడు) శ్రీ నిడుదవోలు సుందరేశ్వరరావుగారు రాసిన వ్యాసం ఒకటి ప్రచురిస్తున్నాము. ఈ వ్యాసం పాఠకులలో కొందరినయినా ఆలోచింపచేసేట్లు ఉండగలదు...

రెండు నెలల నక్షత్రఫలాలని కలిపివేస్తున్నాము. త్వరలోనే ఏ నెల నక్షత్రఫలాలు ఆ నెల వేసే అవకాశం కలుగుతుందని ఆశిస్తున్నాము!

"హార్డీ రామానుజౌ ప్రాజ్ఞౌ – గణ్యౌ గణిత కోవిదౌ" ఇద్దరు గొప్ప గణిత శాస్త్రవేత్తలకి సంబంధించిన రచన కాబట్టి ఈ నెల భారతిలో సాహిత్యంతోబాటు విజ్ఞాన శాస్త్రాన్ని గురించిన రచన కూడా (అందులోనూ సంస్కృతంలో!) ఒకటి పడుతోందనుకోవచ్చు...

సహృదయులయిన పాఠకులు భారతిని మెరుగుపరిచేందుకు సూచనలు చేస్తూ ఉంటారు. వారందరికీ కృతజ్ఞులము. వీలయినంతదాకా చదివేవారి అభిరుచులనిబట్టి మార్పులు తీసుకురావటానికి ప్రయత్నిస్తూనే ఉంటాము!



# తెలుగు విశ్వవిద్యాలయం

కళాభవన్, సైఫాబాదు, హైదరాబాదు-500 004

## "ఉత్తమ గ్రంథాలకు వార్షిక పురస్కార పథకం"

**మీకు ఉత్తమ గ్రంథాలను చదవటంలో ఆసక్తి ఉందా?**
**అయితే మీ సహకారం మాకు అవసరం.**

తెలుగులో ఉత్తమ గ్రంథాలను ప్రోత్సహించడానికిగాను, ప్రతి సంవత్సరం తెలుగు విశ్వవిద్యాలయం ఒక్కొక్క దానికి 3,000/- రూపాయల నగదు బహుమతితో కూడిన పురస్కారాలను అందిస్తున్నది. ఈ క్రింది ప్రక్రియల్లో వెలువడ్డ రచనల్లో 1988-89కు గాను పురస్కారాలు ఉంటాయి.

1. వచనగేయ కావ్యం, 2. పద్యకావ్యం, 3. నవల, 4. కథానికల సంపుటి, 5. నాటికల సంపుటి, 6. సాహిత్య విమర్శ, 7. అనువాద సాహిత్యం, 8. ఇతరాలు [ఇతరాలు అనే వర్గంలో సామాజిక, ఆర్థిక, తాత్విక వైజ్ఞానిక, చరిత్ర, కళలు, సంస్కృతికి సంబంధించిన ఏ గ్రంథమైనా సూచించవచ్చు. పాఠ్యపుస్తకాలను సూచించరాదు. ఉన్నత ప్రమాణాలున్న మౌలిక రచనలను మాత్రమే సూచించాలి.]

పై ప్రక్రియల్లో మీరు చదివిన గ్రంథాల్లో ఉత్తమ రచనలుగా మీరు భావించేవాటి పేర్లను క్రింద పేర్కొన్న వరుస క్రమంలో బహుమతి పరిశీలనకుగాను సూచించవచ్చు.

1. ప్రక్రియ పేరు, 2. పుస్తకం పేరు, 3. రచయిత పేరు [తెలిస్తే చిరునామా కూడా], 4. మొత్తం పుటల సంఖ్య, 5. ప్రచురణ సంవత్సరం, 6. ప్రచురణకర్త లేదా విక్రయదారు [చిరునామాతోపాటు] అయితే సూచించడంలో తప్పనిసరిగా ఈ క్రింది నియమాలను పాటించాలి.

1. సూచిస్తున్న గ్రంథాలు **1985** జనవరి నుంచి **1987** డిసెంబరు లోపుగా మాత్రమే ప్రప్రథమంగా ప్రచురింపబడి ఉండాలి. బహుమతి కొరకు సూచించిన రచనలో అధికభాగంకానీ, పూర్తిగాకానీ అంతకుపూర్వం మరే ఇతర గ్రంథరూపంలోనూ ముద్రణమై ఉండరాదు. వివిధ రచయితల సంకలన గ్రంథాలు బహుమతికి యోగ్యాలు కావు. ఒకే రచయిత వ్రాసిన రచనల సంకలన గ్రంథాలు బహుమతికి అర్హమే. సూచించే రచనలు పత్రికల్లో సీరియల్స్‌గా వచ్చి ఉన్న పక్షంలో, విధిగా పుస్తకరూపంలో విడుదలై ఉంటేనే సూచించాలి.
2. 'అనువాద సాహిత్యం' అనే విభాగానికి తప్ప మిగిలిన ప్రక్రియలకు సంబంధించి అనువాద రచనలుగానీ, అనుసరణలను కానీ, వ్యాఖ్యానాలనుకానీ సూచించరాదు.
3. విశ్వవిద్యాలయాలనుంచి పరిశోధన పట్టాలు [ఎం.ఫిల్/పి.హెచ్.డి.,] పొందిన సిద్ధాంత గ్రంథాలను సూచించరాదు.
4. కవిత, నాటికల సంపుటి విషయాలలో గ్రంథం కనీసం 48 పుటలకు తగ్గరాదు. మిగిలిన ప్రక్రియలలో 96 పేజీలకు తక్కువ ఉండరాదు. పుస్తకం సైజు కనీసం 10 × 16 సెం.మీలకు తగ్గరాదు.
5. రచయిత స్వర్గీయులైనప్పటికీ గ్రంథం తొలిసారిగా గతమూడేళ్ళలో ప్రచురింపబడిఉంటే బహుమతికి సూచించవచ్చు.

పై సూచనలను **18-7-1988** తేదీలోపుగా మా కార్యాలయమునకు పంపాలి.

టి. డి. ప్రసాదరావు,
కులసచివులు.

శ్రీ ఆర్. నరసింహారావు

# పఠాభి - ఆరుద్ర

విచిత్రమే సౌందర్యం. సౌందర్యమే విచిత్రం. భావ, శబ్ద సంవిధాన వైచిత్రిని ప్రదర్శించి కవిత్వ రచనలో క్రొత్తపుంతలు తొక్కినవాడు పఠాభి. తన కన్నులలో పెరిస్కోపులు, మయిక్రాస్కోపులు ఉన్నవని చెప్పుకోవడంలోనే కాక, పట్టాభి రామిరెడ్డి అనే తన పేరును 'పఠాభి'గా మార్చుకోవడంలో కూడ ఈయన వైచిత్రీ ప్రియత్వం గోచరిస్తుంది.

'చిన్నయసూరి బాల వ్యాకరణాన్ని [illegible]' అనిచెప్పి తన కవిత్వంలో కర్త కర్మ క్రియలకు అక్షరాలా తిలోదకాలిచ్చిన సాహసి పఠాభి. ఈ విషయాన్ని 'ఫిడేల్ రాగాల డజన్'కు రాసిన 'ఇంట్రో'లో 'శ్రీ శ్రీ' "అవ్యయం అనాఛ్ఛాదితంగా ఆకాశం మధ్యలో ఊగవచ్చును. విభక్తి విశృంఖలంగా షికారు పోవచ్చును." అని స్పష్టంగా చెప్పాడు.

"అనుసరిస్తాను నవీనపంధా" అనే స్లోగన్ తో భావకవిత్వం మీద తిరుగుబాటు ప్రకటించాడీకవి. పనిగట్టుకుని భావకవిత్వాన్ని హేళన చేశాడు. 'ఫిడేల్ రాగాల డజన్' కావ్యాన్ని అంకితం చేయడంలోనే హేళన ధ్వనింప జేశాడు. 'మృణాళినికి-కాదు-కళ్యాణికి - కాదు ఇరువురికి అనడం భావకవులకు భార్యతో పాటుగా ఊహాప్రేయసి కూడా ఉంటుందని ఎత్తి పొడవడమే. అదేవిధంగా 'భావకవిన్మాత్రము కాన్నేను' అని చెప్పటం భావకవిని అనిపించు కోవడం చిన్నతనంఅనీ, 'అహంభావ - కవిని' అని చెప్పటం భావకవికంటె గొప్పవాణ్ణి అని సూచించట మన్నమాట. ఈ విధమైనభావాలు ఆనాటి కవిత్వానికి విద్యుత్ చికిత్స (షాక్ ట్రీట్ మెంట్) చేసినవని చెప్పాలి.

ఆధునిక కవిత్వం శ్రీశ్రీ పద్ధతిలోనే కాదు ఇలా కూడా రాయివచ్చు అని పఠాభి 'ఫిడేల్‌రాగాల డజన్' కావ్యం చూచి ఆంధ్రదేశం తెలుసుకున్నది.

శాంతినికేతన్‌లోనూ, ఆపిమ్మట అమెరికాలోనూ ఆంగ్లసాహిత్యం అధ్యయనం చేసిన పఠాభి రవీంద్రుని కవిత్వంలో నూతన ప్రయోగాలనీ, పాశ్చాత్య కవితారీతులనీ ఆకళింపు చేసుకున్నాడు. సిగ్మండ్ ఫ్రాయిడ్ మనోవిశ్లేషణ సిద్ధాంతాన్ని విశేషంగా పఠించాడు. ఫ్రాయిడ్, వాల్ట్‌విట్‌మన్ తన అభిమాన రచయితలని పఠాభి చెప్పుకున్నాడు. పాశ్చాత్య వాఙ్మయప్రభావం పఠాభికవిత్వంలో అడుగడుగునా తొంగి చూస్తుంది.

తన మొదటి కావ్యసంపుటికి 'ఫిడేల్‌రాగాల డజన్' అనిపేరు పెట్టడంలో పఠాభి విజ్ఞత గమనింప తగ్గది. పాశ్చాత్య వాయిద్యమైన ఫిడేల్ మీద స్వదేశీ రాగాల్ని ధ్వనింప జేస్తాననే 'ధ్వని' ఆ పేరులో ఉన్నది. పాశ్చాత్య కవితారీతిలో తెలుగుకవిత్వం రాస్తానని ఫలితార్థం. అయితే పఠాభి ఫిడేల్ మీద తెలుగురాగాలే కాకుండా పాశ్చాత్య సంగీతాన్ని తెలుగులో వినిపించాడని చెప్పాలి.

అత్యాధునికంగా పాశ్చాత్య నాగరికతలో ఉండేదే నగరం పఠాభి కవిత్వానికి రంగస్థలం. తెలుగులో నగర జీవిత చిత్రణచేసిన మొదటికవి పఠాభి. ఆధునిక నగరవాతావరణాన్ని పఠాభి ఆధునికంగా వర్ణిస్తూ

'తగిలింప బడియున్నది జాబిల్లి
చయినా బజారు గగనములోన'

అంటాడు. ప్రాచీనులు, ఎంతోమంది ఆధునికులూ సౌందర్యానికి తిరుగులేని ప్రతినిధిగా అంగీకరించిన చంద్రుడికన్న 'నాగరీకన్యల పౌడర్ పూయబడిన ముఖాలే' అందంగా ఉంటాయంటాడు.

ప్రాచీన కవిసమయాల్ని నిరసించడంకోసం అసాంప్రదాయకమైన భావాలని వెలిబుచ్చాడు.

'నాయిక దట్టంగా జంతువ ట్లుంటుంది'. నాయికానాయకులిరువురూ 'ఏనుంగు గున్నల్లాగుంటారు' అనటంలో సంప్రదాయాతిక్రమణం స్పష్టమేకదా.

మరో అడుగు ముందుకువేసి నవ్యస్త్రీ కుచద్వయాన్ని 'స్వర్గద్వయంగా' వర్ణించి 'వానిమధ్య ఊగాడే పార్కర్ పెన్'గా తాను మారిపోతే ఎంత బాగుంటుందంటాడు. 'ఫిడేల్‌రాగాల డజన్' 1973లో రెండవసారి ముద్రించినప్పుడు పఠాభి ఆ విధమైన కవిత్వం ఎందుకు రాశాడో చెప్పాడు. భావకవిత్వపు భావతోనూ, భావాలతోనూ, కవిసమయాలతోనూ ప్రభావితమైన తెలుగుదేశాన్ని మరోదారివైపు మళ్ళించడానికి పఠాభి వైచిత్రీమార్గం ఎన్నుకున్నాడు. అందులో ఇంత సీరియస్‌నెస్ ఉందని తెలుగు వాళ్ళెవరూ గమనించనే లేదు. నాగరీకన్యల పౌడరు పూయబడిన ముఖాల్ని

'మా కళ్ళ పిడికళ్ళతో గట్టిగాపట్టి
తిండి పోతుల్లాగ తినివేస్తాము'

"బోగం చాన చనులు బూందీ పొట్లాలు' అనేచోట్ల విశృంఖలత్వాన్నీ, 'కామాక్షికోక' మున్నగు గేయాల్లోని అంగాగ విస్పష్ట వర్ణనలు కాము కత్వాన్నీపట్టి చూపుతున్నాయని విమర్శకులందరూ వ్రాశారు.

దువ్వూరి రామిరెడ్డిగారయితే "యౌవన ప్రాదుర్భావ సమయ ముస కామోద్రిక్తుడయి ......పలు వస్తువులతో నడసి మతిచెడిన యువకుని ఉన్మత్త ప్రలాపములు' అని ఈ కవిత్వాన్ని కొట్టివేశాడు.

చలం మాత్రం 'ఈ పిడుగులాటి పాటల్లో ఉత్తరచిత్రాలు అయినట్టి భావాలు ఎన్నో, వాడి అయినట్టి కొనగోళ్ళతోడ చురుకుమను నట్లు పెట్టిన వక్కలిగింత షోకుసు' అని భవించినట్లు ప్రశంసా పూర్వ కంగా చెప్పాడు అయితే విచిత్రమేమిటంటే పఠాభి శృంగార వర్ణనలు అతిపిచ్చిగా ఉండటంచేత అవి కామోద్రేకం కలిగించవు సరిగదా భావ కవిత్వ ప్రసిద్ధాలైన శృంగార వర్ణనల్ని హేళనచేసి వాటిపై రోత పుట్టిస్తాయి. పఠాభి ఆంతర్యంకూడా అదే. ఫిడేల్ రాగాల డజన్ తర్వాత ఎంతోకాలానికి అంటే 35సంవత్సరాల తర్వాత 1976లో ప్రకటింప బడిన పఠాభి కవితా సంపుటి 'కయిత నా దయిత' ఇందులో మరో పఠాభి దర్శనమిస్తాడు.

ఈ పఠాభి 'పద్యరచనా సుమనోజ్ఞవిద్య'లో ప్రవీణుడు. అష్టవిధ నాయికల్ని ఆధునిక భాషలో చిత్రించిన పద చిత్రకారుడు. ఇందులోని గేయాలన్నీ నూనూగు మీసాల నూత్నయౌవనంలో అంటే ఫిడేల్ రాగాల డజన్' కంటెముందు కాలంలో రచింపబడినవే.

పఠాభి శాంతినికేతన్‌లో విద్యాభ్యాసం చేస్తున్న కాలంలోనూ ఆ తరువాత కొలంబియా యూనివర్శిటీలో ఇంగ్లీషు సాహిత్యం అధ్య యనం చేస్తున్న కాలంలోనూ 'కయిత నా దయిత'లోని ఎక్కువ గేయాలు రచించబడినాయి.

ఈ గేయాల రచనావిధానంలో రవీంద్రుడి ప్రభావం కనిపి స్తుంది. వస్తువుకూడ నూతనమైనది కాదు. ఒకటో రెండోతప్పించి అన్నీ భావగీతాలే. ప్రణయము, విరహము, శృంగార వర్ణనలు, ఆత్మా శ్రయరీతి మొ॥న భావకవిత్వ లక్షణాల నన్నిటినీ పుణికిపుచ్చుకున్న గేయాలివి. కాబట్టి "కయిత నా దయిత" లోని కవిత్వ తత్త్వాన్ని పరిశీలించితే పఠాభిలో నూతనత్వం ఏమీలేదనే చెప్పాలి. కాని ఆ గేయ రచనా పద్ధతిని అంటే శిల్పాన్ని '(టెక్నిక్)' పరిశీలించితే పఠాభి ప్రయత్నం ఎందుకో, పఠాభి నవ్యత ఏమిటో అర్థమవుతుంది. ఈ సందర్భంలో ముందుగానే చెప్పుకోవాల్సింది ఛందస్సు. పఠాభి పద్యాల నడుములు విరుగగొట్టి మాత్రాచ్ఛందస్సులలో గేయరచన చేశాడు. శుద్ధసంస్కృత పదాలను అచ్చ తెలుగు విరుపులతో మాత్రా చ్ఛందానికి అనుగుణంగా మలచుకున్నాడు. ఈపద్ధతి కొన్నిచోట్లఎబ్బె ట్టుగా ఉన్నా పఠాభి ప్రయోగ శీలతకు నిదర్శనంగా ఉన్నది. "ప్రియుని నిరీక్షిస్తు", "వగచు చుంది రహస్స్థలిని", "సుధనుందిను సురనికన్న" "అత్యుగ్గంగ నదిరిస్తూంది" వంటి ప్రయోగాలు ఈ కావ్యంలో చాలావున్నాయి. మాత్రాచ్ఛందం స్వీకరించి తెలుగులో ముత్యాలసరాలు సృష్టించిన గురజాడ జాడనే అక్షరాల నడిచాడు పఠాభి. ఈ సంకలనంలో గేయ కథా పద్ధతిలో రచింపబడిన "వివా దము" అనే ఖండిక ముమ్మూర్తుల గురజాడ అడుగుజాడ 'భావనా రాజ్యపాలిని' అనేగేయంలో పఠాభి అపురూప సుందరి అయిన కయి తను ఆవాహన చేస్తాడు. 'శ్రీశ్రీ' 'కవితా ఓ కవితా' గేయఛాయలు ఇందులో ఉండకపోలేదు. గురజాడ పద్ధతిలో మాత్రాచ్ఛందంలో పఠాభి చేసిన కొన్ని ప్రయోగాలు చూద్దాం.

"వద్దూ యిక వద్దు
ఆరాటియంతా రద్దు
ఇకన్ను నాకు యింపుముగ్గు" (మూరవాంచ)

పై ఉదాహరణలో మొదటి పాదంలో 9 రెండవ పాదంలో 11 మూడవ పాదంలో 12 మాత్రలు ఉన్నాయి గేయంలో పాదాలు ఒకగాని గతిని ఒకటి నున్న . అలాగే బాటున్నికూడా స్వీకరించాడి.

"నీ రూపును
కన నోపను
విరహ భయద రాత్రి" (వియోగము)

ఇక్కడ మొదటి రెండుపాదాల్లోను సమానంగా మాత్రలు వేసి మూడవ పాదంలో భావాలని ఉల్లంఘించాడు. ఫలితంగామూడవ పాదంతో వచన పద్యం పూర్తయినట్లుగ గమనిస్తాము. ఈ పద్ధతిలోనే రచించబడిన 'నటరాజు' గేయంలో ప్రతి రెండు వచన పద్యాల తర్వాత అంటే మూడు పాదాలతో పద్యం పూర్తయితే ఆరోపాదం తరువాత అర్థబోధ కావాల్సి ఉండగా ఏడోపాదంతోకాని పూర్తిభావం వ్యక్తం కాదు. కేవలం ప్రయోగ దృష్టితోనే పఠాభి ఛందస్సులో యిన్ని కసర త్తులు చేశాడు. ఈ ప్రయత్నమంతా 1930-40 సంవత్సరాలమధ్యనే అని గమనించాలి.

మార్గకవిత్వ పద్ధతిలో 'నర్తకులు' అనే ఖండికను లయగ్రా హిలో వ్రాసితన ప్రాచీన ఛందో పరిజ్ఞానాన్ని నిరూపించుకున్నాడు.

"తేలిక లతాంతములు
తూలికలు వ్రాలు విధి
వ్రాలి కడు నచ్చరల
కేలికలు, వేశ్యా
బాలికలు చిత్రమగు
కేలికలు సల్పిరి.

ఈ లయగ్రాహిలో ఆది ప్రాస ప్రాధాన్యం వహించింది.

పఠాభి మరో నవ్యత అంత్య ప్రాస ముఖ్యంగా 'కయితనా దయిత' సంకలనం ఆధునిక కవిత్వంలో అంత్య ప్రాసలకు ఆది గ్రంథం. పఠాభి అంత్య ప్రాసల్ని ఒక దీక్షగా స్వీకరించిపాటించాడు. ఈ సంకలనంలోని ప్రతి ఖండికలోనూ విధిగా అంత్యప్రాసల నియమాన్ని పాటించాడంటే అందుక్కారణం నూతనప్రయోగాల పట్ల పఠాభికి గల ఆసక్తేనని వేరే చెప్పనవసరంలేదు

ఈ విషయంలో పఠాభికి స్ఫూర్తి రవీంద్ర కవీంద్రుడు. ఆ కాలంలో రవీంద్రుడు దేశీయ ఛందస్సులలో అంత్యప్రాసలు పాటిస్తూ ప్రయోగాలు చేస్తూ ఉండేవాడు. పఠాభి కావాలని అధ్యయనం చేసిన ఆంగ్ల సాహిత్యంలోకూడ అంత్యప్రాసలు ఎక్కువగా పాటింపబడటం గమనించాడు. అంత్యప్రాసలు గేయానికి చక్కని నడకను, లయను ఇస్తాయన్ని గ్రహించాడు అందుచేత అంత్యప్రాసను తన రచనాశిల్పంలో ముఖ్యలక్షణంగా స్వీకరించాడు.

'ఏవిధంగా వ్రాసినా సమర్థించుకుని మెప్పుడు' అనే దేవులపల్లి వారి సూక్తి పఠాభి విషయంలో స్వార్థమయింది. అంత్యప్రాసల ప్రయోగం అనంతర కాలంలో ఆదరింపబడి విజయం పొందటంచూసి పఠాభి సంతోషించాడు. 1973లో పునర్ముద్రించబడిన 'ఫిడేల్ రాగాల డజన్'కు రాసిన పీఠికలో

"ఆయామ్ గ్లాడ్, ద ఎక్స్‌పెరిమెంట్ ఐ డిడ్, విడ్ బేర్ ఫ్రూట్, యాజ్ ఎ కన్సిడరబుల్ బాడీ ఆఫ్ ఎండ్ రైమ్ పొయెట్రీ హాజ్ నౌ కమ్ టు పాస్" అంటాడు. ఈ విధంగా చెప్పకోవడానికి పఠాభికిగల అర్హత ఏమిటో 'కయిత నా దయిత' లోని అంత్య ప్రాసల్ని పరిశీలిస్తే తెలుస్తుంది. ప్రగతి వాద కవిత్వానికి మూల పురుషుడు శ్రీ శ్రీ అయితే ప్రయోగ వాదానికి పఠాభి అంతటివాడు. అష్ట విధ నాయికల్ని వర్ణిస్తూ రాసిన ఖండికలో, వివిధ పద్ధతులలో అంత్య ప్రాసల నియమం పాటించాడు. ఈగేయాల్లో పఠాభి అంత్యప్రాసల్ని గూర్చి ఆరుద్రతన 'గోరంత కృతజ్ఞత'లో (పీఠిక) విపులంగా చర్చించాడు. రెండుపాదాలకి, మూడుపాదాలకి అంత్య ప్రాసల్ని వేసి గేయరచన చేయడం పరిశీలించినట్లయితే పఠాభి ముందుగా పథకం వేసుకొని రచన ప్రారంభించా డనిపిస్తుంది ఈ అంత్య ప్రాసలు ప్రయత్నపూర్వకంగా సాధింపబడినవే అయినా సహజంగా అమరి అందాన్నిస్తాయి, కొన్ని అతికినట్లు కృతకంగా ఉండవచ్చుగాక. ప్రాస కోసం పఠాభి పదాలు విరిచినచోట్లున్నాయి కాని ప్రయోగదశలో ఇలాంటివి తప్పవేమో.

"అతినీరవము నిశీథము
నిలచింది విహగ గీతము
భయదమ్ము రజని భూతము (అభిసారిక)

"ఏవస్తువుకూడా సదా
పుడమినుండ బోదు కదా" (ఆరోప్యపదేశము)

"అల్పుడుగద అవని నంత
పాలించిన మహీజాని
నీ చిత్రము నాయనంత
సామ్రాజ్యపు రాజధాని" (ప్రణయాభిషేకము)

ఇలా అంత్యప్రాసల్ని అప్రయత్నంగానూ, సహజంగానూ, నిర్వహించ గల దిట్ట పఠాభి. కాని కొన్నిచోట్ల

"కాసి క్షణముంది ముంగల
మాయమ్మగు కనకపుంగల" (కయితనాదయిత)

వంటివి అతకనట్లున్నా మింగుడు పడకపోవు. ఈ సందర్భాలు పఠాభిలో చాలా తక్కువేనని చెప్పాలి

"సీతాకుసుమలస, శీల
చిత్రముయికూడ, నీర
వంతమగు, సుఖపుతార" (ప్లాటాండు)

"నీదు నిశ్వసనము, అంబు
జమున చేరి సుగంధంబు" (ఉషస్సు)

ఇవి ప్రాసకోసం పదాలు విరిచినపట్టులు. కావ్యంలో ఎడనెడాకన్పించే యీచోట్ల అర్థదృష్టి నిర్లక్ష్యం చేయబడినట్లు తోచకమానదు. కాని రచనకు పెట్టుకున్నవి కఠిన నియమాలు దీక్షచెడకుండా ఉండాలంటే కొన్నింటిని త్యాగం చెయ్యక తప్పదు. పరిశీలకులు ఏ దృష్టితోచూచినా 'కయిత నా దయిత' అంత్య ప్రాసల సర్వస్వంఅనే పఠాభిప్రాయానికి రాక తప్పదు.

ఇక "ఇంగ్లీషు భాషాభాండారంలోనుండి బందిపోటుంజేసి కావల్సిన మాటలుదోస్తాను" అనే ప్రతిజ్ఞని పఠాభి "పంచాంగం" లో చెల్లించుకున్నాడు. 'పన్‌చెయ్యటం ద్వారా 'ఫన్' సాధించడంలో పఠాభి నేర్పరి. ఒక పదాన్ని ఉపయోగించి వేరొక అర్థాన్ని స్ఫురింపజేయడం ఇందులోని చమత్కారం. పఠాభి చిత్ర విచిత్రాలన్నీ 'పన్ చాంగం'లో చూడవచ్చు. 1964 సం॥లో జ్యోతి మాసపత్రికలో నెల నెలా వెలువడిన 'పన్‌చాంగం' పాఠకుల్ని ఎంతో ఆకర్షించింది. ప్రవాసాంధ్రులు (మైసూరీయులు) పఠాభిని 'తిరుగులేని పన్'ను లకు అధికారిగా వర్ణించారు. శ్రీశ్రీ 'పఠాభి పసిడి పన్నులు విటమిన్-బి గుళికలనీ వీటిని రోజుకొకటి సేవిస్తే తెలుగువాడి మనస్సుకు ఆరోగ్యము, ఉల్లాసము సిద్ధిస్తాయని" గ్యారంటీ ఇచ్చాడు. ఆరుద్ర భాషలో పఠాభి 'పన్నులలో సంపన్నుడు'. 'ప్రవాసాంధ్రభారతి' కృషి వలన 'పన్‌చాంగం పుస్తకరూపంలో వెలువడింది. పఠాభి 'పన్'ల నుచూస్తే శ్లేష వలన ఎంత

చమత్కారం సృష్టించవచ్చో సూక్ష్మంలో తెలుస్తుంది. అవి పొట్టివైనా గట్టిబాణాలు. కొన్ని పూలబాణాలు. మరికొన్ని చమత్కార బాణాలు కొన్ని విమర్శనాస్త్రాలు కొన్ని ఉదాహరణలు చూద్దాం.

1. ముందుగా పూజించేది వెనకయ్యను.

(జూన్ 7)

2. రెక్కాడితేగాని డొక్కాడనివాడు రైల్వేసిగ్నలర్.

(జూలై 16)

3. భారతీయులకు టోపీవేసినవాడు గాంధీమహాత్ముడు.

(డిశంబరు 3)

ఇదికేవలం చమత్కారం ప్రధానంగాకల 'పన్'లు ఇక సామాజిక బలహీనతలను గూర్చిచెప్పినవి.

1. వధూవరులకు చదువుకన్నా
చదివింపు లెక్కువగా ఉన్నవి (ఏప్రిల్ 27)

2. కరగ్రహణానికి ముందు
వేలు కావాలంటాడు యీనాటి యువకుడు
(వేలు=ఫింగర్, థౌజండ్స్) (మే 29)

3. గాంధీమహాత్ములు ఒకే ఒక్కరు
బ్రాందీ మహాత్ములు మటుకు పెక్కురు

(జనవరి 26)

విమర్శనాస్త్రాలు చూడండి.

1. ప్రభుత్వానికి పాలసీలు సున్న
పాలసీఉండేది భీమా సంస్థలోమటుకే

(ఏపిల్ 1)

2. శాసన సభ్యులలో చాలమంది
ఆసన సభ్యులు మాత్రమేను

(ఆగష్టు 17)

3. కొత్త గెస్ వాళ్ళకు
వడకటం తగ్గి ఏకటం హెచ్చింది

(ఫిబ్రవరి 6)

4. పురాణాలలో స్త్రీచరిత్రలు
తారలవు తారని ప్రతీతి
నేటికాలంలో ఇది వ్యతిరేకంగా

(జూలై 6)

'బ్యాంకు చెక్కులకన్న భామ చెక్కులు ఇష్టము' అని 'కొనకొమ్మ కాయలు కోయుటకు ఎత్తుగడ కావాలి' అని కొంటెగా చమత్కరించినా సీరియస్‌గా ఆలోచించవలసినవికూడ ఎన్నో ఉన్నాయి వీటిల్లో

"జ్ఞానం కన్నా సుఖం ప్రధానం
కనుకనే మనుస్మృతి కన్నా
మనుచరిత్రకు సార్వజనీనత."

"ఆటమిక నాగరికతకు
ఆటవిక నాగరికతకు
అట్టే వ్యత్యాసం లేదు"

అనేవి ఆలోచింప జేస్తాయి.

'ఆశ్చర్యంగా రాస్తాడు ఆర్ద్ర' అని పఠాభిచేత అనిపించుకున్న ఆరుద్ర పఠాభిబాణీని యథాతథంగా అనుకరించాడనే చెప్పాలి. మొట్టమొదటిసారిగా శ్రీశ్రీ మెప్పు పొందిన 'లోహ విహంగాలు' గేయాల్ని పఠాభి భాషలో రాశానని ఆరుద్ర చెప్పుకున్నాడు. శ్రీశ్రీ ప్రభావంలోనుండి బయట పడటానికి ఆరుద్ర పఠాభిపద్ధతిని ఆశ్రయించాడు. ఆరుద్రలో కన్పించే ఆంగ్లాంధ్ర పదాల సాంకర్యం పఠాభి నుంచి వచ్చిన వారసత్వమే.

'నామీద షడ్డంతగా పఠాభిప్రభావం ఏ ఇతర నవ్యకవుల మీద పడలేదని" ఆరుద్ర 'కయితా నా దయిత' పీఠికలో రాశాడు. అంతేకాక 'కయితా నా దయిత'లోని ఖండికలు పరిశీలిస్తే పఠాభిప్రభావం ఎంత ఉన్నదో అర్థం అవుతుందని 'క్లూ'కూడ యిచ్చాడు. 'సినీవాలి,' 'కయితా నా దయిత' కావ్యాలు ఆధారం చేసుకుని ఆరుద్రపై పఠాభి ప్రభావాన్ని తులనాత్మకంగా పరిశీలిద్దాం.

పఠాభి కవిత్వానికి నగరం రంగస్థలం. ఆరుద్ర సినీవాలిలో నగరజీవిత చిత్రణ చేశాడు.

"పాడుతాను నాకుతెలిసిన నగరాన్ని గురించి"అని ప్రారంభించి నగర జీవితంలోని వివిధ దృశ్యాల్ని కళ్ళకు కట్టినట్లు వర్ణించాడు. ఆరుద్ర. ఇద్దరూ ఆధునిక నాగరికతవలన పెరిగిన నగరాల్లోని చీకటి కోణాల్ని టెలిస్కోపులు, మయిక్రాస్కోపుల్లో ప్రదర్శించారు. అయితే పఠాభిలో ఆధునిక నాగరికత పైమోజు, ఆరుద్రలో అదంటే ఏవగింపు గమనించవచ్చు. పఠాభి కృత్రిమ సౌందర్యాన్ని అభిమానిస్తే ఆరుద్ర నిరసించాడు.

నగరజీవిత చిత్రణలో వీరిద్దరికి స్ఫూర్తినిచ్చినవాడు ప్రసిద్ధ ఆంగ్లకవి టి. యస్. ఇలియట్ ఆంగ్లసాహిత్యాన్ని విశ్వవిద్యాలయంలో పఠాభీ, ఆసక్తిప్రధానంగా ఆరుద్రా విశేషంగా పఠించాడు. ఇలియట్ కవిత్వ తత్త్వాన్ని ఆకళింపు చేసుకొని వీరిద్దరూ మన నగరాల్లోని ముఖ్యంగా మద్రాసు మహానగరంలోని జీవనానికి అద్దంపట్టారు.

'ఇంగ్లీషు భాషాభాండాగారంలోంచి' కావల్సిన పదాల్ని పఠాభిలాగా ఆరుద్రకూడ దోచాడు. వాటిని యథాతథంగానూ తెలుగు

వ్యాకరణ పద్ధతిలో ఇంచుక్కులు చేర్చి ఆరుద్ర వాడుతున్నాడు. ఈనాడు తెలుగు వ్యావహారికంలో చేరిపోయిన ఇంగ్లీషుపదాల రచనలో వాడటంచేత భాషాసాంకర్యం ఎబ్బెట్టుగా కాక సహజంగానే ఉంటుంది. పాశ్చాత్య సాహిత్యాలతో విశేష పరిచయంకూడ ఇందుకు దోహదం చేసింది. నూతనమైన వస్తువు, నూతనమైన భావాలకు అనుగుణంగా భాషకూడ నూతనంగాఉండటమే సబబు. సీరియల్, స్విచ్, ఫ్యాషన్ లాంటిపదాలు అనువాదం చేయకుండా అలాగే ప్రయోగిస్తే తేలిగ్గా అర్థమవుతాయి. ఈ రహస్యం కనిపెట్టిన ఆరుద్ర ఇంగ్లీషు పద భూయిష్ఠంగా రచనచేసి నూతన శైలిని సృష్టించుకున్నాడు.

అంత్యప్రాసల విషయంలో ఆరుద్రకి పఠాభిగురువు. 'కయిత నా దయిత' అంత్యప్రాసల సర్వస్వమయితే ఆరుద్ర కవిత్వమంతా అందుకు దీటో. అంత్యప్రాస ఆరుద్రముద్ర అని రూఢమయిపోయింది. కాని అది పఠాభిముద్ర పఠాభి ప్రయోగదృష్టితో అంత్యప్రాస నియమం పాటించాడు. ఆరుద్ర విశేష విన్యాసం ప్రదర్శించాడు.

ఆరుద్ర ప్రయత్నపూర్వకంగా సాధించిన అంత్యప్రాసలు తక్కువే. అతని గేయాల్లోనూ, కావ్యాల్లోనూ అంత్యప్రాసను సహజంగా అప్రయత్నంగానే సాధించాడు. 'సినీవాలి'లో ఆరుద్ర అంత్యప్రాసలు కొన్ని చూద్దాం.

"వేడి లోపించింది
వెలుతురు లోభించింది
ఉద్వేగంగా బతకాలని
ఉద్రేకాన్ని వెతకాలని"

రెండుపాదాలకు పాటించిన అంత్యప్రాసకు ఇది ఉదాహరణ.

ఇక మూడుపాదాలకు పాటించిన పద్ధతి

'దేవ దుందుభులు మ్రోగలేదు
దేశం పండుగ చేసుకోలేదు
రాకపోకలు ఆగిపోలేదు.

రహదారులు రమణీయంగాలేవు
పెళ్ళిపందిరి వేయలేదు
కళ్ళాపులుజల్లి రంగవల్లికలు పెట్టలేదు
మామిడాకులు కట్టలేదు.

పాదాలు విడిచి అంత్యప్రాస ప్రయోగం

"మన అనురాగాలను చూపెట్టేందుకు
అనువైన వాడెవడూ లేడు
మనస్తాపాన్ని ఆరవేసేందుకు
మగదండల దండెంలేదు"

అను ప్రాసలు.

'రాళ్ళు నీళ్ళుగా, నీళ్ళు వడగళ్ళుగా' ఇలా అమర్చడంలో ఆరుద్ర అందెవేసిన చేయి.

ఆరుద్ర సినిమాపాటల్ని అంత్యప్రాసల వలన మాత్రమే గుర్తిస్తారంటే ప్రయోగంలో ఆరుద్ర ఎంత విజయం సాధించాడో తెలుస్తుంది.

పఠాభి ఆరుద్రలో ముఖ్యంగా చెప్పుకో వలసిన పోలికలు 'వైచిత్రి ప్రియత్వం', 'ప్రయోగవాదం' అంత్యప్రాసలపై తాను చేసిన ప్రయోగాలు విజయవంతం అయినాయని పఠాభి సంతోషించాడు, "ఆ విజయానికి నేను కారణ భూతుణ్ణి" అని ఆరుద్ర ప్రకటించుకున్నాడు. ఆరుద్ర 'త్వమేవాహం' 'సినీవాలి' కావ్యాలు నూతన ప్రయోగాలపట్ల యువకులలో ఆసక్తి కల్గించాయని విమర్శకులంటారు. ప్రగతివాద కవిత్వానికి శ్రీశ్రీని ప్రయోగ వాదానికి పఠాభిని పేర్కొంటే ప్రగతి ప్రయోగ వాదాలని సమతూకంలో నడిపించిన వాడు ఆరుద్ర అనిచెప్పాలి. పఠాభికి నిజమైన వారసుడు ఆరుద్ర.

పఠాభి ఆకాశంలో వెలసిన ఇంద్రధనుస్సు ఆరుద్ర ఆ ఇంద్రధనుస్సుకు ఆయిల్ పెయింట్ చేసి దాని అందాన్ని ఇనుమడింప జేసిన 'చిత్ర' కారుడు.

## ఉపయుక్త గ్రంథాలు

1. ఆధునికాంధ్ర కవిత్వము సంప్రదాయము-ప్రయోగములు — డా॥ సి. నారాయణరెడ్డి
2. తెలుగులో కవితా విప్లవాల స్వరూపం — డా॥ వెల్చేరు నారాయణరావు
3. ది మేకింగ్ ఆఫ్ లిటరేచర్ — ఆర్. ఎ. స్కాట్ జేమ్స్
4. 'ఫిడేల్ రాగాల డజన్'
5. 'కయిత నా దయిత'
6. 'పఠాభి పంచాంగం' — 'పఠాభి'
7. సినీవాలి
8. 'త్వమేవాహం' — ఆరుద్ర

# దగ్గరి దవ్వు

కడలిలో చీకట్లో
బతుకు నావ పయనం
ఉత్తుంగ తరంగ తాడిత
కల్లోలిత జీవనౌక
తుఫాను హోరు
వాన జోరు
దరి చేరునో
లేక మునుగునో
చేతిలో కొడిగట్టని
విశ్వాసజ్యోతి
ఆవలిగట్టున
వెలుతురు తోట

కాలం చేసిన గాయాలు
మనసు బలహీనతలు
కడిగి తుడిచేయాలి
శుద్ధ కిరణాలతో
వెనకనుంచి
కమ్ముతోంది
మృత్యుమేఘం
అలల జీవనగీతం
నడుపుతోంది ముందుకు
కనుచూపుకు దగ్గర
ఎంత నడచినా
తరగని దవ్వు
ఆవలి తీరం

# దగ్గరి దూరం

కడలిలో చీకటిలో బతుకు పయనం
ఉత్తుంగ తరంగ తాడిత కల్లోలిత జీవన నౌక
చావు పుట్టుకల మధ్య జీవి పోరు
తుఫాను హోరు. పడవ దరిజేరురో
లేక బుడుంగున మునుగునా?
చేతిలో కొడిగట్టని విశ్వాసజ్యోతి
పాపుల కోసం పతితుల కోసం

ఆవలిగట్టున వెలుతురు తోట
కాలే చల్లని కిరణాలతో
శుద్ధి చేసుకుంటూ మనస్సు
మళ్ళీ కుట్టుకుంటున్నారు వాళ్ళు
తేలిపోతున్నారు గాలిలో
మట్టిపురుగు అవుతోంది పక్షిరాజు
కనుచూపుకు తగులుతోంది
కాని ఎంత నడిచినా తరగడంలేదు దూరం

శ్రీ యు. శివలింగం

హిందీ మూలం : స్వర్గీయ దీనదయాళ్ ఉపాధ్యాయ

తెనుగుసేత : శ్రీ ముదిగొండ ఈశ్వర చరణ్

# మన ధ్యేయము - గమ్యము

**ప్రవేశిక :**

దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన వలభై ఏళ్ళ తరువాత కూడా జాతీయ సమైక్యతను గూర్చి, మనుషుల మధ్య, మతాల మధ్య, కులాల మధ్య సుహృద్భావం, సామరస్యం, సమన్వయాలను గూర్చి కమీషన్లు వేయడం, చర్చలు కొనసాగించడం జరుగుతున్నది. ఇది చాలా దురదృష్టకరమైన పరిణామం. రోగనిదానం చేయలేని వైద్యుని వైద్యం లాగానే పై కమీషన్లు - చర్చలు విఫలమవుతున్నాయి.

ఆధునిక సమాజం వ్యక్తి ప్రధానంగా రూపొందుతున్నది. అంటే ప్రాచీన సమాజాలలో వ్యక్తులు లేరని కాదు. వ్యక్తులు లేని సమాజమంటూ ఉండదు. అయితే ప్రాచీన సమాజంలో వ్యక్తుల లాభాలు - ప్రయోజనాలు సమాజం యొక్క శ్రేయస్సు కోసం—ప్రేయస్సు కోసం ఉపయుక్తమయ్యేవి. నేటి కాలంలో సమాజం యొక్క కార్యకలాపాలన్నీ కూడా వ్యక్తుల సుఖం కోసం ఉద్దేశింప బడుతున్నాయి. ఈ పరిస్థితి వ్యక్తులమధ్య ఆవేశాలకు - కావేశాలకు మూలమై సమాజంలో భద్రతారాహిత్యాన్ని సృష్టిస్తున్నది.

ప్రతి జాతికి - ప్రతి దేశానికి తనదంటూ ఒక సంస్కృతి-సంప్రదాయం - మౌలికమైన విలువలు ఉంటాయి. అవే ఆ జాతికి-ఆ దేశానికి గుర్తింపునిస్తాయి. అనాదినుండి భారత జాతీయత వ్యక్తికి-సమాజానికి మధ్య సమతౌల్యాన్ని సృష్టించగల జీవనవిధానంపై ఆధారపడింది. సాంఘిక-ఆర్థిక-రాజకీయ-మత వ్యవస్థలు వ్యక్తి కోసం సమాజాన్ని-సమాజం కోసం వ్యక్తిని తీర్చిదిద్దాయి.

ఆధునిక భారతజాతి చరిత్రలో పాత సంప్రదాయాలు-విలువ పట్ల సరియైన అవగాహన - దృక్పథం లేకుండానే విదేశీ ఇజాల ప్రభావంవల్ల - ప్రాభవంవల్ల ఒక విధమైన వ్యామోహం పేరుకొనిపోతున్నది. పాతను పూర్తిగా ఒదులుకోలేక - క్రొత్తను అనుసరించలేక జాతి-సమాజం విచిత్రమైన సంధియుగంలో కొట్టుమిట్టాడుతున్నాయి.

ఈ దశలో పాతకొత్తల మేలు కలయికను సాధించగల ఆలోచనా సరళిని ప్రజల మధ్యకు తీసుకొనిపోగల మేధావులు—రాజనీతిజ్ఞులు దేశానికి కావలసి ఉంది. స్వల్పకాలిక లాభాలను కాక దీర్ఘకాలిక ప్రయోజనాల కొరకు జాతిని సన్నద్ధం చేయాల్సిన అవసరం ఉన్నది. అప్పుడే సమైక్యత-సుహృద్భావం పెంపొందుతాయి.

స్వర్గీయ పండిత దీనదయాళ్ ఉపాధ్యాయ ఈ ఆశయ సాఫల్యం కోసం తన జీవితాన్ని ముడుపు కట్టిన మహామనీషి. ఆశయాలను వల్లించడం కాక ఆచరించి చూపి, ఆలోచనలను రేకెత్తించి ప్రజల మధ్యకు దూసుకొనిపోయిన కార్యకర్త. ప్రాక్పశ్చిమ జీవన విధానాలపట్ల సమగ్రమైన అవగాహన కలిగి దేశానికి సమ్యక్ భావపూరితమైన ఆదర్శాన్ని చూపిన మేధావి.

జాతి-జాతీయతలను గూర్చి ఆయన తన అభిప్రాయాలను 20 వ్యాసాలలో వెల్లడించాడు. వాటిని ఆయన మరణానంతరం 1971లో లక్నోలోని 'రాష్ట్ర ధర్మ పుస్తక ప్రకాశన్' వారు "రాష్ట్ర జీవన్ కీ దిశా' అనే పేరుతో పుస్తకరూపంలో తెచ్చారు. ఆ 20 వ్యాసాలను తెలుగువారి కందించి, మేధావులను ఆలోచించమని అర్థించడమే ఈ అనువాదం యొక్క పరమాశయం.

ఒక వ్యక్తి ఎంత గొప్పవాడైనా, అతడు చెప్పిందే వేదమని నమ్మే మూర్ఖత్వం ఈ అనువాదకుడికి లేదు. శ్రీ ఉపాధ్యాయ ఆలోచనల్లో కూడా అవసరం లేనివి ఉండవచ్చు. పనికిరానివి ఉండవచ్చు. అయితే వాటిని కూడా సాకల్యంగా విమర్శించి – విశ్లేషించి-వివరించి అవసరమున్నంతమేర గ్రహించడం బుద్ధిమంతుల లక్షణం. తెలుగు మేధావులు తమ వ్యక్తిగత అభిమాన దురభిమానాలకు దూరంగా ఆలోచించడం కొనసాగించేందుకు ఈ అనువాదం ఏమాత్రం తోడ్పడ్డా అది ఈ అనువాదకునిపట్ల ఒక జ్ఞానపీఠ బహుమతి.

—అనువాదకుడు

సృష్టిలోని ప్రాణికోటి అంతా ఒక్కమాటగా కోరుకునేది సుఖం ఒక్కటే. ఈ శుభాకాంక్ష మనిషి-పశువు-పక్షి మొదలైన చేతనాల లోనే కాక చెట్టూ-చేమలు మొదలైన అచేతనాలలో కూడా ఉందని ఆధునిక పరిశోధనలు తేల్చాయి. ఇంతేకాదు సుఖాన్ని పొందడం కోసం కష్టాలను కొనితెచ్చుకోవడం కూడా ప్రాణి సహజ లక్షణం. కట్టెను చూచి పారిపోయే కుక్క రొట్టెను చూచి పరుగెత్తుకొని-

వస్తుంది. కట్టె దెబ్బను సహించైనా రొట్టెను సంగ్రహించాలని ప్రయత్నిస్తుంది. అల్పప్రాణులే సుఖం కోసం ఇంత తాపత్రయ పడుతూ ఉంటే ప్రాణులన్నింటిలోకీ బుద్ధిమంతుడు, అన్నివిధాలా అధికుడు అయిన మనిషి మాట వేరుగా చెప్పాల్సిన పని లేదు.

అయితే ప్రాణులన్నీ ఇంతగా ఆరాటపడుతున్న సుఖం అంటే ఏమిటి? అన్నదే అసలు ప్రశ్న. సుఖం అంటే ఏమిటో ఇదమిత్థంగా నిర్వచించడం కష్టం. ఎందుకంటే ఒకరికి సుఖమైనది మరొకరికి కాకపోవచ్చు. ఒకసారి సుఖప్రదమైనది మరోసారి కాకపోవచ్చు. అది ప్రధానంగా అనుభవైక వేద్యం. వ్యక్తి నిష్ఠం. అయినా స్థూలంగా శరీరానికి అనుకూలమైన వేదన సుఖమని చెప్పుకోవచ్చు. మానసిక శాస్త్రవేత్తలు అనేకరకాల ప్రయోగాలు చేసి ఈ విషయాన్నే నిర్ధారించారు.

సుఖం - సుఖానుభూతి రకరకాలుగా ఉంటాయి. కొందరికి అందమైన దృశ్యాలు చూడటం సుఖం. మరికొందరికి రుచికరమైన భోజనం సుఖం. కొందరికి శ్రావ్యమైన పాట వినడం సుఖం. ఇంకా కొందరికి మంచి సువాసన సుఖం. వీటినే ఇంద్రియ సుఖాలు అంటాం. అంటే ఇంద్రియాల కోరికలను తీర్చడం ద్వారా కలిగే సుఖాలు. ఇవి ప్రాణులన్నింటికీ సమానమే! ఇందువల్లే ఆహార నిద్రాభయ మైథునాదులు జంతుకోటి అంతటికీ సమానమని సూత్రీకరించడం జరిగింది.

ఇప్పుడు మరో ప్రధానమైన ప్రశ్న ఉత్పన్నమౌతున్నది. సుఖానుభవం - సుఖం ప్రాణులన్నిటికీ ఒకటే అయినప్పుడు ఇక మనిషికీ తక్కిన చరాచరాలకు భేదం ఏమిటి?

మనిషి బ్రతకడం కోసం మాత్రమే బ్రతకడు. అతడి బ్రతుకుకు బ్రతకడంకన్నా ముఖ్యమైన అర్థం-పరమార్థం ఉన్నాయి. తక్కిన ప్రాణులకు జీవితలక్ష్యం అంటూ ప్రత్యేకంగా ఒకటి లేదు. పుట్టాయి కాబట్టి తింటున్నాయి. తింటున్నాయి కాబట్టి బ్రతుకుతున్నాయి. బ్రతుకుతున్నాయి కాబట్టి చస్తున్నాయి.

మనిషి విషయం వేరు. ఒకసారి ఇద్దరు మిత్రులు కలుసుకున్నారు. అందులో ఒకాయన కమ్యూనిస్టు. అయన రెండవ మిత్రుడితో 'ప్రపంచంలో అతి ముఖ్యమైంది తిండి సమస్య. అది ఒక్కటి పరిష్కరింపబడితే తక్కినవి సమస్యలే కావు' అన్నాడు. ఆ రెండవ మిత్రుడు 'అంతేనా? అంతేనా? అంతేనా?' అని మూడుసార్లు అడిగి మూడుసార్లూ ఆ సమాధానాన్నే చెప్పించుకున్నాడు. ఆ తర్వాత "అయితే నీ సమస్య నేను పరిష్కరిస్తాను. నీకు ప్రతిరోజూ నీవు కోరుకున్న ఆహారం నేను సమకూరుస్తాను. అయితే ఒక షరతు. ప్రతిరోజూ సాయంకాలం నడివీధిలో నిన్ను నాలుగు చెప్పుదెబ్బలు కొడతాను" - అన్నాడు.

'అదేమిటి-? అన్నాడు కాస్త కోపంతో కమ్యూనిస్టు మిత్రుడు.

'అది అంతే! నీ ప్రధానమైన తిండి సమస్యను నేను తీరుస్తున్నాను. ఇక తక్కినవి సమస్యలే కావు కాబట్టి ఆ ఇతర విషయాలను గూర్చి నీ వాలోచించకూడదు' అన్నాడు రెండవ మిత్రుడు. కమ్యూనిస్టు మిత్రుడికి తెల్లముఖం వేయక తప్పలేదు. ఈ సంభాషణ వినడానికి చాలా హాస్యాస్పదంగా ఉందన్నమాట నిజమే! కాని ఒక గొప్ప రహస్యాన్ని - ఒక నిత్య సత్యాన్ని విడమరుస్తున్నది.

సుఖం కేవలం ఇంద్రియాలకు మాత్రమే పరిమితమై లేదు. ఇందుకు అతీతమైంది మరొకటి ఉంది. దాని పేరే మనస్సు.

నిత్య జీవితంలో పొందే అనుభూతులలో చాలా భాగం మానసికమైనవి. నిజానికి ఇవే ప్రధానమైనవి. శారీరకంగా అంటే ఇంద్రియపరంగా ఎన్ని సుఖసంపత్తులున్నా మానసిక అశాంతితో బాధపడేవాళ్ళు ఎందరో ఉన్నారు.

ఇక్కడ మరో ఇద్దరు మిత్రుల కథ జ్ఞాపకం వస్తున్నది. ఒకసారి ఇద్దరు మిత్రులు కలసి నాసిక వెళ్ళారు. అక్కడ ఒకాయన చచ్చిపోయిన తన తండ్రికి తర్పణాలు వదిలాడు. ఇది అయన మిత్రుడికి నచ్చలేదు. అతడు నాస్తికుడు. ప్రతిదానికి హేతువు కావాలంటాడు. "నీవంతా చాదస్తం. ఇక్కడ నువ్వు నీళ్ళొదిలితే చచ్చిపోయిన మీ తండ్రికి ఎలా అందుతాయి?" అని ప్రశ్నించాడు. అపహాస్యం చేశాడు. కాని ఆయన సమాధానం చెప్పలేదు. ఓ చిరునవ్వు నవ్వి ఊరకున్నాడు. నాస్తిక మిత్రుడు మూఢాచారాలు—మూఢ నమ్మకాలు దేశ ప్రగతికి ఏ విధంగా అడ్డుగోడలవుతున్నాయో వివరిస్తూ మరో పావుగంట చెప్పి ఎలాంటి ఎదురువాదనా లేకపోయేసరికి విసిగిపోయి ఊరుకున్నాడు. ఆ తర్వాత ఇద్దరూ కలిసి తిరుగు ప్రయాణం ప్రారంభించి ఏదో లోకాభిరామాయణం మాట్లాడుకో సాగారు. ఉన్నట్టుండి ఆయన తన నాస్తికమిత్రుని తండ్రి నుద్దేశించి బండబూతులు తిట్టడం ప్రారంభించాడు. ఇందుకాతడికి పట్టరాని కోపం వచ్చింది. "నా తండ్రి నెందుకు తిట్టడ"మంటూ తగవుకు సిద్ధమయ్యాడు. ఆయన అదే చిరునవ్వుతో "శాంతించు మిత్రమా! మీ నాన్నగారిప్పుడు ఇక్కడ లేరు కదా! నేనన్ని తిడితేనేం? ఆయనకు తగలవు. ఆయినప్పుడు నీకెందుకు కోపం?" అన్నాడు. నాస్తిక మిత్రుడు మళ్ళీ నోరెత్తలేదు.

కాబట్టి కేవలం ఇంద్రియ సుఖాలు మాత్రమే లేవు. అంతకు మించినది మరొకటి ఉన్నది. అంతేకాదు. ఇంద్రియ సుఖాలు తాత్కాలికాలు మాత్రమే! క్షణక్షణం ఇంద్రియ సుఖాకాంక్ష పెరుగుతూ ఉంటుంది. ఒక్కొక్కసారి వెగటు కూడా కలిగిస్తాయి. ఎదుర పంచభక్ష్య పరమాన్నాలున్నా ఏ ఒక్కటీ రుచించదు. కారణం

మనసు వాటిమీద లేకపోవడమే. కాబట్టి ఇంద్రియ సుఖాలకన్నా మానసిక సుఖం విలువైనది. శాశ్వతమైనది.

అయితే మనిషికి ఇంద్రియాలు - మనస్సు మాత్రమే కాదు. బుద్ధి కూడా ఉన్నది. మనిషి బుద్ధిజీవి. అతడి సర్వతోముఖ వికాసానికి ఈ బుద్ధియే కారణం. అది మనిషిని మనిషిగా-మనీషిగా తీర్చి దిద్దుతుంది.

బుద్ధి వ్యాపారం విమర్శ. ఇంద్రియాలు - మనస్సు తమకు కావలసినవాటిని కోరుకుంటాయే తప్ప ఆ కోరికలలోని మంచి చెడ్డలను, ఉచితానుచితాలను విమర్శించలేవు. ఆ పని బుద్ధి చేస్తుంది. ఏది అవసరమో, ఏది అనవసరమో విమర్శించి, గుర్తించి ఇంద్రియాలను, మనస్సును నియమిస్తుంది. వెలగల వజ్రాన్ని పారేసి, గాజుముక్కను దాచుకునేవాడు బుద్ధిమంతుడనిపించుకోడు.

ఇందువల్ల ఇంద్రియ మానసిక సుఖాలతోపాటు బుద్ధిగతమైన సుఖం కూడా ఉంటుందని తేలుతున్నది. తన విమర్శనా జ్ఞానం చేత, తన ఆలోచనా శక్తి చేత ఒకడు ఎన్నుకొన్న జీవన విధానం - లక్ష్యం, అతడి సుఖదుఃఖాలకు హేతువౌతున్నది. ఆ లక్ష్యసాధనలో అతడు పొందే వేదనలు-అనుభూతులు అతడికి సుఖాన్నే ఇస్తాయి. తను నమ్మిన సత్యం కోసం భార్యను అమ్ముకోవడమేకాక - చివరకు చంపడానికి కూడా సిద్ధపడ్డ హరిశ్చంద్రుడి కథ మనకు తెలుసు. ఇంద్రియాలు-మనస్సు - రెండున్నూ చంచలమైనవి. బుద్ధి నిశ్చయమైనది. పై రెండింటికన్నా శాశ్వతమైనది. సుఖదాయిని అయినది. ఇందువల్ల బుద్ధిగతమైన సుఖమే మనిషి కోరుకునేది-కోరుకోదగింది కూడా!

అయితే ఈ మూడింటికన్నా ఉత్తమమైంది, ఉన్నతమైందీ అయిన మరో సుఖం ఉన్నది. ఒక తల్లి తన బిడ్డను గట్టిగా కౌగలించుకొన్నప్పుడు ఆమె పొందే సుఖం ఈ మూడూ కాదు. అది ఆత్మకు సంబంధించిన సుఖం. అది వర్ణించరానిది. వివరించరానిది. అందరికీ సమానమైంది. దాని ముందు తక్కినవి గడ్డిపరకలు. భయం-ద్వేషం-నైచ్యం మొదలైన వాటినుండి విముక్తి పొందినప్పుడు మాత్రమే లభించగల పరమోత్కృష్టమైన సుఖం. ఆ సుఖాన్ని పొందడమే మన ధ్యేయము - మన గమ్యము.

ఇంతటితో మన సుఖాల కథ పూర్తి కాలేదు. నిజానికి ఇప్పుడే ప్రారంభమౌతున్నది.

పైన చెప్పుకున్నవన్నీ వ్యక్తిగత సుఖాలు. వీటన్నింటిని వ్యక్తి తానొక్కడు సాధించుకోలేడు. ప్రత్యక్షంగానూ-పరోక్షంగానూ అతడికి ఎందరో వ్యక్తుల - కేవలం వ్యక్తులే కాదు - సమస్త సృష్టి కూడా - సుఖ సంపాదనలో తోడ్పడుతున్నారు. ఒక మంచి భోజనం చేశాం. అందువల్ల మనం కోరుకున్న సుఖం లభించింది. అయితే ఆ భోజనం వెనకాల - ఆ సుఖం వెనకాల - ఆ భోజనాన్ని సిద్ధం చేసిన వంటవాడు, అందుకు కావలసిన పదార్థాలను అమ్మిన వర్తకుడు వాటిని పండించిన రైతు, అతడికి సహకరించిన కూలీలు - ఇలా ఎందరో ఉన్నారు. వీరందరి సమిష్టి శ్రమ ఫలితమే మనం పొందిన భోజన సుఖం.

మనిషి ఒంటరిగా ఒక్క క్షణం కూడా బ్రతకలేడు. అంతే కాదు. తన సుఖాలను - దుఃఖాలను తోటివారితో పంచుకోలేకపోతే అతడికి పరిపూర్ణత సిద్ధించదు. అతడు సంఘజీవి. పరస్పర సహకారం-సౌభ్రాతృత్వం-సమన్వయం-సౌమనస్యం సంఘ జీవనానికి పునాదులు. సాంఘిక సుఖం పరస్పర సేవా తత్పరత వల్లనే ప్రేమమూల్ల ఎదుగుతుంది. అదే మనిషికి నిరంతర తృప్తిని కలిగిస్తుంది. ప్రతి ఒక్కరూ తోటివారితో కలసి మెలసి బ్రతుకుతూ, ఒకరికొకరు తోడ్పడుతూ జీవించడమే నిజమైన సుఖం. ఇలాకాక వ్యక్తి తన ఒక్కడి సుఖం కోసం మాత్రమే బ్రతికితే - ప్రతివాడూ తన స్వంత సుఖమే సామాజిక సుఖం అనుకుంటే ఈర్ష్య - అసూయ - ద్వేషం ప్రజ్వరిల్లి జీవితం నరకమౌతుంది. సమాజం ఛిన్నాభిన్నమౌతుంది.

నిజానికి 'సృష్టి పరస్పర సహకార సూత్రంపై నిర్మించబడింది. ఈ విషయాన్ని శ్రీ భగవద్గీత చాలా తార్కికంగానూ—అందంగానూ వివరించింది. ఈ పరస్పర సహయోగానికి గీత పెట్టిన ముద్దు పేరు యజ్ఞం. జీవుడు అన్నం నుండి-అన్నం పర్జన్యుడి నుండి-పర్జన్యుడు యజ్ఞం నుండి - యజ్ఞం బృష్యము నుండి పుట్టాయని గీతావాక్కు.

మనముందు నాలుగు మహత్తత్త్వాలు ఉన్నాయి. వ్యష్టి-సమిష్టి-సృష్టి-పరమేష్ఠి-ఇవి నాలుగూ ఒకదానితో ఒకటి విడదీయరాని బంధం కలవి. ఇవి నాలుగూ కలిస్తేనే పరిపూర్ణమైన జీవన చక్రం ఏర్పడుతుంది. ఆ చక్రంయొక్క అఖండత్వమే పరమ సుఖం. దాని మరోపేరు ధర్మం. అంటే పరస్పర సహకారంవల్ల-కర్తవ్య పాలనవల్ల ఏ ధర్మం ప్రకాశితమౌతున్నదో అదే సుఖం, అదే శాశ్వత సుఖం.

పరమమైన ఈ సుఖాన్ని పొందడానికి నాలుగు విషయాలు అవసరం. విద్య-స్వాతంత్ర్యం-శాంతి-పౌరుషం. పైన చెప్పుకొన్న

యజ్ఞచక్రం - జీవనచక్రం - సాఫీగా, నిరంతరాయంగా పరిభ్రమించేందుకు తోడ్పడేది విద్య. అటువంటి విద్యను వ్యక్తికి అందచేసే బాధ్యత సమాజంపై ఉంటుంది. ఆ బాధ్యతను సమాజం సక్రమంగా నిర్వహించాలంటే దానికి స్వాతంత్ర్యం కావాలి. నేను - నా జాతి - నా దేశం అన్న స్వాభిమానం ఉన్నచోట స్వాతంత్ర్యం బ్రతుకుతుంది. స్వాభిమానం - శాంతి - పౌరుషాల ఫలం. ఇవి సాధన చతుష్టయాలు.

వీటిని కాపాడటం కోసం నాలుగు శక్తివంతమైన వ్యవస్థలు ఏర్పాటు చేయబడ్డాయి. విద్యాభివృద్ధికి గురుకులాలు - స్వాతంత్ర్య పరిరక్షణకు రాజ్యము - పౌరుషానికి వర్ణధర్మాలు - శాంతికి ఆశ్రమ ధర్మాలు.

ఈ విధంగా చతుర్విధ వర్ణాశ్రమ ధర్మాలు ఆధారంగా, చతుర్విధ సాధనాల సహాయంతో, చతుర్విధ పురుషార్థాలను సాధించడంలోనే మానవుడు కోరుకునే పరమోత్తమమైన సుఖం ఉన్నది. ఆ సుఖ సంపాదనమే పరమ లక్ష్యంగా మన సమాజం - మన సంస్కృతి నిర్మించబడ్డాయి.

ఈ రహస్యాన్ని తెలుసుకోవడం - అవగాహన చేసుకోవడమే చైతన్యం. జాతీయమైన ఆ చైతన్యమే మన ధ్యేయం, మన గమ్యం. ఆ గమ్యాన్ని చేరుకొన్నప్పుడు అంతా పరమ సుఖమే! "సర్వే జనాః సుఖినో భవంతు" అంటే అర్థం ఇది.

# గుండె సెగలు

## శ్రీ కీర్తి నాగరాజు

సూర్యుని కిరణాలు
చురుక్కుమని శరీరాన్ని
గిల్లుతున్నా హాయిగా
మొద్దునిద్ర చేసేవాళ్ళం!
అణగద్రొక్కుకున్న సహనం
ఇక భరించలేక ఇంటిపెద్ద
గది తలుపులు బాది లేవగొడితే....
గాఢ చీకటి కనురెప్పలు
బరువులు తెరుస్తూ
చూడరాని వికార ఆకారంలో
అలాగే వచ్చి తలుపు తెరిచి
నిలచే ప్రజ్ఞావంతులం మేము!
ప్రొద్దంతా కాకమ్మ కబుర్లతోను
సరదాల వినోదాల విన్యాసంలోను
అలిసి సొలసి తొలిప్రొద్దు జామునకు
నూనె ఇగిరిపోయిన దీపంలా
ప్రక్కమీద అనివార్యంగా
వాలిపోయే
ఆహా....శ్రమజీవులం మేము!

# జీవి

## —'రఫి'

సామ్రాజ్యపు సార్వభౌమాధికారాల స్థానంలో–
శిథిలాలు, సమాధులు మాత్రమే మిగిలాయి నేడిక్కడ...
విశేషగవాక్ష మార్గాన్వేషణలో - ఎదురయ్యే ఒక్కో
ప్రాకారం వెనుక ఒళ్ళు గగుర్పొడిచే కథలున్నయ్....
నిర్మలంగా కనవచ్చే ఈ ఇసుక -
తనలో రక్తసముద్రాలనే ఇముడ్చుకుంది. అవునా!
ఒక్కొక్క వీరుడి సాహసం వెనుక -
ఎన్ని తెగిన మాంగల్యపు అశ్రుఘోషలున్నాయో!
ఎన్ని అపశృతులు.... ఎన్ని అశనిపాతాలు ...
ఎన్ని శోకసముద్రాలు.... మరెన్ని వేదనా హృదులు...
వైభవాలు.... భోగాలు....విజయాలు ఓటములు....
ఎన్నింటిని...మరెన్నింటినో...మౌనంగా తనలోదాచుకుని
పుస్తకముల్లో కాలప్రవాహంలో దాక్కున్నది "చరిత్ర"
కాలమంత కర్కశ.... కాఠిన్యజీవి....మరేదీ లేదు.
మనసులేదు దానికి.... మమత ఉండదు దానికి
నీ అనుభవాలతో....అనుభూతులతో దానికి పనిలేదు.
మరుక్షణంలో ఏమవుతావో తెలియని నీవు___
కాలవేగం కన్నా మించిపోయి ఆలోచించు...
మానవతా వృక్షాలను నీలో పెంచు....
పదుగురికి మంచిని పెంచు....



మొటిమలు ?
బైద్యనాథ్ సురక్తాస్ట్రాంగ్
మొటిమలు, చర్మవ్యాధులకు కారణమైన అపరిశుద్ధ రక్తమునకు కారణము అంత్రములు ఉదరము సరిగా పనిచేయకపోవటమే
సురక్తా జీర్ణక్రియ సరిగా జరుగుటకు సహాయపడి చర్మమును మృదువుగాను, సుందరముగాను చేయును.
సురక్తాస్ట్రాంగ్ మలిన రక్తమునుండి చర్మరోగములనుండి మిమ్ములను కాపాడును.
Baidyanath
SURAKTA
STRONG.
బైద్యనాథ్ సురక్తాస్ట్రాంగ్
మొటిమలు మొదలగువాటి నివారణకు సురక్షితమైన
విశ్వసనీయమైన ఆయుర్వేద ఔషధము

SKT 67 T SVR

# ఏనాటికీ ముగియని కథ


కన్నడమూలం :

**డా॥ యు. ఆర్. అనంతమూర్తి**

తెనిగింపు :

**శ్రీ శంకరగంటి రంగాచార్యులు**


టైమ్ ప్రెజెంట్ అండ్ టైమ్ పాస్ట్
ఆర్ బోత్ పర్ హాప్స్ ప్రెసెంట్ ఇన్ టైమ్ ఫ్యూచర్
అండ్ టైమ్ ఫ్యూచర్ కంటైన్డ్ ఇన్ టైమ్ పాస్ట్

టి. యస్. ఎలియట్.

"బయట శానా చలిగా వుండాలి."

పండు పండు ముసలివాడు మనస్సులోనే చలిని వూహించుకుని వణికి, ధగధగ మండుతూన్న కుంపటి పద్ద ఒళ్ళు కాచుకుంటూన్నాడు. ఏవేవో స్మృతులు మనస్సులో మెదలాడుతాయి....ఎన్నేళ్ళ క్రిందటివో ఏమో!....

కాంతిగా మండే నిప్పుల్లా వెలుగుతున్నాయి...ఆ ముసలికళ్ళు..

ఏమో తృప్తి!....

దేవుడి దయ అనాలి. సుఖమైన బదుకు. నిండుగృహం. వయస్సయినా ఇంటి బాధ్యతనంతా అతడి కొడుకే వహిస్తూన్నాడు. అతడికి చేతికి అందుబాటులోకి పచ్చిన నలుగురు కుమారులు, అందరికీ లక్ష్మీదేవుల్లాంటి భార్యలు....మళ్ళీ ముద్దుముద్దుగా పుట్టిన ఆ మనముల పిల్లలు మునిమనుములు!!

ఎంత అదృష్టవంతుడు ముసలివాడు!

రెండు పూటలకూ అయి మిగిలేటట్టు వడ్లు పండుతూన్న మాగాణి!....చిన్నదైనా ఉత్తమంగా పంటనిస్తూన్న పోకతోటా!.... అన్నీ....కొట్టం నిండా పాడి పశువులూ....అన్నీ—ఉన్నాయి.

ఇంకేం కావాలి, ఇంతకన్నా?

తొంభై ఏళ్ళు వచ్చినా రాయిలాంటి ఒళ్ళు. కొడుకు అధికారంలోకి వచ్చినా తన్నడగకుండా ఏపనీ చేయడు. అదలా వుండనీ... ఎంతభక్తి వాడికి! ఈనాటికీ తన్ను తలయెత్తి చూడడుగదా!....ఇక ప్రాయపు మనుమలు....ఈకాలం వాళ్ళయితే ఏమంటే తాతయ్యంటే వాళ్ళకు నాన్నగార్లకన్నా ఎక్కువ ప్రేమ....

* * *

....లోపల్నుంచి జోలపాట వినవస్తోంది....

"ఏడ్చు వేలర రంగ
ఏమి కావలె నేకు...
నాలుగెనుములు పిండినట్టి పాల్ చక్కెరా
నీ వడిగినపుడంత ఇస్తానులేరా
వోవలా హోనీ....చిట్టి జోజో
జోజో - బాబూ....జోజో........"

ఇంకెవరంత బాగా జోలపాట పాడతారు? అతడి ముసల్దే!.... ఆ చిన్న మనుమడి పాపడిని ఊచుతూండాలి...

ఔను! ఆ పాపడికి అతడి పేరే పెట్టారు. అతడి ముఖంలాగే వాడి ముఖమూనూ .. హుం! అతడి లాగే హఠమారి తనం కూడా!..

ఇప్పటికి ఎనభై రెండేళ్ళక్రితం... శానా కాలంక్రితం అతడూ అలాగే ఏడ్చేవాడు! అపుడు అతడి అవ్వకూడా పూచి లాలి పాడుతూండేది.

అదే జోలపాట!

"ఏడ్చువేలర రంగ, ఏమికావలె నీకు....నాలుగెనుములు పిండినట్టి పాల్ చక్కెరా...."

ఆ జోలపాటకు ముగింపే లేదేమో!

ఆ తొట్లలోనే....తాను!....

తన కొడుకూ!....

కొడుకు కొడుకూ!....

అతడి కొడుకు కొడుకు కొడుకూ!....

ఆ తొట్ల ఊగక ఆగిన దినమే లేదు!

ఆ జోలపాట పాడని దినమూ లేదు!

అతడి పాలిటికి ఆజోలపాట ఎంత సత్యం

అతడి ఇంట్లో పుట్టిన పిల్లలు ఎందుకేడ్వాలి? కావలసినవన్నీ ఉన్నాయి. ఇంట్లో నాలుగెనుములెందుకు? ఆరెనుములున్నాయి! ఇంట్లో జనం నిండుగా వున్నారని ఇంకా మొన్నే అతడి కొడుకు జాతరకు వెళ్ళి మరొక ఎనుము తెచ్చాడు.

ఆ నాలుగెనుములంటేనో - తన ఇంట్లోనే పుట్టి పెరిగాయి,. వాటి తల్లి,తల్లి,తల్లి,తల్లి, అవ్వ పాలో ఏమో తను తాగి పెరిగింది....

* * *

హూం! మొదలైంది హదమారితనం! వాడే పెద్ద మనుమని కొడుకు!...ఇంకేముంటుంది! 'కథ చెప్పు....' ఒకటే పోరు! అతడి ముసల్దానికి ప్రతి నిత్యపు గోడు!....

ఔను! అతడి లానే కదా అతడి మనుమలు! 'తాత ప్రతి బింబాలు' అంటూ వాళ్ళ తల్లులు ఎందుకు దూరుతూంటారు? .... ముసలివాడి ముఖం తృప్తితో విప్పారుతుంది .... ఔను! అతడూ అలానే చేస్తూవుండలేదా, పిల్లవాడై వుండినప్పుడు? అవ్వ కథ చెబితే తప్ప నిద్రపోయిన దినం ఒకటైనా వుందా?....

ఆ ఒక కథను మాత్రం.... హో! అదే! అదే కథ!

అతడి అవ్వ అతడికి చెప్పిన కథ!....

అతడి లానే అతడి మనుమడి కొడుకూ తన అవ్వను వేధించి, కథ వింటూన్నాడు....

ముసలిదానికి ఆకథ ఎవరు చెప్పారు? అతడి అవ్వ అతడి కొక్కడికే చెప్పిన ఆకథ అతడి ముసలిదానికెలా తెలిసింది?... ఏమో జ్ఞాపకమే రాదు!

అతడే కదా?....

ఆరోజు!....సంక్రాంతికి ముందు!....పొలంలో వంగి పనిచేస్తూ వున్నపుడు ఆమె చెంపకు తన చెంపను సోకిస్తూ....

ముసలివాడి ముఖం ముడుతలుపడి వుండినా సిగ్గుతో ఎర్ర బారుతుంది! మనస్సులోనే ముసిముసి నవ్వు నవ్వుతాడు!....

అతని ఆ అవ్వకు ఎవరు చెప్పి వుంటారు?....

ఇంకెవ్వరు?....అతడి ఆ తాతయ్యే!....

అతడికి?... అతడి అవ్వ!....

ముసలివాడు తన ఆలోచనలకు తానే నవ్వుకుని, మంటను మరింత పెద్దదిగా చేసి, వీపు రాచుకుంటాడు....

ఔను! అదేకథ!....వంశపారం పర్యంగా తామందరూ వింటూ వచ్చిన కథ! అదే ముగియని కథ! ఏనాటికీ ముగియని కథ! .... ఐదు, ఆరు, ఏడు, ఎనిమిది — ఎందుకు? ఏళ్ళతరబడి చెప్పినా ముగియని కథ!....

అతడు తన అవ్వను అడిగినపుడంతా ఆమె చెప్తూవుండేది....

"రేపు ముగుస్తుందా?...."

"ఊఁ హుఁ..."

"ఎల్లుండి?...."

"ఊఁహుఁ..."

"ఇంకెప్పుడు?...."

"ఎప్పుడూ ముగియదు...."

"ఎందుకు?...."

....అతడు ఎనభై రెండేళ్ళ క్రితం అతడి అవ్వను కుతూహలంగా అడిగాడు

అపుడామె బహు గంభీరధ్వనితో చెప్పింది.

"ఈ కథ చివరికి వస్తే-పొద్దు పొడవదు, చెట్టులో పండ్లు కాగవు-తీగలో పూలు పూయవు మనుమలకు కథ చెప్పే అవ్వలు బతకరు!"

ఇప్పటికీ ముసలివాడు అవ్వ మాటల్లో నమ్మకం పెట్టాడు ఆ కథ ఏనాడూ తుదముట్టరాదు. ముట్టితే?

అతడి అవ్వ ఆరోజు చెప్పివుండలేదా, ఏమవుతుందని?

* * *

ముసలివాడికి చెవులు చాలా చురుకైనవి. అతడి ముసల్ది మునిమనుమనికి చెప్తూన్న కథను చెవియొగ్గి వింటాడు.

తను పాపడై వుండినపుడు అవ్వ తొడమీద పడుకొని వింటూవుండిన చిత్రం కనులముందు కదలుతుంది.

అతనికేమో ఆశ్చర్యమవుతుంది. అతడి ముసలిది ఆకథనింతా సాగదీసి, సాగదీసి చెప్పతూవుంది!....

నిదానంగా....పాపడికి నిద్రను తెప్పించే గంభీరమైన, కంపిస్తూన్న స్వరంతో....

ఎక్కడో కొంచెం కొంచెంగా వినబడుతోంది.

"...తరువాత....ఆ రాజకుమారుడూ, రాజకుమారీ నిండు ప్రేమతో బతుకుతూంటే....ఒకానొక దినం.. అయి, చనిపోయారు... చనిపోయినా తోడుగానే వున్నారు....ఇద్దరూ ఆకాశానికి పోయి, రెండు మేఘాలై, అక్కడంతా సంచరిస్తూ సుఖంగా వున్నారు .... ఒకదినం రాజకుమారుని మేఘం బరువెక్కి, వానై క్రిందపడింది...ఒక కొలనులో నీళ్ళలో చేరుకుంది... అప్పుడు రాజకుమారి కొలనులో చేపగా వచ్చి చేరుకుంది....తర్వాత ఇట్లే ఉంటూండగా, ఒకానొక దినం ఒక బెస్త వాడు ఆ చేపను పట్టుకుని తినేశాడు....నీళ్ళై వుండిన రాజకుమారుడు కృశించి, కృశించి, చిక్కిపోయి, మేఘమైనాడు .... చేపను తిన్న బెస్తవాడు ఇట్లే వుంటూ ఒకదినం చచ్చి మన్నయ్యాడు .... ఆ మట్టి నుంచి చెట్టొకటి పుట్టింది. చూడు, బాబూ, చేపై బెస్తవాడిలో చేరి వుండిన రాజకుమారియే అలా అయింది ... మేఘమైన రాజకుమారుడపుడు ఆచెట్టుకు వానై కురిశాడు .... ఒకటం అక్కడినించీకూడా వాళ్ళిద్దరికీ ఎడబాటు కలిగింది .... రాజకుమారి పోయి చంద్రుడిని చేరింది రాజకుమారుడు వెళ్ళి సూర్యుడిని చేరాడు. చూడు బాబూ, అందుకే చంద్రుడు రాజకుమారిని మోసుకుని ఆకాశంలో తిరుగుతాడు....అయితే సూర్యుడు క్రూరుడు చూడు ...అతడికి దూర

దూరంగా పరుగెత్తిపోతాడు...అప్పుడు రాజకుమారీ, రాజకుమారుడూ కూనా దుఃఖంతో ఏడుస్తారు....అందుకే తెల్లవారు ఝామున ఈ భూమి మీదంతా మంచు బొట్లు బొట్లుగా పడివుంటుంది....

పిల్లవాడు ఉత్సాహంగా నడుమ అడుగుతున్నాడు:

"ముగిసిందేమవ్వా, కథః"

"లేదు, బాబూ...."

"రేపటికి ముగుస్తుందాః"

"ఏనాటికీ ముగియదు, బాబూ"

"ఎందుకవ్వాః"

ఆ పిల్లవాడు అతడు అతడి అవ్వను ప్రశ్నించినట్లే, ఇపుడు తన అవ్వను మొండిగా అడుగుతున్నాడు.... ఔను.... అతడి అవ్వ జవాబునే ఇపుడు అతడి ముసలిది తన మనుమలకు చెబుతూవుంది. అతడి అవ్వ మాదిరిగానే అతడి ముసలిదికూడా నెలల తరబడి ఆ కథను కొత్తకొత్తగా అల్లి, ముందుకు లాక్కుని పోతుంది.... అతడి ఇంట్లో పుట్టిన పిల్లలందరూ ఆ ముగియని కథను వింటూ ఎన్నో రోజులు నిద్రపోయారు.

ఇలానే....

ఆ రాజకుమారీ రాజకుమారుల కథ ఇంకా కొనసాగి ముందుకు పోవడం విన్నాడు అతడు....ప్రతిసారీ ఎలాగో ప్రయత్నించి, మళ్ళీ కలుసుకుంటారు. అలాగే ప్రతిసారీ వేర్పడతారు.... మళ్ళీ కలుసు కుంటారు....

తుది మొదటిలేని అనంతమైన కథ.... అనంతములైన రూపాల్లో వాళ్ళ ప్రేమ.... పూవై, కాయై, నీళ్లై మేఘమై, గాలై, అగ్గియై,- ఒకటాః రెండాః.... ముగియని కథ.... ఏనాటికీ ముగియని కథ!....

అతడికి అన్నం పెట్టిన పొలంలానే ...

అతడిని ఊచిన తొట్లలానే...

తన్ను లాలిలో నిద్రపోగొట్టిన-ఆ జోలపాటలానే....

కొడుకులూ, మనుమలూ, మునిమనమలూ అనక సతతంగా, అనంతంగా ఒకరినుంచీ ఒకరికి సంక్రమించిన కథ!

—ఔను! అది ముగియరాదు, ముగిస్తే?—

—అతడి అవ్వ చెప్పి వుండలేదాః ఏమవుతుందని?

* * *

....పాపడికి నిద్రవచ్చివుండాలి— ముసలిది చలికాచుకోవాలంటూ ముసలివాడి పక్కనవచ్చి కూర్చుంటుంది.

"కూనా వీపు దురద...."

థూః ఏం సుఖమాశిస్తూంది ముసల్ది! మొగుడంటే కొంచమైనా సిగ్గులేదుః ఇలా వీపు గీరమని అడుగుతుంది; నిత్యమూ....

ముసలివాడు నవ్వి, గుద్ది, ఆమెకు కొంచెం బాధకలిగేటట్టే అదేపనిగా గట్టిగా గీరుతాడు.

ఔను! ఆ ముసలివాడి అవ్వకూడా అలాగే....

మనుమలకు, 'అర్థరాజ్యమిస్తాను వీపు గీరితే' అని ఒప్పించి, గీరించుకున్నది చాలక, అతడిప్పుడు, చలికాచుకుంటూన్న కుంపటి ముందే కూడుని, తన మొగుడిచేతకూడా గీరించుకుంటూవుండేది.

అతడి ముసలిది అతడి అవ్వలానే-అన్నిటిలోనూ,

కొంతవరకూ రూపంలోనూ.

...ఏమో కిలకిల నవ్వినలా వినబడుతోంది.... ముసలివాడు వీపు గీరడం నిలిపి చెవియొగ్గి వింటాడు....

ఓ, అతడి చిన్న మనమడూ, అతని భార్యా.

ఇంకేంః పగడకాయలు కావొచ్చు.... ముప్పొద్దులూ అదే పిల్లాట.... ఎంత ధైర్యంగా, గట్టిగా నవ్వుతారు!.... ఏం ముద్దో, ఏమో!....

గొణుక్కుంటూ ముసలివాడు ముసిముసి నవ్వుతాడు.

పాపం....ఇంకా పసివాళ్ళు.... పెళ్ళై ఇంకా ఎక్కువరోజులు కాలేదు ...ముసలివాడు నవ్వుతూ దూరుతాడు.

ముసలిది సిగ్గుపడి, కుంపటిముందు పెళ్ళికూతురిలా ముసలివాడితోకూర్చుని, చిరునవ్వు నవ్వుతుంది.

మనమలను ఎందుకు దూరాలిః.... ఎంత దొంగ ఆ ముసలివాడు! ....ముసలిదాని సిగ్గుతో ఎరుపెక్కిన ముఖం చూస్తే తెలియడంలేదాః....చాలా కాలంక్రితం....వాళ్ళిద్దరూ పగడకాయలాడాక, ఆడుతూ కొట్లాడక.... పడుకొనడానికి వెళ్ళిన దినం ఒకటైనా వుండేదాః

అవే పాచికలు,

అదే పట్ట.

అవే కాయలు,

ముసలివాడి అవ్వ, తరువాత ఆ ముసలివాడు, తరువాత అతడి కొడుకు, ఇపుడు మనుమడు,— అందరూ వాటితోనే తమ ప్రేమక్రీడలు కొనసాగించారు....

జీవనప్రవాహం నిరర్గళంగా సాగుతోంది....

ఇది ఎపుడైనా ముగుస్తుందాః

ఊహు!....ఏనాటికీ ముగియదు...

ఆ కథలాగే ఈ ప్రేమక్రీడలు ఏనాటికీ ముగియవు.

ఎపుడైనా ముగిసిపోతేః....

—అతడి అవ్వ చెప్పి వుండలేదాః ఏమవుతుందనిః—

"అప్పుడు పొద్దుపొడవదు- చీకటిపడదు- చెట్టులో పండ్లు కాయవు- తీగపూలు పూయదు ..."

ప్రొఫెసర్ బి. ఆర్. కె. రావు

# భారతదేశ అల్ప ఆర్థికాభివృద్ధి

## వివరాలు : కారణాలు : పరిష్కారాలు

### ఆర్థిక స్థితినిబట్టి దేశాల వర్గీకరణ :

ఆర్థిక పరిస్థితుల ననుసరించి, ప్రపంచదేశాలు మొదట్లో (1) ముందంజ వేసిన దేశాలుగాను (2) వెనుకబడిన దేశాలుగాను విభజించబడినై. వెనుకబడిన దేశమంటే గౌరవప్రదంగా లేదని భావించబడింది. అందువల్ల ఆ దేశాలను తదుపరి (1) అభివృద్ధి చెందిన దేశాలని (2) అల్పాభివృద్ధి దేశాలని వర్గీకరించారు. కాని అల్పాభివృద్ధి అనే వివరణ కూడా అంతగా తగిన వివరణగా ఎంచబడ లేదు. తత్కారణంగా ప్రపంచ దేశాలు (1) అభివృద్ధి చెందిన దేశాలు గాను (2) అభివృద్ధి చెందుతున్న దేశాలుగాను - వర్థమాన దేశాలు గాను విభజించబడినవి. అభివృద్ధి చెందిన దేశానికి, అల్పాభివృద్ధి చెందిన దేశానికి వున్న వ్యత్యాసం స్పష్టంగా కన్పించలేదు. ఈ భేదం తులనాత్మకం మాత్రమే. అంతేగాక ఉద్దేశపూర్వకంగా చెప్పినట్లు కన్పించింది. అందువల్ల అభివృద్ధి చెందిన దేశాలు, అభివృద్ధి చెందుతున్న - వర్థమాన దేశాలు అని చెబితే - యదార్థత, ఔచిత్యమును వుంటుందని భావించబడింది. అల్పాభివృద్ధి దేశానికి భాష్యం చెప్పడం కష్టంగా కన్పించిందని మిత్రరాజ్య సమితి ప్రవీణుల సంఘం నివేదిక (1951 - పే. 3) తన అభిప్రాయాన్ని వ్యక్తం చేస్తూ - అమెరికా సంయుక్త రాష్ట్రాలు, కెనడా, ఆస్ట్రేలియా, పశ్చిమ ఐరోపా దేశాల తలసరి ఆదాయంతో పోల్చినపుడు, తక్కువ తలసరి ఆదాయాలు గల దేశాలను, అల్పాభివృద్ధి దేశాలుగా పరిగణించినట్లు చెప్పింది. అందువల్ల అల్పాభివృద్ధి దేశాలు అనే పదానికి బీదదేశాలు అనే పదము పర్యాయ పదము - మారు పేరు - అవుతుంది.

### తులనాత్మకంగా అల్పాభివృద్ధి :

అమెరికా సంయుక్త రాష్ట్రాల వాస్తవిక తలసరి ఆదాయంలో నాల్గవ వంతుకు తక్కువగా వున్న వాస్తవిక తలసరి ఆదాయాలు గల దేశాలు అల్పాభివృద్ధి దేశాలుగా చెప్పబడినవి. ఇటువంటివాటిలో అభివృద్ధి చెందుచూ వున్నవాటిని వర్థమాన దేశాలని చెప్పసాగారు. ప్రస్తుతం మిత్రరాజ్యసమితి ప్రచురణలు (1) అభివృద్ధి చెందిన ఆర్థిక వ్యవస్థలు, (2) అభివృద్ధి చెందుచూ వున్న - వర్థమాన-ఆర్థిక వ్యవస్థలు అనే వర్గీకరణను ఉపయోగిస్తున్నవి. ప్రపంచబ్యాంకు తన 1982 నివేదికలో తలసరి స్థూల జాతీయాదాన్నిబట్టి వివిధ దేశాల వర్గీకరణ చేసింది.

### ప్రపంచ బ్యాంకుచే వివిధ దేశాల వర్గీకరణ :

ఆ వర్గీకరణ కనుసారంగా వర్థమాన దేశాలు రెండు తరగతులు: (1) అల్ప ఆదాయ దేశాలు — వీటి తలసరి స్థూల ఆదాయము 410 అమెరికా డాలర్లు గాని అంతకు తక్కువగా గాని వుంటుంది. (2) మాధ్యమిక ఆదాయ దేశాలు - వీటి తలసరి స్థూల జాతీయ ఆదాయము 410 అమెరికా డాలర్లకు మించివుంటుంది. ఈ మాధ్యమిక ఆదాయ దేశాల తలసరి స్థూల జాతీయ ఆదాయము 410 అమెరికా డాలర్లకు 4500 అమెరికా డాలర్లకు మధ్య వుంటుంది.

మిగతా దేశాలు ఉన్నత ఆదాయ దేశాలుగా చెప్పబడినవి. ఇవి మూడు రకాలుగా విభజించబడినవి :

### ఉన్నత ఆదాయ దేశాలు :

(1) నూనెను ఎగుమతి చేసే ఉన్నత ఆదాయ దేశాలు. వీటిని వర్థమాన దేశాలలో కలుపలేదు. ఇవి కువైట్, లిబ్యా, సౌదీ అరేబియా, యునైటెడ్ అరబ్ ఎమిరేట్స్ దేశాలు. వీటి సగటు తలసరి ఆదాయము 12,630 డాలర్లు. వీటి ఆదాయం వున్నతంగా వుండటానికి, అవి పెట్రోలును. తత్సంబంధిత పదార్థాలను ఎగుమతి చేయడమే కారణము. కాని వీటికి ఆధునికాభివృద్ధి లక్షణాలు లేవు. ఆధునికాభివృద్ధి దృష్టిలో మాత్రం ఇవి అభివృద్ధి చెందిన దేశాలుగా పరిగణించబడటానికి వీలులేదు. పెద్ద ఎత్తున ఆదాయాలున్నయ్యి కాబట్టి, ఇవి భవిష్యత్తులో అభివృద్ధిని పొందవచ్చు. (2) పారిశ్రామికంగా అభివృద్ధి చెంది ప్రపంచ విపణివీధి ఆర్థిక కార్యకలాపాలు గల దేశాలు (3) విపణి కార్యకలాపాలు లేకపోయినా పారిశ్రామికాభివృద్ధి గాంచిన దేశాలు. ఇవి కమ్యూనిస్టు దేశాలు.

## తులనాత్మక దృష్టినిబట్టి అభివృద్ధి కృషి ఆవశ్యకత :

అభివృద్ధి చెందిన దేశాలకు చెందిన స్థూల జాతీయాదాయాలను, ప్రపంచ స్థూల జాతీయాల్లో వాటి శాతానుపాతాలను, వాటి జనాభాలను, ప్రపంచ జనాభాల్లో వాటి శాతానుపాతాలను, అలాగే అల్పాభివృద్ధి చెందిన దేశాలకు చెందిన స్థూల జాతీయాదాయ, జనాభాలను, ప్రపంచ స్థూల జాతీయాదాయ, జనాభాలలో వాటి శాతానుపాతాలను చూస్తే, తులనాత్మకంగా అల్పాభివృద్ధి దేశాలు, అభివృద్ధి చెందిన దేశాలకంటె ఎంతగా వెనుకబడివున్నయ్యో, అవి ఎంత తీవ్రంగా కృషి చేస్తే ముందంజ వేసి అభివృద్ధి చెందిన దేశాల పంక్తిలోనికి రాగలవో వూహించుకోవచ్చు. ఆ వివరాలను యిచ్చట పొందుపరుస్తున్న పట్టిక-1లో చూడవచ్చు.

పట్టిక - 1

### వర్గీకృత దేశాల రకాలలో జనాభా : స్థూల జాతీయాదాలు - 1979

| దేశాల రకాలు | జనాభా (మిలియన్లు) | ప్రపంచ జనాభాలో శాతం | తలసరి జాతీయాదాయం (డాలర్లు) | ప్రపంచ, స్థూల జాతీయాదాయంలో శాతం |
|---|---|---|---|---|
| 1) అల్పాదాయ దేశాలు | 2,260 | 52.7 | 520 | 5.3 |
| 2) మాధ్యమిక ఆదాయ దేశాలు | 985 | 22.9 | 1399 | 14.2 |
| 3) అభివృద్ధి చెందిన పారిశ్రామిక దేశాల విపణి ఆర్థిక వ్యవస్థలు | 671 | 15.6 | 6334 | 64.1 |
| 4) ఉన్నత ఆదాయాలు గల నూనె ఎగుమతి చేసే దేశాలు | 26 | 0.6 | 142 | 1.4 |
| 5) విపణి ఆర్థిక కార్యకలాపాలు లేని పారిశ్రామికాభివృద్ధి గాంచిన దేశాలు (సోషలిస్టు వ్యవస్థలు గల కమ్యూనిస్టు దేశాలు) | 351 | 8.2 | 1,485 | 15.0 |
| 6) ప్రపంచ వెరశి | 4,293 | 100.0 | 9330 | 100.0 |
| 7) భారతదేశ స్థితి | 659 | 15.4 | 125 | 1.3 |

మూలము: వరల్డ్ డెవలప్‌మెంట్ రిపోర్టు 1981లో యివ్వబడిన గణాంక సమాచారం.

## జనాభా ఎక్కువ, ఆదాయం తక్కువ :

అల్పాభివృద్ధి దేశాలు జనాభాలో పెద్దవిగను, ఆదాయంలో తక్కువగాను వున్నవి. అభివృద్ధి చెందిన దేశాలు జనాభాలో చిన్నవిగాను, ఆదాయంలో పెద్దవిగాను వున్నవి. నూనె ఎగుమతి చేసే దేశాల జనాభా చాల తక్కువే అయినా ఆదాయాలు చాల గణనీయంగావున్నవి. పారిశ్రామికాభివృద్ధి గాంచిన యితర దేశాలు విపణి కార్యకలాపాలు లేకపోయినా తక్కువ జనాభాలతో ఎక్కువ జాతీయాదాయాలను పొందుతున్నవి. భారత జనాభా చాలా పెద్దది. దాని జాతీయాదాయం మాత్రం తక్కువ. ప్రపంచ జాతీయాదాయంలో భారత జాతీయాదాయ శాతం చాల చిన్నది. అందువల్ల మనము మన దేశభక్తిని, స్వయాభివృద్ధి కాంక్షను, అభివృద్ధి సాధనాకృషిని చాలా పెంపొందించుకోవలసి వున్నది. అప్పుడే ప్రపంచ అభివృద్ధి చెందిన దేశాల పంక్తిలో మనకు గణనీయమైన గౌరవస్థానం లభిస్తుంది. లేదా, మనకు అనుకూలమైన మాటలు చెబుతూనే, అభివృద్ధి చెందిన దేశాలు మనకు గౌరవాన్నిగాని, అవసరమైన సమయంలో సహాయాన్నిగాని ఇవ్వవు. అంతర్జాతీయ వ్యవహార రంగంలో బలవంతునికే అగ్రస్థానం; వారిదే పైచేయి. సందేహపడవలసిన పని లేదు.

పారిశ్రామికాభివృద్ధి గాంచి, విపణి వీధి కార్యకలాపాలు గల దేశాలలో ఐర్లెండ్, ఇటలీ, న్యూజిలెండ్, ఇంగ్లండ్, ఫిన్లాండ్, ఆస్ట్రియా, జపాన్, ఆస్ట్రేలియా, కెనడా, ఫ్రాన్సు, నెదర్లాండ్స్, అమెరికా సంయుక్త రాష్ట్రాలు, నార్వే, బెల్జియం, ఫెడరల్ రిపబ్లిక్ ఆఫ్ జర్మనీ, డెన్మార్క్, స్వీడన్, స్విట్జర్లాండ్ చేర్చబడినవి. ఈ దేశాల్లో సగటు జాతీయ తలసరి ఆదాయం 10,320 అమెరికన్ డాలర్ల వరకు వున్నది. అల్పాదాయ దేశాల సగటు తలసరి జాతీయాదాయం కంటె, అభివృద్ధి చెందిన దేశాల సగటు తలసరి జాతీయాదాయం నలభై రెట్లు వున్నది. ఈ ఉన్నత ఆదాయ దేశాలన్నీ ఆర్థిక సహకార, అభివృద్ధి సంఘటనలో సభ్యులు. మాధ్యమిక ఆదాయాలు గల గ్రీసు, పోర్చుగల్, స్పెయిన్, టర్కీలు కూడా ఈ సంఘటనలో సభ్యులే.

ప్రపంచ విపణి కార్యకలాపాలు లేని దేశాల్లో బల్గేరియా, పోలెండ్, హంగరీ, యూనియన్ ఆఫ్ సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్స్ (రష్యా), జెకోస్లొవేకియా, జర్మన్ డెమోక్రాటిక్ రిపబ్లిక్ చేర్చబడినవి. వీటిలో సగటు తలసరి జాతీయాదాయం 4,640 అమెరికన్ డాలర్ల మేరకు ఉన్నది. ఇవి కూడా అభివృద్ధి గాంచిన, ఉన్నత ఆదాయ, పారిశ్రామిక దేశాలుగానే చెప్పబడినవి. ఇవన్నీ సోషలిస్టు ఆర్థిక వ్యవస్థ గల కమ్యూనిస్టు దేశాలు.

**మెరుగు తరుగుల వాస్తవాలు :**

ప్రపంచ జనాభాలో అల్పాదాయ దేశాల జనాభా దాదాపు 53 శాతం కాగా, ప్రపంచ స్థూల జాతీయాదాయంలో అల్పాభివృద్ధి దేశాల వాటా 5.3 శాతం మాత్రమే.

మాధ్యమిక ఆదాయ దేశాల జనాభా ప్రపంచ జనాభాలో 22 శాతం కాగా,, వారి స్థూల జాతీయాదాయం ప్రపంచ స్థూల జాతీయ ఆదాయంలో 14.2 శాతం వున్నది.

అల్పాదాయ దేశాలను, మాధ్యమిక ఆదాయ దేశాలను కలిపి అల్పాభివృద్ధి దేశాలని, వర్థమాన దేశాలని అంటారు. వీరిద్దరి జనాభా కలిసి ప్రపంచ జనాభాలో 75 శాతం కాగా ప్రపంచ స్థూల జాతీయాదాయంలో వారిద్దరి వాటా కలసి 20 శాతం మాత్రమే. ఈ వర్గంలో చాలా అసియా, ఆఫ్రికా. లాటిన్ అమెరికా, కొద్ది ఐరోపా దేశాలు చేర్చబడి వున్నవి.

అయితే పారిశ్రామికాభివృద్ధి గాంచిన విపణి ఆర్థిక వ్యవస్థ గల దేశాల జనాభా ప్రపంచ జనాభాలో 16.8 శాతం మాత్రమే అయినా వారి స్థూల జాతీయాదాయం ప్రపంచ స్థూల జాతీయ ఆదాయంలో 64 శాతం వున్నది.

అయితే కమ్యూనిస్టు బ్లాకు-సోషలిస్టు దేశాల విపణి వ్యాపారం లేని పారిశ్రామిక దేశాల జనాభా ప్రపంచ జనాభాలో 8 శాతం కాగా, వారి స్థూల జాతీయాదాయం, ప్రపంచ స్థూల జాతీయాదాయంలో 15 శాతం వున్నది.

పోతే నూనె ఎగుమతి చేసే దేశాల జనాభా ప్రపంచ జనాభాలో 0.6 శాతం (ఒకటికంటె తక్కువ శాతం) కాగా, వారి స్థూల జాతీయాదాయం ప్రపంచ స్థూల జాతీయాదాయంలో 1.4 శాతం వున్నది.

దీన్నిబట్టి అత్యధిక సంఖ్యాకులైన బీదప్రజలు అల్పాదాయ దేశాల్లోను, మాధ్యమిక ఆదాయ వర్థమాన దేశాల్లోను నివసిస్తున్నారు.

ఈ దేశాలు, ప్రపంచ ఆర్థిక వ్యవస్థలోని మురికివాడలని, ప్రొఫెసర్ కెయిరన్ క్రాస్ అన్నాడు.

1979లో భారతదేశ జనాభా 659 మిలియన్లు. తలసరి సగటు జాతీయాదాయం 190 అమెరికన్ డాలర్లు. అందువల్ల భారత దేశం అతి బీద దేశాలలో ఒకటిగా పరిగణించబడుతోంది. ప్రపంచ జనాభాలో భారత జనాభా 15.4 శాతం కాగా, దాని స్థూల జాతీయాదాయం ప్రపంచ స్థూల ఆదాయంలో 1.3 శాతం మాత్రమే.

ప్రపంచంలోని అభివృద్ధి చెందిన దేశాల్లోను, అల్పాభివృద్ధి చెందిన దేశాల్లో కూడా - ప్రతి దేశంలోను - దారిద్ర్యం ఆ దేశంలో వున్నా, యితర దేశాల్లో వున్నా అది ఒక వ్యాధిగా విజృంభిస్తుందని, ఇతరచోట్ల వున్న భాగ్యానికది ప్రమాదం తెస్తుందని — ఆలోచనా చైతన్యం పెరుగుతోంది. ఈ చైతన్యం అవసరమే. ఇక బీద ప్రజలు తాము దారిద్ర్యంలో పడివుండక తప్పదనే కర్మ సిద్ధాంత జనిత నమ్మకాన్ని పెట్టుకోకుండా జీవించదలచినట్లయితే - ఆ వైఖరి బీదదేశాల ప్రగతికి, ప్రపంచాభ్యుదయ పురోగమనానికి, యుద్ధ నివారణకు, ప్రపంచ శాంతి స్థాపనకు దోహదం చేస్తుంది.

**అల్పాభివృద్ధి నిర్వచనము, లక్షణాలు :**

ప్రొఫెసర్ జాకబ్ వైనర్ అల్పాభివృద్ధి దేశానికి 'ది ఎకనామిక్స్ ఆఫ్ డెవలప్‌మెంట్' అనే తన గ్రంథంలో మిత్రరాజ్యసమితి రిపోర్టు (1951, పే. 3) యిచ్చిన నిర్వచనం కంటె అర్థవంతమైన నిర్వచన మీ విధంగా యిచ్చాడు: "తక్కువగాని జీవన స్థాయిలో పెద్ద జనాభాను పోషించడానికి అనువుగా చెప్పదగినంత పెద్ద స్థాయి తలసరి ఆదాయాన్ని యిప్పటికే కలిగి, యిప్పటి తన జనాభాను భవిష్యత్తులో మరింత ఉన్నతస్థాయి జీవన ప్రమాణం కలిగి వుండేట్లుగా పోషించడానికి, ఎక్కువ మూలధనాన్ని, ఎక్కువ శ్రామికుల్ని, ఎక్కువ [illegible] సహజ వనరులను ఎక్కువగా పెట్టుబడి చేసి ఉపయోగించగల దేశము అల్పాభివృద్ధి దేశము."

అందువల్ల అభివృద్ధి సమస్య ప్రధానంగా, తలసరి జీవన ప్రమాణ సమస్య అని, దారిద్ర్య సమస్య అని, భాగ్యాభివృద్ధి సమస్య అని విదితమౌతోంది. కాబట్టి అల్పాభివృద్ధి దేశంగా ఒక దేశాన్ని నిర్ణయించడానికి, ఆ దేశం భవిష్యత్తులో తన తలసరి జీవన స్థాయిని పెంచగల శక్తిని కలిగి వున్నదా? భవిష్యత్తులో పెరిగిన తన జనాభాను అప్పటికున్న ఉన్నతస్థాయి జీవన ప్రమాణంతో పోషించ గలదా? అనే ముఖ్య లక్షణాలను గణనలోకి తీసుకోవాలని చెప్పి పై చెప్పిన తన గ్రంథంలో జాకబ్ వైనర్ వ్రాసారు.

ఈ జిన్ సి. స్టాలే తన 'ది ఫ్యూచర్ ఆఫ్ అండర్ డెవలప్‌డ్ కంట్రీస్ (పే. 13-న్యూయార్కు, 1954)లో "1) తాత్కాలిక దురదృష్టంవల్లగాక, దీర్ఘకాలీనంగా వస్తున్న దారిద్ర్యాన్ని అనుభవిస్తూ వున్నట్లయితే; 2) కేవలం సహజవనరులను తక్కువగా ఉపయోగించడంవల్లగాక, కాలం చెల్లిన ఉత్పత్తి పద్ధతులను, పాత సాంఘిక వ్యవస్థా సంఘటనను ఉపయోగించడంవల్ల, పేదరికాన్ని అనుభవిస్తూన్నట్లయితే - ఇతర దేశాల్లో లాభదాయకంగా ఉపయోగించబడిన పద్ధతుల నుపయోగించడంవల్ల ఆట్టి దేశపు దారిద్ర్యాన్ని తగ్గించడం సంభవమని భావించడానికి వీలుంటే - అట్టి దేశం అల్పాభివృద్ధి దేశమని చెప్పబడవచ్చు."

ఇంతవరకు చెప్పిన రెండు నిర్వచనాలను బట్టి ఈ విషయాలు అర్థమౌతున్నవి:

1) అభివృద్ధి చెందిన దేశాలది పెద్ద తలసరి ఆదాయం. అల్పాభివృద్ధి దేశాలది చిన్న తలసరి ఆదాయం. రెంటికి తేడా యిది. అయితే తలసరి ఆదాయమొక్కటే అభివృద్ధికి సంకేతం కాకపోయి నప్పటికి, దేశాల అభివృద్ధిని పోల్చి చూపడానికది గణనీయమైన విశైక కులాన్నాత్మక సూచనగు

2) జనబాహుళ్య దారిద్ర్యము అల్పాభివృద్ధి దేశాల కీలక సమస్య. జన బాహుళ్య దారిద్ర్యానికి అల్పాభివృద్ధి కారణం కాగా, అల్పాభివృద్ధికి జన బాహుళ్య దారిద్ర్యం కూడా కారణమే.

3) బీదవారికి భూమి, మూలధనము, గృహసంపద మొదలైన జాతీయ ఆస్తులలో వాటా తక్కువ. కాబట్టి వారికి వనరులు తక్కువ. తక్కువ వనరులను ఉపయోగించడంవల్ల వారు బీదవారు గానే వుండిపోతున్నారు. తక్కువ వనరుల వల్లనే బీదలు తమ పిల్లలకు విద్య, ప్రశిక్షణ అందేటట్లు చేయలేకపోతున్నారు, తత్కారణంగా పేదవారి పిల్లలు నైపుణ్య రాహిత్యతతో చేసే పనులలోగాని, అర్థనైపుణ్యంతో చేసే పనులలోగాని చేరుతున్నారు. ఇందువల్ల వారి ఆదాయాలు తక్కువ స్థాయిలోను, అల్పంగాను వున్నవి. ఇందువల్ల తేలిందేమిటి? ఆస్తుల అసమాన పంపిణి, ఆదాయ, అవకాశాల అసమాన పంపిణికి ప్రధాన కారణమౌతోంది.

4) జన బాహుళ్యమంతటిని ఆవరించిన దారిద్ర్యానికి సహజ వనరులు తక్కువగా వుండటంగాక, కాలం చెల్లిన ఉత్పాదన పద్ధతులను, అంతగా శక్తివంతముగాని పాత సామాజిక వ్యవస్థా సంఘటనో పయోగిత ప్రధాన కారణమౌతోంది.

## భారతదేశ అల్ప ఆర్థికాభివృద్ధి ప్రాతిపదిక లక్షణాలు:

భారతీయుల్లో సగంమంది ఆర్థిక దుస్థితిలోనే వున్నారు. దేశ దారిద్ర్యం తీవ్రంగా వుండటమే గాదు, వదలిపెట్టని దీర్ఘకాలీన దురవస్థగా కూడా వుంది. అయితే ఇంకా ఉపయోగంలోనికి తేకుండా వున్న సహజ వనరులు తగినంతగా వున్నయ్యి. కాని యిప్పుడు భారత దేశంలో అవసరమైనంతా, అనుకున్నంతా కాదుగాని – కొంత ఆర్థికాభివృద్ధి జరుగుతోంది. అందువల్ల భారతీయ ఆర్థిక వ్యవస్థను వర్ధమాన ఆర్థిక వ్యవస్థ అని కూడా చెబుతున్నారు. కాబట్టి భారతీయ అల్ప ఆర్థికాభివృద్ధి ప్రాతిపదిక లక్షణాలను పరిశీలిద్దాము.

## అల్పమైన తలసరి ఆదాయం :

అల్పాభివృద్ధి ఆర్థికవ్యవస్థ లన్నింటా మామూలుగా తలసరి ఆదాయం తక్కువే. 1980లో భారతీయ తలసరి ఆదాయం 240 అమెరికన్ డాలర్లు మాత్రమే. ఏదో కొద్ది దేశాలు మినహా ప్రపంచ దేశాల్లో భారతీయ తలసరి ఆదాయం తక్కువలో తక్కువ. 1980లో భారతీయ తలసరి ఆదాయానికి స్విట్జర్లెండ్ తలసరి ఆదాయం 69 రెట్లు, పశ్చిమ జర్మనీ తలసరి ఆదాయం 57 రెట్లు, అమెరికా సంయుక్త రాష్ట్రాల తలసరి ఆదాయం 47 రెట్లు. కాని 1960తో తలసరి ఆదాయాల స్థితి వేరుగా వుంది. ఆ సంవత్సరంలో భారతీయ తలసరి ఆదాయానికి అమెరికా తలసరి ఆదాయం 166 రెట్లు, పశ్చిమ జర్మనీ తలసరి ఆదాయం 18 రెట్లు, స్విట్జర్లండ్ తలసరి ఆదాయం 21 రెట్లు. అందువల్ల భారత ఆర్థిక వ్యవస్థకంటె అభివృద్ధి చెందిన దేశాల ఆర్థిక వ్యవస్థలు ఎక్కువ వేగంగా పెరుగుతున్నట్లు స్పష్టమౌతోంది. అందువల్ల తలసరి ఆదాయ స్థాయిల్లో వ్యత్యాసము మరింత ఎక్కువ అయ్యింది. (చూడుము పట్టిక-2)

పట్టిక -2

### ఎంపిక చేసిన కొన్ని దేశాల్లో విపణివీథి ధరల ప్రకారం తలసరి జాతీయాదాయం

(అమెరికన్ డాలర్లలో)

| దేశము | 3 సంవత్సరాలు 1960 | 1976 | 1980 |
|---|---|---|---|
| 1. అమెరికా సంయుక్త రాష్ట్రాలు | 2502 | 6995 | 11,360 |
| 2. స్విట్జర్లెండ్ | 1463 | 8248 | 16,440 |
| 3. కెనడా | 1909 | 7340 | 10,130 |
| 4. పశ్చిమ జర్మనీ | 1222 | 6451 | 13,590 |
| 5. ఇంగ్లండు | 1261 | 3530 | 7920 |
| 6. ఫ్రాన్సు | 1202 | 5860 | 11,730 |
| 7. జపాన్ | 417 | 4478 | 9890 |
| 8. ఇండియా | 69 | 136 1974) | 240 |

మూలము: మిత్రరాజ్యసమితి స్టాటిస్టికల్ ఇయ్యర్ బుక్ 1977, వరల్డ్ డెవలప్‌మెంట్ రిపోర్టు 1982 నుండి సేకరించిన గణాంకాలు.

వివిధ దేశాల వాస్తవ స్థూల ఉత్పత్తుల సాలీనా సగటు వృద్ధి రేట్లను పరిశీలిస్తే – చాలా అభివృద్ధి చెందిన దేశాల్లో, 1950 – 60 దశకంలో, అంతకుముందుకంటె స్థూల సాలీనా జాతీయ ఉత్పత్తి ఎక్కువ వేగంగా పెరిగింది. 1960–80 లోని రెండు దశకాల్లోను

అభివృద్ధి చెందిన దేశాల సాలీనా స్థూల జాతీయ ఉత్పత్తులకంటె మరింత వేగంగా పెరిగినై. ఇందువల్ల అభివృద్ధి చెందినట్టి, అల్పాభివృద్ధి చెందినట్టి దేశాల జీవన స్థాయిలలో తేడా మరింతగా ఎక్కువయ్యింది. (చూడుము : పట్టిక-3)

పట్టిక - 3

## నిలకడ ధరల ప్రకారం స్థూల దేశీయ సాలీనా ఉత్పత్తుల సగటు సాలీనా వృద్ధి రేట్లు

| కాలవ్యవధి | అమెరికా సంయుక్తరాష్ట్రాలు | కెనడా | పశ్చిమ జర్మనీ | ఫ్రాన్సు | ఇంగ్లండు | ఇండియా | జపాన్ |
|---|---|---|---|---|---|---|---|
| స్థూల సాలీనా దేశీయ ఉత్పత్తి వృద్ధి రేటు | | | | | | | |
| 1) 1950 - 60 | 2.9 | 4.3 | 7.8 | 4.5 | 2.4 | 3.5 | — |
| 2) 1960 - 70 | 4.3 | 5.6 | 4.6 | 5.7 | 2.9 | 3.6 | 10.5 |
| 3) 1970 - 80 | 3.0 | 3.9 | 2.6 | 3.5 | 1.9 | 3.6 | 5.0 |
| తలసరి సాలీనా దేశీయ ఉత్పత్తి వృద్ధిరేటు | | | | | | | |
| 1) 1950 - 60 | 1.2 | 1.5 | 6.7 | 3.5 | 2.1 | 1.6 | — |
| 2) 1960 - 70 | 3.0 | 3.7 | 3.5 | 4.6 | 2.3 | 1.2 | 9.4 |
| 3) 1970 - 80 | 2.3 | 3.3 | 3.3 | 3.9 | 2.2 | 1.4 | 7.1 |

మూలము : మిత్రరాజ్య సమితి స్టాటిస్టికల్ ఇయ్యర్ బుక్ 1969, వరల్డ్ డెవలప్‌మెంట్ రిపోర్టు 1982 నుండి సేకరించిన గణాంకాలు.

### వృత్తుల రకాలు : ప్రాథమిక ఉత్పత్తులు

అల్పాభివృద్ధి దేశాల లక్షణాలలో ప్రాథమిక రంగం ఉత్పత్తి ప్రాధాన్యత ఒక ముఖ్య లక్షణం. శ్రామికులలో అత్యధిక అనుపాతం వ్యవసాయరంగంలో పనిచేస్తున్నారు. జాతీయాదాయంలోని అత్యధిక అనుపాతం వ్యవసాయరంగపు ఉత్పత్తిది. భారతదేశంలో 1980లో 69 శాతం శ్రామికులు వ్యవసాయరంగంలో వున్నారు. వ్యవసాయోత్పత్తి జాతీయాదాయంలో 37 శాతం అనుపాతంగా వున్నది. ఆసియా, ఆఫ్రికా, మధ్య ప్రాచ్య దేశాలలో మూడింట రెండు వంతులనుండి అయిదింట నాలుగు వంతులకు పైగా ప్రజలు జీవనోపాధికి వ్యవసాయం మీద ఆధారపడుతున్నారు. చాలా లాటిన్ అమెరికన్ దేశాల్లో కూడా మూడింట రెండు వంతులనుండి నాల్గింట మూడు వంతుల వరకు జనాభా జీవనోపాధికి వ్యవసాయంమీదే ఆధారపడి బ్రతుకుతున్నారు. అభివృద్ధి చెందిన దేశాల్లో వ్యవసాయాన్ని జీవనాధారం చేసుకున్న వారి సంఖ్య అల్పాభివృద్ధి దేశాలలోకంటె తక్కువ. (చూడుము: పట్టిక-4)

అల్పాభివృద్ధి దేశాల వ్యవసాయంలో పనిచేస్తున్న శ్రామికుల శాతంకంటె, ఆ రంగంనుండి జాతీయాదాయానికి చేరుతున్న ఆదాయ శాతం తక్కువ. వ్యవసాయరంగంలో శ్రామికుని తలసరి ఉత్పాదకత తక్కువగా వుండటమే అందుకు కారణం. వృత్తి నమూనా దృష్టితో చూస్తే భారతదేశం ఆర్థిక వ్యవస్థ ప్రధానంగా ప్రాథమిక ఉత్పత్తి గలది. జాతీయాదాయంలో అయిదింట రెండువంతులు వ్యవసాయ రంగంనుండి వస్తోంది. పనిలో వున్న పదిమందిలో ఏడుగురు వ్యవసాయ రంగంలో వున్నారు. అంతేకాదు. వ్యవసాయరంగంలో శ్రామికుని తలసరి ఉత్పత్తి చాలా హీనం కాబట్టి వ్యవసాయం మాంద్యంతో కుంటుపడిపోయిన పరిశ్రమగా నడుస్తోంది.

పట్టిక - 4

## వ్యవసాయరంగంలో క్రియాశీలంగా పనిచేస్తున్న జనాభా-శాతము : ఎంపిక చేసిన దేశాలలో స్థూల జాతీయ ఉత్పత్తి మూలము

| దేశము | వ్యవసాయంలో క్రియాశీలంతో పనిచేసే జనాభా శాతము | స్థూల జాతీయోత్పత్తి పారిశ్రామిక మూలము పంపకం శాతము వ్యవసాయం | పరిశ్రమ | సేవలు |
|---|---|---|---|---|
| 1) ఇంగ్లండు | 2 | 2 | 35 | 63 |
| 2) అమెరికా సంయుక్త రాష్ట్రాలు | 2 | 3 | 34 | 63 |
| 3) కెనడా | 5 | 4 | 33 | 63 |
| 4) ఫ్రాన్సు | 8 | 4 | 36 | 60 |
| 5) జపాన్ | 12 | 4 | 41 | 55 |
| 6) ఇండియా | 69 | 37 | 2[illegible] | 37 |

గమనిక : పరిశ్రమలో నిర్మించే కార్యక్రమం కూడా భాగమే.

పట్టికకు మూలము : ప్రపంచ బ్యాంకు 1982లో ప్రచురించిన వరల్డ్ డెవలప్‌మెంట్ రివ్యూ అందించిన సమాచార గణాంకాల ఆధారంగా యీ పట్టిక నిర్మించబడింది.

## హెచ్చయిన జనాభా వత్తిడి భారము :

అల్పాభివృద్ధి దేశాలలో జనన రేటు పెద్దదిగా వున్నది. కొన్ని ఆరోగ్యరక్షణ సౌకర్యాలు ఏర్పడడంవల్ల మరణరేటు తగ్గిపోతోంది. 1941-50లో 1.25 శాతంగా వున్న భారత జనాభా వృద్ధిరేటు 1971-81లో 2.5 శాతం అయ్యింది. 1911-20లో మరణరేటు వెయ్యికి నలభై తొమ్మిది కాగా అది, 1981 నాటికి వెయ్యికి పదిహేనుకు పడిపోయి జనాభా వృద్ధి విజృంభించింది. 1911-20లో వెయ్యికి నలభై తొమ్మిదిగా వున్న జననరేటు మాత్రము 1981 నాటికి వెయ్యికి ముప్పైఆరుకు పడిపోయింది.

జనాభా వృద్ధిరేటు వేగంగా పెరుగుతూ వుంటే, ఆర్థికవృద్ధి రేటు కూడా యిదివరకటికంటె వేగంగా పెరిగితే మినహా, పెరిగిన జనాభాతోసహా మొత్తం జనాభానంతటిని యిదివరకు వున్న జీవన స్థాయితో పోషించడానికి వీలుకాదు. అమెరికన్ ఆర్థిక సామాజిక శాస్త్రవేత్త జె. జె. స్పెంగ్లర్ కనుసారంగా జనాభా వృద్ధిరేటు ఒక శాతం పెరిగితే — ఇదివరకున్న జీవనస్థాయితో పెరిగిన జనాభాతో సహా మొత్తం జనాభానంతటిని పోషించడానికి — ఆర్థికవృద్ధిరేటు 4 శాతం పెరగాలి. పెరుగుతున్న జనాభాను కూడా పోషించడానికి యింకా ఎక్కువగా ఆహారము, బట్టలు, గృహాలు, ఔషధాలు, పాఠశాలలు మొదలైన వనరులన్నీ కావాలి. అందుచేత పెరిగిన జనాభాకు పోషణ చేకూర్చడం సమాజానికి భారమౌతుంది. ఈ భారాన్ని జయప్రదంగా మోసేందుకు సమాజం హెచ్చు ఆర్థిక అభివృద్ధిని సాధించాలి. అందుకు హెచ్చు వనరులు, మరింత కృషి అవసరమౌతాయి. కాని ఈ మార్గానికి ఒక ఆటంకం ఏర్పడుతుంది. ఉన్న వనరులు హెచ్చుగా పెరిగిన జనాభా పోషణకు ఖర్చయ్యిపోతూవుంటే, ఆర్థికాభివృద్ధికి పెట్టుబడి చేసేందుకు మూలధన కొరత ఏర్పడి ఆర్థికవృద్ధి దెబ్బ తింటుంది. అంతేగాక జనాభా పెరుగుదలవల్ల శ్రామికసంఖ్య పెరుగుతుంది. ఆరవ పంచవర్ష ప్రణాళిక కనుసారంగా శ్రామికసంఖ్య 1980-85లో 34 మిలియన్లు పెరుగుతుంది. ఇందువల్ల శ్రామికులకున్న డిమాండుకంటె వారి సప్లయి హెచ్చుగా వుండి, కొంతమందికి పని దొరకక అదనంగా నిరుద్యోగిత ఏర్పడుతుంది. జనాభాను పోషించడానికి చేసే ఖర్చును ఆంగ్లంలో "డెమోగ్రాఫిక్ ఇన్వెస్ట్‌మెంట్" అని అంటారు.

## నిరుద్యోగిత : ప్రచ్ఛన్న నిరుద్యోగిత :

అల్పాభివృద్ధి దేశాల్లో ఎప్పటికప్పుడు కావలసినదానికంటె ఎక్కువ సంఖ్యలో శ్రామికులుంటారు. అందువల్ల అచ్చటి శ్రామికజనులందరికి లాభసాటి ఔద్యోగిత కల్పించడం సాధ్యపడదు. అభివృద్ధి చెందిన దేశాల్లో నిరుద్యోగిత చాలవరకు వ్యాపారిచక్ర సంఘటనలవల్ల ఏర్పడుతుంది. తత్కారణంగా అచ్చటి శ్రామికుల కొనుగోలు శక్తి తగ్గిపోతుంది. ఆ సందర్భంలో ప్రభావశీల డిమాండ్ తగ్గిపోవడంవల్ల అభివృద్ధి చెందిన దేశాల్లో నిరుద్యోగిత కల్గడాన్ని చూస్తున్నాము. అల్పాభివృద్ధి దేశాల్లో మూలధన కొరతవల్ల నిరుద్యోగిత ఏర్పడుతుంది. అందువల్ల అది వ్యవస్థాగత నిరుద్యోగిత ఔతుంది. ఉద్యోగం కొరకు వేచివున్న శ్రామికులందరికి ఔద్యోగితను కల్పించగలంత మూలధనం అల్పాభివృద్ధి ఆర్థిక వ్యవస్థలో లభ్యంకాదు. అందువల్లనే అల్పాభివృద్ధి దేశాల నిరుద్యోగితను వ్యవస్థాగత నిరుద్యోగిత అని అంటున్నాము.

పైపెచ్చు అల్పాభివృద్ధి మాత్రమే పొందిన భారతీయ వ్యవసాయ రంగంలో అవసరాన్ని మించిన సంఖ్యలో శ్రామికులు పని చేస్తున్నారు. అందువల్ల ఆ శ్రామికుల సీమాంత ఉత్పాదకత లేని దానితో సమానమే. ఒకోప్పుడు శూన్యము; ఋణాత్మకముగా కూడా వుండవచ్చు. అందువల్ల భారత వ్యవసాయరంగంలో ప్రచ్ఛన్న నిరుద్యోగిత వున్నది. అదనంగా వున్న శ్రామికుల్ని భారత వ్యవసాయ రంగంనుండి బయటకు పంపినప్పటికి, వ్యవసాయోత్పత్తి తగ్గదు. అంతవరకు తమ శక్తి వీలు చేసేదానికంటె తక్కువగా పనిచేస్తున్నవారు, తమ పూర్తి శక్తినుపయోగించి పనిచేస్తారు కాబట్టి భారత వ్యవసాయోత్పత్తి శ్రామికుల్ని బయటకు పంపినా తగ్గదు.

ఈ పరిస్థితుల్లో నిరుద్యోగం పట్టణాల్లో హెచ్చు స్థాయిలో వున్నప్పటికి గ్రామసీమలు కూడా కొంతవరకు నిరుద్యోగ సమస్యతోను; తక్కువ పనిపాటలున్న కారణంగా ప్రచ్ఛన్న నిరుద్యోగంతోను బాధపడుతున్నవి. ఈ పరిస్థితిని భారతదేశ తృతీయ పంచవర్ష ప్రణాళిక (పే. 154) ఈ విధంగా విశదీకరించింది. "గ్రామసీమల్లో నిరుద్యోగిత, ప్రచ్ఛన్న నిరుద్యోగిత ప్రక్కప్రక్కనే కన్పించుతాయి. వీటి రెంటికీ మధ్య వ్యత్యాసమంత స్పష్టంగా కన్పించదు. గ్రామాల్లోని నిరుద్యోగిత మామూలుగా ప్రచ్ఛన్న నిరుద్యోగిత, రూపంలోనే వుంటుంది. పట్టణ పల్లెలలోని నిరుద్యోగ సమస్యలను విడదీయడానికి వీలుకాదు." పునః పరిశీలించబడిన ఆరవ పంచవర్ష ప్రణాళిక ప్రకారం 1980లో 20.7 మిలియన్ల నిరుద్యోగులున్నారు. మొత్తం భారతీయ శ్రామికసంఖ్యలో యిది 7.14 శాతము. కొందరు ఆర్థిక శాస్త్రవేత్తలు దీనిని తక్కువ అంచనాగా భావిస్తున్నారు. ఇంకా ఎక్కువమంది నిరుద్యోగులున్నారని వారి భావము. ఇంత పెద్ద సంఖ్యలోని నిరుద్యోగిత చాలా ఆందోళన దాయకము.

## అల్పరేటులో మూలధన ఏర్పాటు :

భారతీయ ఆర్థిక వ్యవస్థలో మూలధన లోటు ఏర్పడటం మరొక లక్షణం. ఇది రెండు విధాలుగా కన్పిస్తోంది. (1) తలసరి

మూలధన లభ్యత తక్కువగా వున్నది. (2) ప్రస్తుతం మూలధన ఏర్పాటు రేటు తక్కువగా వున్నది. తలసరి మూలధన లభ్యత తక్కువగా వుండడానికి రెండు చిహ్నాలు కన్పిస్తున్నవి. తలసరి ఉక్కు ఉత్పత్తి, తలసరి విద్యుచ్ఛక్తి ఉత్పత్తి తక్కువగా వుండటమే ఈ రెండు చిహ్నాలు అని చెప్పవచ్చు. అభివృద్ధి చెందిన దేశాలతో పోల్చి నపుడు భారతదేశ తలసరి ఉక్కు ఉత్పత్తి బహు తక్కువగా వున్నది. 1976లో అమెరికన్ శ్రామికుడు భారత శ్రామికునికంటె 36 రెట్లు ఉక్కు, 63 రెట్లు విద్యుచ్ఛక్తి ఉత్పత్తి చేసాడు. ఇందువల్ల భారతీయ శ్రామికునకు లభ్యమయ్యే తలసరి మూలధనము చాల తక్కువ అని విదితమౌతోంది.

పట్టిక - 5

## 1976లో తలసరి ఉక్కు, విద్యుచ్ఛక్తి ఉత్పాదన

| దేశము | తలసరి ఉత్పత్తి | |
|---|---|---|
| | పదును చేయని ఉక్కు (కిలోగ్రాముల్లో) | విద్యుచ్ఛక్తి (కిలోవాట్. గంటలు) |
| 1. అమెరికా సంయుక్త రాష్ట్రాలు | 540 | 9871 |
| 2. ఇంగ్లండు | 398 | 4952 |
| 3. రష్యా సోవియట్ సోషలిస్ట్ రిపబ్లిక్స్ | 564 | 4330 |
| 4. జపాను | 952 | 4538 |
| 5. ఇండియా | 15 | 156 |

మూలము : మిత్రరాజ్య సమితి స్టాటిస్టికల్ ఇయ్యర్ బుక్ 1977 నుండి గ్రహించిన గణాంకాల ఆధారంగా యీ పట్టిక-5 తయారుచేయబడింది.

తులనాత్మకంగా, అల్పాభివృద్ధి దేశాల స్థూల మూలధన ఏర్పాటు అభివృద్ధి చెందిన దేశాలలోకంటె తక్కువగా వున్నది. (చూడుము. పట్టిక-6)

పట్టిక - 6

## స్థూల దేశీయ మూలధన ఏర్పాటు

| దేశము | వర్తమాన విపణివీధి ధరల ప్రకారం స్థూల జాతీయోత్పత్తిలో మూలధన శాతం | | |
|---|---|---|---|
| | 1960 | 1966 | 1976 |
| 1. జపాన్ | 24 | 34 | 30 |
| 2. ఆస్ట్రేలియా | 29 | 28 | 24 |
| 3. కెనడా | 26 | 23 | 26 |
| 4. అమెరికా సంయుక్త రాష్ట్రాలు | 21 | 18 | 16 |
| 5. ఇంగ్లండు | 11 | 18 | 19 |
| 6. ఇండియా | 5 | 13 | 20 |

మూలము : ఇండియా, పోకెట్ బుక్ ఆఫ్ ఇన్ఫర్మేషన్ (1972;) ఎకనామిక్ సర్వే (ఇండియా) 1981-82, మిత్రరాజ్య సమితి స్టాటిస్టికల్ ఇయర్ బుక్, 1977.

కొన్ని అల్పాభివృద్ధి దేశాల్లో యంత్రాల అరుగు-తరుగులను పూర్తి చేయడానికి కూడా చాలనంత తక్కువగా మూలధన ఏర్పాటు జరుగుతోంది. ఒక దేశ జనాభా 1 శాతం పెరిగితే, ఆ దేశ జనాభాను ఎప్పటి జీవన ప్రమాణంతో పోషించడానికి, ఆ దేశ ఆర్థిక వ్యవస్థలో అదనంగా 4 శాతం పెట్టుబడి జరగవలసిన అవసరమున్నదని ప్రొఫెసర్ కాలిన్‌క్లార్క్ వ్రాసారు. 1961-81లో భారత జనాభా వృద్ధిరేటు 2.5 శాతమైనందున, భారతదేశ ఆర్థికవ్యవస్థలో అదనంగా 10 శాతం పెట్టుబడి జరగవలసి వున్నది. ఇలా జరిగితేనే అదనంగా పెరిగిన జనాభా మోసే సమస్యల భారము తొలగించబడగలదు. అందువల్ల భారతదేశంలో సాలీనా స్థూల మూలధన ఏర్పాటు 16 శాతం వరకు జరగాలి. అప్పుడే పరిశ్రమల అరుగు - తరుగులను పూరించడానికి, యింతకు ముందున్న జీవనస్థాయిలో జనాభా నంతటిని పోషించడానికి వీలౌతుంది. 16 శాతానికి మించిన మూలధన ఏర్పాటు జరిగినపుడే ఆర్థికవృద్ధి రేటు పెరగడానికి, ప్రజలకు ఇంతకుముందున్న జీవనస్థాయికంటె హెచ్చు జీవనస్థాయిని లభ్యం చేయడానికి వీలౌతుంది.

## ఆస్థి సంపదల అపసవ్య పంపిణి :

ఆస్థి సంపదల అనుచిత పంపిణీని గురించి రిజర్వ్‌బ్యాంక్ ఆఫ్ ఇండియా యిచ్చిన సమాచారాన్ని, (పట్టిక-7) చూస్తే తెలుస్తుంది. గ్రామీణ రంగంలోని 20 శాతం గృహాల్లో ఒక్కొక్కదానికి ఒక వెయ్యి రూపాయల విలువకు తక్కువగా వున్న ఆస్థి వున్నదా అంటే గ్రామీణ ఆస్తుల్లో వీరందరికి కలిపి 0.7 శాతం ఆస్థి వున్నది. 51 శాతం గ్రామీణ గృహాల్లో ఒక్కొక్కవానికి అయిదువేల రూపాయల విలువకు తక్కువ గల ఆస్థి వున్నది. అంటే వీరందరికి మొత్తం గ్రామీణ ఆస్థిలో 8 శాతం ఆస్థి వున్నది. అగ్రశ్రేణిలోని 4 శాతం గృహాల్లో ఒక్కొక్కరికి యాభై వేల రూపాయలకు పైగా విలువ గల ఆస్థి వున్నది. అంటే మొత్తం గ్రామీణ ఆస్థిలో ఈ 4 శాతం గృహాలకు 31 శాతం ఆస్థి వున్నది. గ్రామీణ ఆస్థుల అపసవ్య పంపిణీని గురించిన మరింత సమాచారాన్ని యిచ్చేదే పొందుపరుస్తున్న పట్టిక-7 నుండి తెలుసుకోవచ్చు.

పట్టిక - 7

### భారతదేశ గ్రామీణ గృహాలమధ్య ఆస్థుల పంపిణీ వివరాలు [1971-1972]

| ఆస్థి గ్రూపు | మొత్తం గృహాలలో అనుపాత శాతం | మొత్తం ఆస్థుల విలువలో వాటా శాతము |
|---|---|---|
| 1) రూ. 1000కి తక్కువ | 19.7 | 0.7 |
| 2) రూ. 1000-రూ. 5000 | 31.6 | 7.5 |
| 3) రూ. 5000-రూ. 20,000 | 33.7 | 31.7 |
| 4) రూ. 20,000-రూ. 50,000 | 11.0 | 29.6 |
| 5) రూ. 50,000కు పై ఆస్థి విలువ | 3.9 | 31.4 |

మూలము : రిజర్వు బ్యాంక్ ఆఫ్ ఇండియా, ఆల్ ఇండియా డెట్ అండ్ ఇన్‌వెస్ట్‌మెంట్ సర్వేనుండి గ్రహించిన గణాంకాలతో నిర్మితము.

గ్రామీణ ఆస్థుల అసమాన పంపిణీయే గ్రామీణ ఆదాయాలలోని అసమానత్వాలకు ప్రధాన కారణంగా తెలుస్తోంది. 60 శాతం గ్రామీణ గృహాల వనరుల ప్రాతిపదిక కేవలం వారికి "బతుకు భోజనానికి" మించి యివ్వలేకపోతోంది. రిజర్వుబ్యాంకు సర్వే చూపుతున్న ఈ విషయాన్నే నేషనల్ సాంపుల్ సర్వే బలపరుస్తూ గ్రామీణ గృహాలలోని 60 శాతం బీదగృహాలు - మొత్తం గ్రామీణ భూమిలో 9.3 శాతం భూమిని మాత్రమే సేద్యం చేస్తున్నారని, వీరికి మొత్తం పశుసంపదలో 14 శాతము, కొయ్యనాగళ్ళలో 10 శాతము మాత్రమే వున్నదని తెలియజేసింది.

ఇహ పారిశ్రామిక రంగాన్ని చూస్తే, పెద్ద ధనిక గృహాల్లోనే ఆస్థులన్నీ ఎక్కువగా కేంద్రీకృతమై వున్నయ్యి. 1963-64 కేవలం 20 పెద్ద వ్యాపారగృహాల్లో మొత్తం రూ. 1326 కోట్ల విలువచేసే ఆస్థి, సంపద కేంద్రీకృతమై వున్నవి. 1979 నాటికి ఈ ఆస్థి, సంపదలు రూ. 6618 కోట్లకు పెరిగినవి. ఇందులో బిర్లాల ఆస్థి విలువ రూ. 1310 కోట్లుగా అతి పెద్దది. తరువాత పెద్ద స్థితి తాతాలది. వీరి ఆస్థి విలువ రూ. 1309 కోట్లు. బిర్లా, తాతాల ఆస్థులు కలిపితే మొత్తం 20 పెద్ద గృహాల ఆస్థిలో 40 శాతం వుంది. అయితే ఈ పెద్ద వ్యాపార గృహాలలో ఒక్కొక్కరికి రూ. 100 కోట్లకు మించిన ఆస్థి వున్నది.

1979 డిశెంబరు 31వ తేదీన రిజిస్టరయిన 44 గుత్తాధిపత్య (ఏకాధిపత్య) గృహాల మొత్తం ఆస్థి విలువ రూ. 12,457 కోట్లని అంచనా వేయబడింది. ఇందులో 20 గుత్తాధిపత్య గృహాలవద్ద రూ. 6,618 కోట్ల విలువగల ఆస్థి వున్నది. అంటే మొత్తం 44 గుత్తాధిపత్య గృహాల ఆస్థుల విలువలో 53 శాతం వున్నది. ఇందువల్ల ఏం తెలుస్తోంది? అతి తక్కువ సంఖ్యలో వున్న పెద్ద గుత్తాధిపత్య గృహాల చేతుల్లో ఆస్థులు పెద్దఎత్తున కేంద్రీకృతమై వున్నవి) ఇంతకంటె అనుచిత ఆస్థి పంపిణీ ఏముంటుంది? ఈ అనుచిత ఆస్థి పంపిణీయే ఆర్థికబలాన్ని తక్కువ సంఖ్యలోని గుత్తాధిపత్య పారిశ్రామిక (వ్యాపార) గృహాల్లో కేంద్రీకృతం చేసింది.

## మానవ మూలధనం హీననాణ్యత :

అల్పాభివృద్ధి దేశాల మానవ మూలధన నాణ్యతాహీనత కొట్టవచ్చినట్లు కన్పిస్తోంది. అనేక అల్పాభివృద్ధి దేశాలు నిరక్షరాస్యతవల్ల బాధితులయ్యాయి. నిరక్షరాస్యత వృద్ధికి పెద్ద ఆటంకము. కార్య నిర్వహణ నైపుణ్యాల సముపార్జనకు, సాంఘిక సమస్యల అవగాహనకు కనిష్ఠస్థాయి విద్యయినా వుండాలి. గ్రామీణుడంటే తప్పనిసరిగా అవిద్యావంతుడని అర్థం చేసుకోవలసి వస్తోంది. గ్రామీణ నిరక్షరాస్యత నాగరికతాజలంలోని ఉప్పునీళ్ళు, గ్రామాలు, మూఢ విశ్వాసాలకు, బహిష్కరణలకు, సాంప్రదాయక వాదానికి కేంద్రాలు జనబాహుళ్య నిరక్షరాస్యతవల్ల కర్మసిద్ధాంతము, ముందుగానే నిర్ణయించబడిన కర్మ ఫలితంగా దైన్యస్థితి కలుగుతుందనే నమ్మకము బలీయంగా వున్నయ్యి.

1981 జనాభా లెక్కల ప్రకారము 37 శాతం జనులు మాత్రమే అక్షరాస్యులు. మిగతా 67 శాతం చదవాలేరు, వ్రాయాలేరు. కాని అభివృద్ధి చెందిన ఆస్ట్రేలియా, కెనడా, ఇంగ్లండ్ అమెరికా దేశాల్లో నిరక్షరాస్యత 5 శాతం స్థాయికి తక్కువగానే వున్నది.

మూలధన ఏర్పాటు నిర్వచనాన్ని విస్తృతంచేసి, ఉత్పాదక శక్తి సమన్వితమైన వనరులను ఆ నిర్వచనంలో చేర్చినట్లయితే, భౌతిక మూలధనంతోపాటు, విద్య, ప్రతిభ (ప్రాయోగిక గుణం) కూడా మూలధనం క్రిందికి వస్తాయి. అందువల్ల విద్య, నైపుణి ఏర్పాటు, పరిశోధన, ఆరోగ్యాభివృద్ధి మొదలైనవాటిపై చేసే ఖర్చులు కూడా జాతీయ మూలధనం క్రిందికి వస్తాయి. భారతదేశం, సాలీనా, ప్రాథమిక విద్య, ఉన్నత విద్య, అభివృద్ధిమీద తలసరి రూ. 35 మాత్రమే ఖర్చు చేస్తోంది. ఈ రూ. 35 వారీ తలసరిఖర్చు మొత్తం భారత స్థూల జాతీయ ఉత్పత్తిలో 3 శాతం మాత్రమే. ఈ పద్దులమీద అమెరికాలో తలసరి రూ. 2000 అనగా స్థూల జాతీయాదాయంలో 10 శాతాన్ని ఖర్చు చేస్తున్నారు. అమెరికాలో ఒక్క విద్యమీదనే తలసరి రూ. 49 ఖర్చు చేస్తున్నారు.

ఆహారకొరత, నైపుణ్యాలను ప్రసాదించగలిగే ప్రతిభల లోటు కూడా మూలధన లోపంవల్లనే సంభవిస్తున్నవి. ఒకవేళ నైపుణ్యమున్నప్పటికి, పని చేయించగల ఆరోగ్యము, అందుకు తగిన రాశ్యాత్మక, గుణాత్మక ఆహారము కావాలి. ఆహారం తక్కువ గాలిలో లభ్యమైతే - ఆ లోటును స్వల్పాహార పోషణ అంటారు. పుష్టి నివ్వడానికి కావలసిన పదార్థాలన్నీ ఆహారంలో లేకపోతే అనుచితాహార పోషణ అంటారు. కాబట్టి అవసరమైన పోషక పదార్థాలు గల తగినంత ఆహారం ప్రజలకు లభ్యం కావాలి. అప్పుడే వారు మంచి ఆరోగ్యంతో, శక్తినుపయోగించి, సమర్థవంతంగా పనిచేసి, ఉత్పాదకతను కన్పర్చి, ఆర్థికాభివృద్ధిని అల్పస్థితినుండి, ఉన్నతస్థితికి రాగల్గుతారు. కాని ఇతర దేశాలతో పోల్చినపుడు భారతీయుల ఆహారం ఎంత లోటుగా వున్నదో పట్టిక-8 తెలియజేస్తుంది.

పట్టిక - 8

## ఆహారం సప్లయిలు : ఎంపిక చేసిన దేశాలలో తలసరి వినియోగము

| | | తలకు రోజుకు గ్రాములు | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| దేశము | సంవత్సరము | తృణధాన్యము | చక్కెర | మాంసము | పాలు | మాంసకృత్తులు | కేలరీలు |
| 1. అమెరికా | 1970 | 176 | 140 | 310 | 689 | 99 | 3300 |
| 2. ఇంగ్లండు | 1970 - 71 | 200 | 136 | 209 | 592 | 87 | 3170 |
| 3. కెనడా | 1969 | 183 | 138 | 253 | 662 | 97 | 3150 |
| 4. ఆస్ట్రేలియా | 1968 - 69 | 256 | 145 | 300 | 640 | 106 | 3220 |
| 5. ఫ్రాన్సు | 1969 - 70 | 219 | 94 | 256 | 630 | 103 | 3270 |
| 6. పశ్చిమ జర్మనీ | 1969 - 70 | 189 | 95 | 220 | 567 | 83 | 3180 |
| 7. జపాన్ | 1970 | 352 | 73 | 48 | 137 | 77 | 2470 |
| 8. చైనా | 1964 - 66 | 387 | 10 | 47 | 9 | 57 | 2050 |
| 9. ఇండియా | 1969 - 70 | 384 | 49 | 4 | 116 | 49 | 1990 |

మూలము : ఇండియా, పాకెట్ బుక్ ఆఫ్ ఎకనామిక్ ఇన్‌ఫర్‌మేషన్ 1973; 1974

**భారతదేశంలో అల్పస్థాయి సాంకేతిక విజ్ఞానము:**

అల్పాభివృద్ధి దేశాలు సాంకేతిక విజ్ఞానంలో వెనుకపడివున్న కారణంగా కష్టాలకు లోనవుతున్నాయి. భారతదేశం వంటి అల్పాభివృద్ధి దేశంలో, ఒకే రకం పరిశ్రమలో, ప్రక్క ప్రక్కనే, అత్యాధునిక సాంకేతిక పద్ధతి, అతి పాతపద్ధతి-ఉత్పత్తి చేయడానికి ఉపయోగించబడుతున్నవి. ఉత్పత్తి కేంద్రాలనుండి వెలువడుతున్న ఉత్పాదనలోని అత్యధిక భాగము, ఆధునిక శాస్త్రీయ ప్రమాణాలకంటె తక్కువ ప్రమాణం గల పద్ధతులవల్లనే ఉత్పత్తి చేయబడుతున్నది. ఉత్పాదన కేంద్రాలలోని అత్యధిక ఫ్యాక్టరీలు అవలంబించిన ఉత్పత్తి పద్ధతుల ప్రమాణం స్థాయిలు కూడా ఆధునిక శాస్త్రీయ ప్రమాణాలకంటె తక్కువ స్థాయిలోనే వున్నవి. ఉత్పత్తి పద్ధతులలో వున్న హెచ్చు వ్యత్యాసంవల్లనే అభివృద్ధి చెందిన దేశాలకు, అల్పాభివృద్ధి దేశాలకు మధ్య హెచ్చు వ్యత్యాసం గల ఉత్పాదకతలు కన్పిస్తున్నవి. "ఈ నూతన ఉత్పత్తి పద్ధతులలో కొన్ని అల్పాభివృద్ధి దేశాలకు అందినాయి గాని, అవి ఆ దేశాల్లోని కొన్ని రంగాలనే లాభదాయకంగా ప్రభావితం చేసినై. కాని అల్పాభివృద్ధి దేశాల సాంఘిక, ఆర్థిక వ్యవస్థల్లోకి ఇంకా చొచ్చుకుపోలేదు. ప్రధాన ఉత్పత్తి రంగాలను అవి యింకా తాకలేదు" అని మిత్రరాజ్యసమితివారు, తమ మెజర్స్ ఫర్ ది ఎకనామిక్ డెవలప్‌మెంట్ ఆఫ్ అండర్ డెవలప్డ్ కంట్రీస్ (1951-పే. 28)లో వ్రాసారు.

నూతన సాంకేతిక ఉత్పత్తి పద్ధతులు కావాలంటె హెచ్చు ధనాన్ని ఖర్చు చెయ్యాలి. వాటి నుపయోగించి ఉత్పాదన నిర్వహించడానికి తగినంత ఉన్నత కార్యనిర్వహణ నైపుణ్యాలు కావాలి. కొత్త సాంకేతిక విజ్ఞానాన్ని పరిశ్రమల్లో ప్రవేశపెట్టడానికి రెండు కారకాలు-మూలధనము, తగినంతమందికి ప్రశిక్షణ కావాలి. వాస్తవంగా ఉత్పత్తి చేసేవారికి ఒక కనిష్ట ప్రాతిపదిక విద్య అవసరము. అటువంటిది అందితేనే నూతన సాంకేతిక విజ్ఞానాన్ని పరిశ్రమల్లో ప్రవేశపెట్ట వచ్చు. పాత పద్ధతులను తొలగించే ప్రక్రియకు, నేటి అత్యాధునిక సాంకేతిక విజ్ఞాన సమ్మతమైన ఉత్పత్తి పద్ధతులను ప్రవేశపెట్టేందుకు మూలధన లోపం అడ్డుతగులుతూ వున్నది. నిరక్షరాస్యతవల్ల అవసరమైన మేరకు నైపుణి గల శ్రామికులు లభ్యం కాకపోవడము-సాంకేతిక విజ్ఞానాన్ని పరిశ్రమల్లో విస్తరింపచేయుటానికి ప్రధాన ప్రతిబంధకంగా వున్నది.

అదంతా భారత ఆర్థికవ్యవస్థలోని ప్రాతిపదిక బలహీనత అని చెప్పాలి. భారతదేశ ఆర్థిక కార్యకలాపాల నిర్వహణలో ఉపయోగించబడుతున్న సాంకేతిక విజ్ఞానస్థాయి హీనంగా వున్నందువల్లనే వ్యవసాయరంగంలో ఎకరా ఉత్పాదకత, శ్రామిక ఉత్పాదకత; పారిశ్రామిక రంగంలో శ్రామిక ఉత్పాదకత హీనంగా వున్నాయి. భారతీయ వ్యవసాయకులు బీదలు. మెరుగైన విత్తనాలు, రసాయనిక ఎరువులు, క్రిమి సంహారక మందులు మొదలైన అత్యవసర ఉత్పాదకాలను కొనేందుకు వారికి తగినంత ద్రవ్యం లేదు. ఈ స్థితిలో వారు యింకా ఎక్కువ వెలకు కొనవలసిన-ఉత్పత్తిదారునకు అవసరమైన మూలధన యంత్రాలను-హార్వెస్టర్స్, ట్రాక్టర్స్, సోయింగ్ మిషన్స్ మొ॥వాటిని కొనలేకపోతున్నారు. వస్తు తయారీ రంగంలో వ్యక్తులు, భాగస్వామ్య విధానము, చాలా ఉత్పత్తి యూనిట్లకు స్వామ్యం వహిస్తున్నవి. తక్కువ ఆర్థిక తాహతుగల ఈ ఫ్యాక్టరీ స్వాములు తమ పరిశ్రమల్లో ఆధునిక ఉత్పత్తి పద్ధతులను, హెచ్చు ఉత్పాదక పద్ధతులను ప్రవేశపెట్టలేకపోతున్నారు.

(ఇంకా ఉంది)

# క్లాస్ రూమ్

బయట వాన
లోన గోల,
అది ప్రకృతి
ఇది వికృతి.

—రావి రంగారావు

# అమృతాంజన్ లిమిటెడ్‌వారి విశిష్ఠమైన ఆముదము




శుద్ధి చేసినది, వాసన లేనిది.

అమృతాంజన్ లిమిటెడ్ 42-45, లజ్ చర్చ్ రోడ్డు, మద్రాసు 600 004

Amrutanjan Limited 

శ్రీ ఎన్. ఎస్. సుందరేశ్వరరావు

# సోమశేఖరశర్మగారు పరిష్కరించిన కవుల చరిత్రేనా ?

"కందుకూరి వీరేశలింగం పంతులు ఆంధ్ర కవుల చరిత్రము-ద్వితీయభాగము-(మధ్యకాలపు కవులు)" అనే సంపుటాన్ని రాజమండ్రి హితకారిణీ సమాజం, హైదరాబాద్ తెలుగు విజ్ఞానపీఠం అందించిన ఆర్థిక సహాయంతో, మల్లంపల్లి సోమశేఖరశర్మ పరిష్కార పాఠంతో 1986లో అచ్చువేశారు.

ఈ గ్రంథాన్ని సమీక్షించడమే ఈ వ్యాస పరమార్థం. హిత కారిణీ సమాజం అధ్యక్ష, కార్యదర్శుల పరిచయం, పంతులుగారి 1887 ఆంధ్రకవుల చరిత్ర పీఠిక, 1894 నాటి మధ్యకాలపు కవుల సంపుటానికి రాసిన ఉపోద్ఘాతం సంపుటి ప్రారంభంలోను, గ్రంథాంతంలో మ.సో.శ. అనుబంధం, దానివెంట పంతులుగారు చేర్చిన "చరిత్రము తెలియని యితర కవుల గ్రంథములు" అనే పరిశిష్ట భాగం ఉన్నాయి.

కవి చరిత్రలు రాయటానికి శ్రీకారం చుట్టినవారు గురజాడ శ్రీరామమూర్తిపంతులు, దాని తరవాత క. వీ. పంతులుగారు, ఆపైన చాగంటి శేషయ్య ఒకదానిపై ఒకటి మేలుగా రచించారు. ఈ త్రితయ సారాన్ని ఆరుద్ర కొత్త సీసాలలో నింపారు. శ్రీ బులుసు వెంకట రమణయ్యగారు ఆంధ్రకవి సప్తశతి రచించి అకారాదిగా కవుల జాబితా గ్రంథాల జాబితాలను ఇచ్చి ఒక పెద్ద సహాయం చేశారు. శతకవుల చరిత్ర, యక్షగాన చరిత్ర, విజయనగర సామ్రాజ్యమందలి ఆంధ్ర వాఙ్మయము, తెలుగు కవుల చరిత్ర, దక్షిణ దేశీయాంధ్ర చరిత్ర, ద్విపద కావ్యచరిత్ర-అన్నీ కవి చరిత్రలే. విజ్ఞాన సర్వస్వాలలో కవుల చరిత్ర-ప్రక్రియల చరిత్రలు వేరువేరుగా కనబడతాయి.

ప్రామాణికమైన కవుల చరిత్ర రచనకు పూనుకొన్నవారు కందుకూరి వారే. ఆ తరవాత చెప్పుకోవలసింది చాగంటి శేషయ్య ఆంధ్రకవి తరంగిణి, నిడుదవోలు వేంకటరావు తెలుగు కవుల చరిత్రలో శాసన కవులు కూడ చేరడం విశేషం. ఛందోబద్ధమైన రచన చేసినవాడు కవి కాకుండునా అని ఆయన వాదన. కృతులు లభింప మింజేసి ఆయన శాసనపాఠాలు పూర్తిగా ఇచ్చారు. ఇది అఖండ దీపారాధన కవుల చరిత్రని అవహేళన చేశారు. ప్రొఫెసర్ ఎస్వీ జోగారావుగారు.

ఏది ఏమయిన కవుల చరిత్ర రచన ఆగిపోయింది. కందుకూరి, చాగంటి గ్రంథాలు కూడా కరవయ్యాయి. ఇది పూర్వగ్రంథ పునర్ముద్రణ, సిద్ధాంత గ్రంథ ప్రథమ ముద్రణల యుగం.

ఒకే సంపుటంగా ఆంధ్ర కవుల చరిత్రను సంధానించినవారు ఎందుకో 1917లో పరిష్కరించి ప్రథమభాగాన్ని అచ్చువేసి విడగొట్టారు. ఆ తర్వాత భాగాలు రెండూ రెండు సంపుటాలయ్యాయి. సమగ్రంగా ఒక సంపుటంగా ఈ రోజుల్లో అచ్చు వేయలేమా అని అనిపిస్తుంది.

ఆంధ్రకవుల చరిత్ర మూడు భాగాలను క్షుణ్ణంగా చదివితే కాని పరిష్కర్త పని సులభసాధ్యం కాదు.

ఈ రెండో సంపుటం అనుబంధంలోని పెదపాటి జగ్గన ప్రబంధ రత్నాకరం (284 పుట), అందులోని కవులూ, కావ్యాలు, దూబగుంట నారాయణకవి విషయం (294), ప్రథమ భాగంలో 1917లో పంతులుగారే చెప్పారు, మూడో సంపుటంలో అని యాది గణపతి దేవుడు ఉండగా తిరిగి ఈ రెండో సంపుటంలో ముందుగానే అనుబంధంలో ప్రత్యక్షమయ్యాడు. ఈ కవి కొలని గణపతిదేవుడు మొదటి సంపుటంలో చేరవలసినవాడు.

అనుబంధంలోనే వణుకూరి గుర్వరాజు అతని శమంతకమణి చరిత్ర (పుట 291) అని పేర్కొన్నారు. పంతులుగారు (పుట307) దీనిని వారి అనుబందంలో ఇదే సంపుటంలో ఇచ్చారు.

కుమార ధూర్జటి (102-105) చరిత్రలో చేసిన కాల నిర్ణయాన్ని మూడో సంపుటంలో ధూర్జటి వెంకటరాయకవి చరిత్రలో సవరించారు. పరిష్కర్తలు ఒక్క మాటకూడా విదల్పలేదు.

కాలనిర్ణయ చర్చలో చారిత్రకులైన సోమశేఖరశర్మగారు తమ అభిప్రాయాలు స్పష్టంగా చెప్పగలరు గదా! ఆంధ్రకవి తరంగిణిని ఆయన ప్రామాణికంగా తీసుకోవడం విడ్డూరంగానే ఉంది.

ఇకపోతే అముద్రితంలోని కవుల విషయానికి వస్తా.

1. దామెర అంక భూపాలుడు - (287) ఉషా పరిణయం. చెన్నపట్నం తెలుగువారిదని నిరూపించడానికి దీని గ్రంథావతారిక ప్రథమాధారం. ఇది అముద్రితం కాదు. చెన్నపురి రాజధాని కళాశాల ప్రొ॥ చిన్నికృష్ణయ్యవద్ద పరిశోధన చేసిన విద్యార్థి దీనిని ప్రకటించినాడు. సోమశేఖర శర్మగారు ఒక వ్యాసములో దీనిని పేర్కొన్నారు.

2. చింతలపూడి ఎల్లనార్యుడు(288)విష్ణు మాయానాటకమను రసవత్ప్రబంధము నీతడు రచించినట్లు ప్రతీతి. ప్రతీతి ఏమిటి? ఇది ఎల్లనార్యునిదే. పిఠాపురం రాజావారు, మద్రాసు విశ్వవిద్యాలయం వారు విడివిడిగా ప్రచురించారు. మడికి అనంతయ్య వాదం నీరసమైంది. ఆంధ్రకవి తరంగిణి చేతిబట్టుకొని వీరేశలింగం పంతులు కవి చరిత్రను సంస్కరించే దుర్గతి ఎందుకొచ్చిందో తెలియదు.

3. కందనామాత్యు (290)డనే కవి కవి తరంగిణి కర్త సృష్టే. మడికి సింగన, కందన మంత్రిపై తారావళిని చెప్పినాడు. సకల నీతి సమ్మతం బాగా చదివితే తెలుస్తుంది. ఇందులో 4 పద్యాలు లేవు. 17 పద్యాలున్నాయి.

4. పొన్నతోట ఔబళకవి(289) "మార్కండేయ పురాణము వామన పురాణం అను నీతని గ్రంథములు. మార్కండేయ పురాణమముద్రితము. అది 10 ఆశ్వాసములు కలది. వామన పురాణము లభించలేదు.

ఈ పరిష్కర్త పదే పదే ఉదాహరించిన ఆంధ్రకవి తరంగిణి (9వ సం - పుట 125)లో వామన పురాణం ఉన్నట్లు, మార్కండేయ పురాణం దొరకనట్లు ఉంది. దీన్నిబట్టి చూస్తే పరిష్కర్త ఆంధ్రకవి తరంగిణి కూడా బాగా చదవనట్టు తెలుస్తుంది.

నందూరి కేతనమంత్రి (290) "మంచన రచించిన కేయూర బాహుచరిత్రమున కితడు కృతిపతి"

పంతులుగారి కవుల చరిత్ర పరిష్కరించడానికి ఆంధ్ర కవుల చరిత్ర సమగ్రంగా చదివి ఆకళించుకోవాలని ముందే చెప్పడమయింది. పంతులుగారే ప్రథమభాగం (1917. పుట 249)లో "మంచన. ఈ కవి కేయూర బాహు చరిత్రమన నాలుగాశ్వాసముల గ్రంథమును రచించి నండూరి గుండన్న మంత్రి కంకితము చేసెను." సోమశేఖర శర్మగారే వెలనాటి చోళుల వంశావళి, కేయూర బాహు చరిత్ర అనే ప్రశస్త వ్యాసాన్ని భారతి (అక్టోబర్ 1927)లో ప్రచురించారు. వారేనా కవుల చరిత్ర పరిష్కరించింది.

బమ్మెర కేసన మల్లన కవులు (290) పంతులుగారు ప్రథమ భాగం (1917) బమ్మెర పోతన చరిత్రలో పేరినిగూర్చి (567వ పుట) చర్చించారు. మూడో భాగంలో బమ్మెరపు పెదమల్లింగం చరిత్రలో కొంత ఉంది.

సిద్ధిరాజు తిమ్మరాజుని (298) ఈ గ్రంథంలోని రామరాజు భూషణుని చరిత్రలో (146) పంతులుగారు పలకరించారు.

కాచిరాజు బసవన్న (296) "ఇతనిగూర్చి విశేషములు తెలియలే"దట. ఆంధ్ర పరిషత్కార్యాలయము లోనున్న కవిసర్ప గారుడ మితని రచనయగునో కాదో నిశ్చయింప నవకాశము లేదు."

పైన చెప్పిన ఆంధ్ర పరిషత్కార్యాలయంలోనే కవిసర్ప గారుడం రెండు ప్రతులున్నాయి. (4950, 3575) ఇతడు రుక్ వరకుల శాఖకు చెందినవాడు. ఆత్రేయస గోత్రజుడు. శ్రీగిరిమల్లికార్జున భక్తుడు. (వివరాలకు ఆ.సా.ప. పత్రిక విక్రమ - జ్యేష్ఠ, భాద్రపద మాసములు సం-29, సం.2-3, పుట 23-24)

బసవన హయోగసారం అనే గ్రంథాన్ని కూడా రాశాడు. దాని సంఖ్య 1326.

భానుకవి ( 296 ). "ఇతడు పంచతంత్రమును తెనిగించి శ్రీకృష్ణదేవరాయల కాలములో నుండిన లక్ష్మీనారాయణ కంకితమొనర్చెను.

ఈ వాక్యం ఇట్లా వుండాలి.

"శ్రీకృష్ణదేవరాయల సంగీత విద్యా గురువు వ్యాసతీర్థులతో పాటు ప్రఖ్యాతి చెందిన అంతఃపుర సంగీత విద్వాంసుడు బండారు లక్ష్మీనారాయణ" అని. బండారు లక్ష్మీనారాయణ సంగీత సూర్యోదయకర్త. కృతిభర్త రాయలవారే.

కృష్ణరాయల కాలంలో లక్ష్మీనారాయణకు అంకితం అంటే చిరునామా లేకుండా జాబు రాసినట్టుంది. సోమశేఖరశర్మగారికి ఈ గ్రంథం, దీని ముద్రణ బాగా తెలుసు.

మల్లారెడ్డిదేశాయ్ (298) "గంగాపుర మాహాత్మ్యము అసమగ్రము, అముద్రితమట"! ఇది ముద్రితమే సురవరం ప్రతాపరెడ్డి ప్రశస్తమైన పీఠిక రాశారు. ఆయన ఈ కవిని రెడ్డెడ్డి మల్లారెడ్డి అని పిలిచారు.

భద్రకవి లింగకవి (299). ఇత డచ్యుతదేవరాయల కాలము వాడట! పైగా అముద్రితములట. సోమశేఖరశర్మగారిట్లు సంస్కరించి ఉండరు. దేవాంగపురాణంలో కాళహస్తినాయకుని ప్రశంస ఉంది. అతడు అచ్యుతదేవరాయల పేర పడవీడుపుర తిరుమలేశ్వర గుడికి దానధర్మాలు చేశాడు. వివరాలు నిడుదవోలు వేంకటరావు గారి దక్షిణదేశీయాంధ్రవాఙ్మయంలో (1978, పుట 16) ఉన్నాయి.

ఈ రెండూ 1879, 1885లో చెన్నపురిలోని ఆరాధ్యుల వీరేశలింగంగారు ముద్రించారు.

గ్రంథఖండంలో [ ] అనే గుర్తులు పెట్టినవి సోమశేఖరం శర్మగారి సవరణలని ప్రకాశకుల వృత్తాంతం.

నందితిమ్మన చరిత్రలో గయశాసన ప్రసక్తిని శర్మగారు చేర్చలేదు. గయలో తెలుగు పారిజాతాపహరణంలోని పద్యం శిలపై చెక్కబడి ఉంది. పైగా వారి మిత్రులు డా॥ వేంకటరమణయ్యగారు భారతిలో పెద్ద రభస చేశారు కూడా. ఇతడు త్రిస్థలి దండకం రాసినట్టు అప్పకవి చెప్పాడు. ఇతని శృంగారగజరత్నాకరం మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తకశాలలో ఉండాలి. అది తిరుపతికి దిగెనో లేదో తెలియదు. పైగా గ్రంథసూచికల కెక్కలేదు.

నాదెండ్ల గోపమంత్రిని శర్మగారు చేర్చినట్లున్నది. 1949 ముద్రణంలో లేదు. తెనాలి రామలింగకవి ఉద్భటారాధ్య చరిత్ర కృతిపతి. ఊరదేచమంత్రి గొప్ప సంస్కృత పండితుడు. శివరంభ స్తవములకు వ్యాఖ్య రాసినవాడు. నాదెండ్ల గోపనకడ ఉద్యోగి. ఉద్భటారాధ్య చరిత్రలో ఈ గోపనను రామలింగకవి ఉద్వేత్తుగా పొగడాడు. తెనాలి రామకృష్ణకవి చరిత్రలో ఊరదేచ మంత్రిని గూర్చి కొన్ని మాటలు చెప్పారు పరిష్కర్తలు. పింగళి నేటి మాచర్ల తాలూకాలో కిన్నల్ గ్రామం. అప్పకవి దీనిని పేర్కొన్నాడు.

ఎఱ్ఱన చరిత్రలో సంస్కరణలు లేవు. కాని కొక్కోక కృతిపతి అయిన కుంటుముక్కల మల్లయకు శైవాచార సంగ్రహ కృతికర్త కుంటుముక్కల తిరుమలనాథకవి అన్న కొడుకు. కృష్ణరాయల కాలమునకు కొంచెము ముందువాడు. కుంటుముక్కల తిరుమలనాథ కవి చరిత్ర చేర్చదగినది.

శైవాచార సంగ్రహం, సకల నీతికథానిధానం రెండూ చెన్నపురి ప్రాచ్యలిఖిత పుస్తకశాలవారు ప్రకటించారు. శర్మగారెరిగినవే.

తిమ్మరాజు (పుట 192) పుట్‌నోట్ "ఇతడు సిద్ధిరాజు తిమ్మరాజని ఆంధ్రకవి తరంగిణి" ఇంత తెలిసినప్పుడు తిరిగి అనుబంధంలో చర్విత చర్వణగా సిద్ధిరాజు తిమ్మరాజును ఎందుకు చేర్చారు ?

ఎలకూచి బాలసరస్వతి - ఇతడు భాషా వివరణ మనే గ్రంథాన్ని రాసినట్లు అప్పకవి చెప్పారు. ఈ వివరణ వాల్మీకి కృతమని భావించే పాకృత వాల్మికి సూత్రాలకి. భాషా వివరణ, అడయార్ లైబ్రరిలో ఉంది.

ప్రథమ భాగం పరిష్కరణ ఏ తీరుగా సాగిందో తెలియదు. రెండోభాగం పరిష్కరణ సంతృప్తిగా లేదు. మూడోది ఎట్లుండునో ఎరుగరాదు.

మల్లంపల్లి సోమశేఖరశర్మగారి పరిష్కరణ చేసినట్లు హితకారిణీ సమాజం వారు చెప్పినా నమ్మదగినదిగా లేదు. మల్లంపల్లివారు శాసన సంస్కరణ యందు అందె వేసిన చెయ్యి. డిగ్రీలు లేని పాండిత్యంతో యూనివర్శిటీ ప్రొఫెసర్ అయ్యారంటే ఆయన చారిత్రక జ్ఞానసంపత్తి ఎట్టిదో చెప్పనవసరం లేదు.

అడుగడుగునా ఆంధ్రకవి తరంగిణి తడవ నవసరం ఆయనకు అక్కరలేదు.

వీరేశలింగం పంతులు కవి చరిత్ర ఇంత అధ్వాన్నంగా సాగిందంటే కారణాలేవో హితకారిణీ సమాజంవారు చెప్పాలి.

వీరేశలింగం పాఠాన్ని యథాతథంగా అచ్చువేయాలి. పాఠ మధ్యంలో బ్రాకెట్లు పెట్టడం, అదే టైపు ఉపయోగించడం శాస్త్రీయం కాదు. అనుబంధం కాస్త పెద్దగా ఉన్నా ఫరవాలేదు గాని పాఠ మధ్య సవరణలను చదవడం సీతాఫలం తిన్నట్లే.

[ "ఆంధ్రకవుల చరిత్రము - ద్వితీయ భాగం. మధ్యకాలపు కవులు" కందుకూరి వీరేశలింగము ప్రకాశకులు హితకారిణీ సమాజం రాజమహేంద్రవరం. వెల : 50. పుటలు 309 ]

# ఈ మాసం - మీ నక్షత్రఫలం

జూన్ - 1988

**మేషము** (అశ్విని, భరణి, కృత్తిక 1పా)

అశ్విని వారికి 18 తే. తర్వాత నలత, శ్రమ హెచ్చుగా ఉండును. ఆదాయం బాగున్నా, అంతకుమించి వ్యయం జరగడమే కాకుండా, ఏ పనులకై ధనం ఖర్చు చేయడం జరుగుతున్నదో, ఆ పనులు మాత్రం వాయిదా పడుతూ ఉంటాయి. బంధుమిత్రులతోను, ముఖ్యంగా పితృవర్గం వారితోను ప్రతికూలత ఏర్పడుతుంది. కుటుంబ సంసార సౌఖ్యం బాగుండును. ఆరోగ్యం కలుగును.

భరణి వారికి నెలంతా శుభయోగమునే కలిగించును. ఆదాయం బాగుగానుండును. సువర్ణ వస్త్రాభరణ ప్రాప్తి కలుగును. సంతాన సౌఖ్యం కలుగును. శుభకార్య ప్రయత్నాలు నెరవేరును. విద్యార్థులకు, ఉత్తమశ్రేణి, విజయం కలుగును. వృత్తి సంబంధమైన ఉద్యోగులూ, వ్యాపారులూ, వ్యవసాయదారులూ మొదలయినవారికి, వారి వారి ఉద్యోగ, వ్యాపారవృత్తి మూలకంగా ధనం ఇబ్బడి, ముబ్బడిగా కలసి వచ్చును. అయితే శరీరశ్రమ మాత్రం విశేషంగా ఉండును.

కృత్తిక 1 పా. వారికి 18 తే. తర్వాత ధనలాభం, కార్య విజయం కలుగును. విద్యార్థులకు ఉన్నతశ్రేణి, వర్తకులకు, కర్షకులకు సర్వవిధాల మేలు కలుగును. కుటుంబంలో సుఖసంతోషాలు, సంతానమునకు అన్నివిధాల అభివృద్ధి కలుగును. ఇంతవరకు ఉన్న ఆటంకములు, అవాంతరములూ, తొలగిపోవును. ఉద్యోగులకు ప్రమోషను కలుగును. 10 తే. లోగా అనుకోనివిధంగా మేషరాశి వారందరికి ధనలాభం కలుగును. శుభకార్యములలో పాల్గొనుట, గృహమందు శుభకార్యములు చేయుట జరుగును.

**వృషభము** (కృత్తిక 2, 3, 4పా. రోహిణి, మృగశిర 1, 2 పా)

కృత్తిక 2, 3, 4పా. వారికి మానసికంగా వ్యథ, ధనవ్యయం జరుగును. వ్యవసాయదార్లకు వర్తకులకు, ఉద్యోగులకు, విద్యార్థులకు యోగం సామాన్యంగానే ఉంటుంది. నెల మధ్యలో కొన్ని కొత్త సమస్యలను ఎదుర్కొనవలసి వచ్చును. నెలంతా ఎప్పటికప్పుడు ఏదో ఒక కొత్త సమస్య ఎదుర్కొనవలసి వచ్చుచుండును. స్థిర కార్యములకు, శుభకార్యములకు, ధనం ఆశతో ఖర్చు పెట్టుటయే జరుగును. కాని ఫలితం మాత్రం ఉండదు. విద్యార్థులకు, వర్తకులకు కొంత ప్రోత్సాహం లభించును.

రోహిణి వారికి నెలంతా [illegible] నెరవేరవు కాని సామాన్య వ్యవహారములు సాఫీగా జరిగిపోవును. నిష్కారణ వ్యయం జరుగును. వర్తకులకు, వ్యవసాయదార్లను అనుకూలంగానే ఉంటుంది. విద్యార్థులకు కొంత నిరాశ మిగులును. ఉపాధ్యాయులకు, రాజకీయవాదులకు బాగుగా కలసివచ్చును. శుభకార్యముల నిమిత్తము అవసరము లేని వ్యయం జరుగుచుండును. సంబంధములేని బాధ్యత లలో తలదూర్చవలసి వచ్చును. అందువలన ఇతరుల కష్టములను కూడ నెత్తిపై వేసుకొనవలసి వచ్చును.

మృగశిర 1, 2పా. వారికి 14తే.వరకు శరీరశ్రమ హెచ్చుగా నుండును. బంధువులతో విరోధము కలుగును. స్త్రీ మూలకంగా ధనము కలుగును. బంధుమిత్రాదుల ఇండ్లలో జరుగు శుభకార్యముల నిమిత్తం వ్యయం హెచ్చుగా నుండును. మానసికంగా ఏదో విధమైన కారణముగా పిరికితనము, ఆందోళనము, ఆలోచనలు హెచ్చుగా నుండును.

**మిథునము** (మృగశిర 3, 4పా. ఆర్ద్ర, పునర్వసు 1, 2, 3పా.)

మృగశిర 3, 4పా. వారికి కార్యసిద్ధి, భార్యకు శరీరంలో నలతా, బంధువిరోధం కలుగును. 18-18తే.ల మధ్య అనుకోకుండా ధనలాభం కలుగును. శారీరకంగా, మానసికంగా శ్రమ హెచ్చుగా నుండును. పితృవర్గంవారితో మాటపట్టింపులు, వ్యవహారవు చిక్కులు కలుగును. అయినను బంధుమిత్రాదుల మూలకంగా ధనలాభం, కార్యసిద్ధి కలుగును.

ఆర్ద్ర వారికి అధికశ్రమ కలిగినా, పట్టినదల్లా బంగారమగుట, ఏ విషయంలోను అడ్డు, ఆటంకములు లేకపోవుట, పెద్దలతో స్నేహము, మంచి మాటనేర్పు కలుగును. అన్నీ ఉన్నను చివరకు అనుభవంలోనికి వచ్చినపుడు ప్రయోజనము ఇతరులకేగాని తనకు మాత్రం ఏమీ ఉపయోగపడదు. 18తే. దాటిన తర్వాత పనికిమాలిన వ్యయం హెచ్చుగా నుండును. అందులోను తనగురించికాక, బంధుమిత్రాదులను గురించి, శుభకార్యముల గురించి, వ్యయం హెచ్చుగా

జరుగును. మొత్తంమీద శ్రమకు తగినఫలితము కలిగినను, ఈ నక్షత్రం గలవారికి మాత్రం అది అనుభవంలోనికి రాదు.

పునర్వసు 1, 2, 3పా. వారికి మొదటి వారమంతా చిన్న చిన్న చిక్కులతో గడచినను, 8తే. నుండి నెలంతా సుఖప్రదంగా నుండును. ధనలాభం, కార్యసిద్ధి, సంసార కుటుంబసౌఖ్యం, సంతానమునకు అభివృద్ధి కలుగును. 13-16తే.ల మధ్య ఆకస్మిత ధన లాభం కలుగును. మాట పలుకుబడి కలుగును. విద్యార్థులకు, వర్తకులకు. ఉద్యోగులకు [illegible]. స్త్రీలకు బాగ అన్నివిధముల అనుకూలంగా నుండును.

## కర్కాటకము (పునర్వసు 4 పా. పుష్యమి, ఆశ్లేష)

పునర్వసు 4పా. వారికి శారీరక మానసికశ్రమ హెచ్చు. యోగం బాగా ఉన్నను, ప్రతి విషయంలోను అకారణ విఘ్నములు, సంకోచం, ఆందోళనము కలుగును. ప్రతివారితోను ఏదో విషయంలో కలహము జరుగును. చేతికందవలసినది సగము సగముగా నుండుట, ఆ అందినది ఏదో విధముగా నిరుపయోగముగా ఖర్చగుట జరుగుచుండును. అయినను ఆరోగ్యం బాగుగానే ఉండును.

పుష్యమి వారికి విపరీతమైన వ్యయం, ఇంచుమించు నెలంతా ఉండును. ధనమునకు విశేషమైన వ్యయ ప్రయాసలు పడవలసి వచ్చును. కొందరిచే మాటపడవలసి వచ్చును. కుటుంబంలో చిన్న చిన్న కలతలు ఏర్పడును. ఉద్యోగులకు అధికారులతో మాటపడవలసి వచ్చును. వర్తకులకు సామాన్యలాభం, విద్యార్థులకు మేలుగా నుండును. మొత్తంమీద శ్రమ హెచ్చుగా, ఫలం తక్కువగా నుండును.

ఆశ్లేష వారికి 12తే. వరకు ఆందోళనము, చిన్న చిన్న ప్రమాదములు, విపరీత ధనవ్యయం, కొందరితో విరోధము కలిగి నెలంతా చిక్కులతో గడచును. అందులోను విపరీతశ్రమ, వ్యయ ప్రయాసలు, రాత్రింబగళ్ళు, ఆందోళనము, నిద్రపట్టకుండుట జరుగును. అనుమానము హెచ్చును. కురుపులు, గాయములు తగులును. తొందరపాటు, అనాలోచితముగా మాటలాడుట, ఇతరులచే మాటపడుట జరుగును. 20-30 తే.ల మధ్య అనుకొనని విధంగా ధనవ్యయం జరిగినా, క్రమక్రమముగా కొంత అనుకూల పరిస్థితు లేర్పడును.

## సింహం (మఘ, పుబ్బ, ఉత్తర 1 పా.)

మఘవారికి ధనలాభం బాగుండును. శరీరంలో నలత హెచ్చును. పనికిమాలిన ప్రయాస, దురాశ హెచ్చును. నిరాశ మిగులును. ఏది కలసివచ్చినను అది రాశియేగాని, వాసి తక్కువగా నుండును. ఊహలు అంబర వీథిలో పరుగెత్తుచుండును. పగటికలలు కనుచుండును. ఆ కలలు కనుటతోనే సంతృప్తి కలుగును. ఏవియు పూర్తిగా ఫలించవు. వ్యయం హెచ్చుగా నుండును.

పుబ్బ వారికి గతంలోని గ్రహ వైషమ్యము తొలగిపోయి, మంచి అభివృద్ధి కలుగును విద్యార్థులకు ప్రథమశ్రేణి కలుగును. వర్తకులకు పుష్కలంగా లాభం కలుగును. శ్రామిక, కర్షక వర్గము వారికి అన్నివిధముల సంతృప్తి, సుఖసంతోషములు కలుగును. మొత్తంమీద ఈ నక్షత్రము వారికి శుభము, సుఖము, శ్రేయస్సు ఆరోగ్యము, రాజగౌరవం కలుగును.

ఉత్తర 1పా. వారికి శరీరశ్రమ తప్ప, మిగిలినవన్నియు అనుకూలంగానే ఉండును. ధనలాభం బాగుండును. అనుకోకుండానే గతంలో ఆశించినవి, ఊహించినవి అయిన సర్వలాభములు అనగా ఉద్యోగులకు ప్రమోషను, వర్తకులకు లాభం విద్యార్థులకు ఉన్నత శ్రేణి, కర్షకులకు సస్యానుకూలత, ధరలు సామాన్యులకు కొంచెము అందుబాటులో నుండుట, జరుగును. మొత్తంమీద సుఖసంతోషములు వృద్ధియగును.

## కన్య (ఉత్తర 2, 3. 4 పా. హస్త, చిత్ర 1, 2 పా.)

ఉత్తర 2, 3, 4పా. త్రిప్పట. అలసట. శ్రమ. ఖేదము, వ్యాగ్రత మొదలగునవి కలుగును. శని. గురు. కుజుల దోషం కొంతగా చిక్కులను తెచ్చిపెట్టును. ప్రతి పనిలోను కార్య విలంబము జరుగుచుండును. వ్యర్థమైన ప్రయాస పడుట జరుగును. వ్యయము తలకు మించినదిగా జరుగును. చేతికందెడి ఫలితం తగ్గిపోవుచుండును.

హస్త వారికి శరీరంలో నలత, వ్యవహారపు చిక్కులు, కుటుంబంలో అశాంతి, శుభకార్య విఘ్నములు, మానసికంగా ఆందోళనము, పిరికితనము, పనికిమాలిన ధనవ్యయం, ప్రతి పనికి ఏదో విధమైన ఆటంకము, బంధువిరోధం, తరచుగా అస్వస్థత, శరీరంలో అతివేడిమి మొదలగునవి కలుగును. రాత్రింబగళ్ళు మనస్సునకు ఆందోళనము కలిగించెడి ఏవో ఆలోచనలు కలుగుచుండును. శరీర శ్రమ హెచ్చుగా నుండును.

చిత్ర 1, 2పా. వారికి శ్రమతో కూడిన ఫలితము, కార్య విజయము కల్గును. అన్నింటిలోను వ్యయము శుభపరిణామము కలుగును. కాని చివరివరకు తలపెట్టిన కార్యము ఫలించునా? ఫలించదా? అన్న అనుమానము, సందేహము, ఆందోళనమునకు దారితీయును. అపజయము కలుగునేమో అన్న జంకుచే విపరీతముగా శ్రమపడవలసి వచ్చును. పాటుపడినా, పడకపోయినా వ్యాపార, వ్యవహార ఉద్యోగాది విషయములలో అనుకూలమైన ఫలితం దానంతట అదే కలసి వచ్చును.

**తుల** (చిత్ర 3, 4 పా. స్వాతి, విశాఖ 1, 2, 3 పా.

చిత్ర 3, 4పా. వారికి మంచి యోగకాలం. ఏ విషయమైనా తలపెట్టినంతమాత్రంచేతనే విజయం కలుగును. ప్రజాభిమానము కల్గును. వివాహాది శుభకార్యములు ఫలించును. గృహనిర్మాణం, భూమి, వాహనము, బ్యాంకులో డిపాజిట్లు వేయుట మొదలగు స్థిర ప్రయత్నములు ఫలించును. విద్యార్థులు, ఉద్యోగులు, వర్తకులు, వ్యవసాయదారులు మొ॥వారందరికిని అనుకూలమైన కాలము.

స్వాతి వారికి అన్నియు అనుకూలంగానే ఉండును. కాని సోదర జ్ఞాతి దాయాద బంధువులతో అకారణ విరోధము కలుగును. 19వ తేదీనుండి నెలాఖరు వరకు మానసిక క్లేశము కలుగును. దూర బంధు వియోగము కలుగును. కుటుంబంలో అశాంతి పెరుగును. ధనమునకు లోపం లేకపోయినా, అనుకొన్న పనులకు హఠాత్తుగా ఎప్పటికప్పుడు విఘ్నములు కలిగి, ఫలించుటకు సిద్ధముగా ఉన్న ప్రయత్నములు భగ్నములై పోవును.

విశాఖ 1, 2, 3పా. వారికి అన్నివిధముల అనుకూలమైన కాలము. కాని 1-6 మధ్య, తిరిగి 21-30 తేదీలమధ్య అనారోగ్యం, నలత, శ్రమ, కార్యవిఘ్నము, మనఃఖేదము కలుగును. 6-20 తేదీల మధ్య చిన్న చిన్న ఒడుదొడుకులు కలిగినా, అనుకొన్న పనులు సాఫీగా జరిగిపోవుచుండును. సోదరులు, బంధువులు మొదలగు వారితో మాటపట్టింపులు వచ్చును.

**వృశ్చికము** (విశాఖ 4 పా. అనూరాధ, జ్యేష్ఠ)

విశాఖ 4పా. వారికి 1-6; 20-30 తేదీలమధ్య భార్యకు శరీరంలో నలత, భార్యా మూలకంగా వ్యయం, డాబు దర్పములు, దర్జా, ఆడంబరములు, లగ్జరీ ఖర్చులు మొదలగువాని నిమిత్తము, సుఖ భోగముల నిమిత్తం తల్లిదండ్రులు, పిల్లలు మొదలగువారికి నూతన వస్తువులు, విద్యాభివృద్ధి మొదలగువాని నిమిత్తము ఖర్చగును. బంధువులు రాకపోకల వలన ధనవ్యయం కలుగును. ఐనను యోగ దాయకంగానే గ్రహస్థితి ఉండును.

అనూరాధ వారికి 12 తేదీవరకు విపరీతంగాను, ఆ తర్వాత నెలాఖరున కుటుంబంలో కలతలు, నలతలు మూలకంగాను, విపరీతముగా ధనవ్యయం జరుగును. మనఃఖేదం, క్లేశం, ఆందోళన, బంధు మిత్రాదుల వలన వత్తిడి హెచ్చుగా నుండును. ఆర్థికంగా నెలంతయు ఎంత బాగుగా యోగించునో, అంత హెచ్చుగానే కుటుంబంలో వ్యయం, కలతలు, నలతలు, అభిప్రాయభేదములు, మనోవైకల్యం కూడ కలుగును.

జ్యేష్ఠ వారికి కూడ 15వ తేదీవరకు అకారణమైన ఆందోళనము, మనఃఖేదం, ధనవ్యయం జరుగును. వ్యవహారములలో ప్రతిష్టంభనము జరుగును. అనుకున్నదొరకటి, జరుగుచున్నదొరకటి జరుగును. ఏదోవిధంగా ధనం కలసివచ్చినను, దాని వినియోగం మాత్రం సవ్యంగా జరుగదు. జ్ఞాతి బంధు దాయాదులతో చిన్న చిన్న విషయములలో అభిప్రాయభేదములు కలిగి, మాదుచుండగనే అవి తారాస్థాయిని చేరును. అందువలన ఉభయులకు ప్రయోజనం కలిగించెడి కొన్ని పనులు, వ్యవహారములు బెడిసిపోవును. మొత్తంమీద మనస్సునకు నిరుత్సాహము, ఖేదము కలుగును.

**ధనుస్సు** (మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)

మూల వారికి శరీరంలో నలత హెచ్చు. ఏ పనులు అనుకొన్నట్లు జరుగవు. జరుగుచున్నట్లు ఆశ మాత్రం కలుగుచుండును. శనికి జపం చేయించుట మంచిది. రుద్రాభిషేకం వలన తలపెట్టిన కార్యములు వ్యతిరేక ఫలమునియ్యవు. ఎల్లప్పుడును నిరుత్సాహముగా, మందకొడితనముగా ఉండును. అన్నివైపులనుండి 12 తేదీ దాటిన తర్వాత ఒత్తిడి హెచ్చుగా నుండును. కుటుంబ-ఆర్థిక సమస్యలను, ఉద్యోగ వ్యవహార సమస్యలను తట్టుకొనుట కష్టమైపోవును. అన్ని విధముల చిక్కులు తలమునకలుగా ఉండును. దైవంమీద భారం వేసి, ఉద్రేకపడక ప్రతి విషయమందును మితముగా అంటీ అంటనట్లు కాలక్షేపం చేయుట మంచిది. అయితే అన్ని చిక్కులలోను ఆర్థికమైన సర్దుబాట్లు చక్కగా జరిగి, ధనమునకు లోపం లేకుండానే కాలము గడచిపోవును.

పూర్వాషాఢవారికి గతంలోని చిక్కులు, అనారోగ్య పరిస్థితులు క్రమంగా తొలగిపోయి, ప్రతి విషయము అనుకూలముగా మారును. ధనాదాయమునకు లోపముండదు. పదుగురిలో మంచి మాటగౌరవము, పేరు ప్రఖ్యాతులు, ప్రజా సమ్మానం జరుగును. కుటుంబంలో అప్పటప్పట చిన్న చిన్న కలతలు నలతలు తాత్కాలికంగా తొలగిపోవును. సంతానమునకు అన్నివిధాల అభివృద్ధి కలుగును. శుభకార్య ప్రయత్నములు ఫలించును.

ఉత్తరాషాఢ 1పా. వారికి మూడువంతుల శుభఫలము, ఒకవంతు మానసికశ్రమ కలుగును. శుభకార్య ప్రయత్నాలు నెరవేరును. శరీరంలో అనారోగ్యముండును. కాని అధికశ్రమ, ఏదో చిన్న నలత కల్గును. వేడిమి, అలసట, శ్రమ బాధించును. ఆదాయం హెచ్చుగా నుండును. పిసినారితనము హెచ్చుగా ఉన్నను, కుటుంబ పరిస్థితులనుబట్టి వ్యయము తప్పదు. పరి పరి విధముల మనస్సులో ఆలోచనలు కలుగుచుండును.

## మకరం (ఉత్తరాషాఢ 2, 3, 4 పా. శ్రవణం, ధనిష్ఠ 1-2 పా.)

ఉత్తరాషాఢ 2, 3, 4పా. వారికి 12వ తేదీవరకు ధన వ్యయం, కార్యవిఘ్నం, ప్రతి విషయములోను ఆటంకములు జరుగును. 18 తేదీనుండి అన్ని అనుకూలముగా మారును. ధనాదాయం బాగుండును. వర్తకులకు, వ్యవసాయదారులకు అనుకూలమైన కాలము. విద్యార్థులకు ఉన్నత విద్యావకాశం లభించును. విందులూ, వినోదములూ మొదలగువానిలో పాల్గొనుట జరుగును. అధికారులతో పరిచయం మూలకంగా అనేక విధముల కలసివచ్చును. ఈ నక్షత్రం గల అన్ని వర్గముల వారికి కార్యవిజయం, సుఖసంతోషాలు, ఆనందము, ఉత్సాహము కలుగును. ఆదాయమును మించి వ్యయము జరుగును.

శ్రవణం వారికి శరీరంలో నలత, చిన్న విషయమునకు పెద్దగా శ్రమపడుట జరుగును. ధనమునకు లోపముండదు. ఏక్సిడెంట్సు శారీరకముగానే కాక మానసికముగా కూడ పీడించును. మొత్తంమీద ఈ నెలంతా ఏదో విధమైన రుగ్మతవలన బాధపడుచుండుట జరుగును. ధనవ్యయం, మనఃఖేదం, బంధుపీడ, బంధువిరోధము కూడ జరుగును. ఒకటి తలంచినచో అది పూర్తిగా కాకున్నచో మధ్యలో మరొకటి తటస్థించుట, అది పూర్తి కాకమునుపే మరియొకటి తటస్థించుట, ఈ తటస్థించినవన్నీ, అనగా ప్రతి విషయము అతి ముఖ్యమైనవిగా అనిపించి చివరకు దేనిని సాధించలేకపోవుట జరిగి, ఒకవిధమైన అసమర్థతకు గురియగుట జరుగుచుండును.

ధనిష్ఠ 1, 2పా. వారికి విఘ్నములు ఎన్ని ఎదురైనను, అప్పటికప్పుడు కలిగిన వనరుల వలన ఆటంకముల నధిగమించి కార్యవిజయమును పొందుట జరుగును. అన్నివిధముల అనుకూలముగా నుండును. ఈ నక్షత్రం గలవారి అభివృద్ధిని చూచి సహింపలేని కొందరు ఏవో చిక్కులను తెచ్చిపెట్టినను, వాటిని సులభముగా తప్పించుకొనగలరు. తనకు తెలియకుండా విరోధులు కల్పించిన చిక్కులు తెలియకుండానే తొలగిపోవును.

## కుంభం (ధనిష్ఠ 3, 4 పా. శతభిషం, పూర్వాభాద్ర 1, 2, 3 పా.)

ధనిష్ఠ 3, 4పా.వారికి ధనలాభం బాగుగానుండును. శరీరంలో ఉష్ణతత్వము. అనగా అతివేడిమి కలుగును. బంధుమిత్రులతో మంచి ఐకమత్యం ఉండును. అన్ని విషయములలో విజయము కలుగును. రాజకీయవేత్తలకు పదవీ గౌరవం కలుగును. విద్యార్థులు ప్రతిభతో రాణించెదరు. వర్తకులకు ఊహించనంత లాభం కలుగును.

శతభిషం వారికి 12వ తేదీవరకు శరీరంలో అతి వేడిమి, శ్రమ, చిన్న చిన్న ఏక్సిడెంట్సు జరిగి, శ్రమ హెచ్చుగా నుండును. కాని సోదరవర్గముతో విభేదములు కలుగును. 19 తేదీనుండి మాతృవర్గముతో విరోధము కలుగును. భూ, గృహ వ్యవహారములు ప్రతికూలముగా నుండును. ధనము పుష్కలముగా ఉన్నను, హెచ్చుభాగం దుర్వినియోగం జరుగును. బంధువులతో వ్యతిరేక భావమేర్పడును. అయితే 18 తేదీనుండి క్రమక్రమముగా కొంత అనుకూలత ఏర్పడును. మొత్తంమీద శుభాశుభ మిశ్రమ ఫలములు కలుగును.

పూర్వాభాద్ర 1, 2, 3పా. వారికి 18 తేదీనుండి శరీరశ్రమ హెచ్చు. నెల మధ్యలో కుటుంబ పరిస్థితులు, వాగ్వాదములతో, కలతలతో, నలతలతోను గడచును. సహవాస దోషము వలన చిన్న చిన్న వ్యసనములు కూడ పట్టుబడును. నెల మధ్యలో తప్ప మొదటి చివరి వారములు బాగుగా నుండును. అయితే వ్యయం మాత్రం హెచ్చుగా నుండును.

## మీనము (పూర్వాభాద్ర 4 పా, ఉత్తరాభాద్ర, రేవతి)

పూర్వాభాద్ర 4పా. వారికి ఉద్యోగ వ్యవహారానుకూలత, పరీక్షయందు విజయం, అనేకవిధములుగా ధనభాగ్యములు కలసి వచ్చుట, ప్రతి పనియందు విజయం కలుగును. ఇంతవరకు ప్రతికూలముగానున్న వ్యక్తులుకూడ అనుకూలురుగా మారుట, రాజకీయము లందు పలుకుబడి పెరుగుట, పదుగురికి ఉపకారము చేయగలుగుట, అన్నివిధముల కలసివచ్చుట జరుగును. అయినను నెల సంబంధమైన కొన్ని చిక్కులు కలిగి తొలగిపోవును. మొత్తంమీద శుభకాలము.

ఉత్తరాభాద్ర వారికి 12 తేదీవరకు వ్యవహారగతము లయిన చిక్కులు కలుగును, క్రమక్రమముగా చిక్కుల ఉధృతి తగ్గినను, నెల చివరివరకు చిన్న చిన్న చిక్కులు తటస్థించి, ఏదోవిధముగా మనఃఖేదమును కలిగించును. శని బలము బాగుగా ఉండుటచేతను, కుజ, గురుల బలము కూడ అనుకూలముగా నుండుటచేతను, ఎన్ని విధములయిన చిక్కులు, ఒడుదుడుకులు కలిగినా, వానిని అతి సులభముగా దాటిపోవగలుగుదురు.

రేవతి వారికి ధనం బాగుగా కలసివచ్చును. అయితే బంధువుల వత్తిడి హెచ్చుగా నుండును. విద్యార్థులకు, వర్తకులకు, రాజకీయ వాదులకు, కర్షకులకు, శ్రామికులకు మొత్తంమీద అన్ని వర్గముల వారికి శుభప్రదమైన కాలము. అయితే 13 తేదీనుండి ఎంత ధనము వచ్చినను తొట్రుపాటు, స్వల్పంగా అశాంతి, అప్పటప్పట మనోవైకల్యం కలిగి తొలగిపోవుచుండును. మొత్తంమీద మూడు వంతుల శుభఫలం కల్గును.

# 1988 జులై మాసం విూ నక్షత్ర ఫలం

## మేషం (అశ్విని. భరణి, కృత్తిక 1 పా.)

అశ్విని వారికి మొదటి, రెండు వారములు తప్ప, 3, 4 వారములలో అన్నివిధాల మేలుకలుగును. పితృ సౌఖ్యం, పితృ కుటుంబ సౌఖ్యవృద్ధి, భార్యాపుత్రాది సౌఖ్యం, ఉద్యోగంలో అభివృద్ధి, కలుగును. శ్రమజీవులకు, విద్యార్థులకు సామాన్య లాభము. 1, 2 వారములు సర్వులకును. అనగా అన్ని వర్గములవారికిని నలత, శ్రమ, అనారోగ్యం, కార్యవిఘ్నం కలుగును. మిగిలిన రెండువారాలు లాభదాయకం.

భరణి వారికి 7తే. నుంచి చిక్కులు ప్రారంభమై, 27తే. నాటికి మరింత ఎక్కువయి, సర్వవిధముల శారీరక, మానసిక శ్రమను, ఆందోళనను కలిగించినను చివరకు ప్రతిపనిలోను విజయమును కలిగించును. కాని సంసార కుటుంబ సౌఖ్యం, ధనాదాయము (ఇతర విషయములుగా రావలసిన ధనము) చేతికందును. జరుగవలసిన శుభకార్యములు మొదలగు వానికి లోపముండదు. పత్రికలకు, వ్యవసాయదారులకు, లాభసాటిగా నుండును.

కృత్తిక 1పా. వారికి శారీరక శ్రమ హెచ్చుగా ఉన్నను, గతంకన్న వ్యవహారములు అనుకూలముగా మారును. శుభకార్యములు నెరవేరును. ఉద్యోగ వ్యవహారాదులు మంచి అనుకూలంగా ఉండును. మొత్తం మీద, గతంలో పరిష్కారం కాని సమస్య లొక్కొకటి అనుకూలంగా పరిణమించి, శ్రమకు తగిన ఫలితమును కలిగించును. ధనాదాయము వృద్ధియగును. కుటుంబ సౌఖ్యం కలుగును.

## వృషభం (కృత్తిక 2,3,4 పా. రోహిణి, మృగశిర 1,2 పా.)

కృత్తిక 2, 3, 4 పా వారికి గతంలో నిలచిపోయిన వ్యవహారములన్ని అనుకూలములయి విజయమును కలిగించును. బంధుమిత్రాదులతో అనుకూలమైత్రీ సంబంధములు వృద్ధియగును. ధనము కలసివచ్చును. నిరాశ చేసికొన్న కార్యములు దైవానుగ్రహముచే ఫలించును. అనుకోకుండా కొన్ని వ్యవహారములలో కలసివచ్చును శుభకార్యముల మూలకంగా ధనవ్యయం కలుగును.

రోహిణి వారికి నెలంతా చిక్కులతోనే గడచును. శుభకార్యములలో వ్యయం హెచ్చుగా జరిగినను ధనలాభం బాగుగా కలసివచ్చును. మొదటి వారంలో నష్టద్రవ్యప్రాప్తి యగును. సత్సాంగత్యం, సాధు సజ్జన సహవాసం, దైవభక్తి, ఆధ్యాత్మిక చింతనము కలుగును. పత్రికలకు, విద్యార్థులకు మేలు కలుగును. వ్యవసాయదారులకు రాజకీయవాదులకు మాత్రం, మరియు వృత్తి సంబంధమైన పనులలో నున్నవారికి కూడ, సర్వవిధముల అనుకూలముగా ఉండును.

మృగశిర 1,2 పా. వారికి సోదరవర్గీయులంతో విరోధం కలుగును. 11-19తే. లమధ్య తలచిన పనులు నిరాటంకముగా నెరవేరును. విద్యార్థులకు ఉన్నత విద్యావకాశం కలుగును పత్రికలకు, వ్యవసాయదారులకు బాగుగా కలసివచ్చును. కష్టపడిన దానికి ఫలితం అనుభవంలోనికి వచ్చును. సర్వవిధముల బంధు మిత్రాదుల, అందరి, సహాయ సహకారములు లభించును. మొత్తంమీద అనుకూలమైన కాలము.

## మిథునం (మృగశిర 3,4 పా. ఆర్ద్ర. పునర్వసు 1,2,3 పా.)

మృగశిర 3 4 పా. వారికి ఉత్సాహం, సంతోషం, ధైర్యం కలుగును. 8తే. నుండి నెలాఖరు వరకు ఉద్యోగ సంబంధమైన చిక్కులు, వ్యవహారములలో ప్రతిబంధకము, కలిగి చేతిలో పడినది దూరమై పోవుట జరుగును. అధికారులతో అకారణ కలహము కలుగు చుండును. కొన్నికొన్ని అనాచారపు పనులు చేయుట జరుగును. భార్యకు ఆరోగ్యభంగము కలుగును.

ఆర్ద్ర వారికి ఈనెల 5, 6 తే లలో ధనలాభం కలుగును. విద్యార్థులకు సర్వకార్యజయం, అనుకూలత కలుగును. అన్నివృత్తుల వారికి అనుకూలమైన కాలము. కాని మానసికముగా పరిపరివిధముల పనికిరాలిన ఆలోచనలతో కాలము గడుపవలసి వచ్చును. అనగా మనోవైకల్యం హెచ్చును. శుభకార్యముల నిమిత్తమైన ఆలోచనలు అధికమగును.

పునర్వసు 1,2,3 పా. వారికి మంచి ధనలాభముతో సర్వకార్యములందు విజయముతోను, నెలంతాగడచును. నెల ప్రారంభంలో ఏవో 1,2 ఒడుదుడుకులు కలిగినా, అంతగా బాధింపవు. 7,8 తే. లలో పుష్కలముగాగా ధనము కలిసివచ్చును, శారీరక శ్రమ హెచ్చుగా నుండును. గతంకన్న సర్వవిషయములు జయప్రదంగా ఉండును.

## కర్కాటకం (పునర్వసు 4 పా. పుష్యమి ఆశ్లేష)

పునర్వసు 4 పా. కార్యసిద్ధి, విజయము కలుగును. సహవాసదోషముచే చిన్న వ్యసనములకు కొంత వ్యర్థముగా ధనవ్యయ మగును. బంధు మిత్రాదుల నిమిత్తముకూడ వ్యయమగును. ఉద్యోగు

లకు - ప్రమోషను, విద్యార్థులకు ఉన్నత విద్యావకాశం, వర్తకులకు - లాభము, వ్యవసాయ, కార్మిక, కర్షకులందరికి అన్నివిధముల లాభము కలిసివచ్చును ఆరోగ్యం బాగుండును.

పుష్యమి వారికి 8తే నుండి శరీరంలో శ్రమ, నలత కలుగును. ధనము బాగుగా కలసి వచ్చినను, మానసికంగా మాత్రం, స్తిమితం తక్కువగా నుండును. ఉద్యోగ వ్యవహారములన్నియు చక్కగానే ఫలించును. విద్యార్థులకు కార్మిక, కర్షకులకు తలపెట్టిన పనులు నిర్విఘ్నముగా కొనసాగును. ధనలాభం కల్గును.

ఆశ్లేష వారికి ఇంకను చిక్కుల శేషము ఉండి 10 తే. తో పూర్తిగా అవి తొలగిపోవును. ధనలాభము అన్నివిధముల బాగుగా నుండును. స్త్రీలో స్త్రీ అన్యోన్యత, [illegible] వ్యవహారాములలో కలసివచ్చుట జరుగును. అయితే శారీరకముగా శ్రమ హెచ్చుగా నుండును బుద్ధిశక్తితో ఇంతవరకు పరిష్కారం కాని కొన్ని వ్యవహారములను పరిష్కరించు కొనుట జరుగును.

## సింహం (మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

మఖనక్షత్రం వారికి మొదటివారమంతా హెచ్చుగాను, రెండవ వారము నుండి కొంచెము తక్కువగాను చెప్పుటకు వీలు లేనంతగా శారీరక, మానసిక శ్రమ, వ్యథ కలుగును. అనవసరమైన వ్యయప్రయాసలు కలుగును. పెద్దవారలయొక్క స్నేహ సహవాస భాగ్యముచే అతి సునాయాసముగా కార్యములు నెరవేరును. కాని మనస్సు నిరంతరము ఆందోళనతో నుండును.

పుబ్బవారికి భార్యా మూలకముగా, లగ్గరీఖర్చుల మూలముగా, శుభకార్యముల మూలముగా ఖర్చు విపరీతముగా పెరుగును. ధన లాభం కలుగును. చిన్నచిన్న ప్రమాదములు, ఏక్సిడెంట్సు వగైరాల వలన పడుట, గాయములు తగులుట, లేదా వ్రణములు మొదలగు వాని వలన నలతచేసి నిమ్మళించును. మునుపటికన్న ఆదాయం హెచ్చుగా నుండును.

ఉత్తర 1పా. వారికి ఇంతవరకు ఉన్న కొద్దిపాటి చిక్కులు తొలగిపోవును. శుభకార్య ప్రయత్నములు నెరవేరును. ఏదో విధముగా భాగ్యము సమకూడును. అయినను వ్యయము హెచ్చును. భార్యకు అనారోగ్యముచేసి తన్మూలకముగా ధనవ్యయము జరుగును. బంధువులతో ముఖ్యముగా మాతా పితృవర్గము వారితో కొంచెము మాట పట్టింపులు వచ్చును. కొంత మూర్ఖత్వంతో ప్రవర్తించుట జరుగును.

## కన్య (ఉత్తర 2,3,4 పా హస్త, చిత్త 1,2 పా.)

ఉత్తర 2,3,4 పా. కుటుంబంలో కలతలు, నలతలు కలుగును. సమృద్ధిగా ధనము చేతిలో ఉండును. అన్ని వ్యవహారములలో జయము కలుగును. స్థిరరూపంలో భాగ్యవృద్ధి యగును. కుటుంబంలో శుభకార్యములు, సుఖ సంతోషములు, బంధువులు రాకపోకలు మొదలగునవి జరుగును. కాని కోపము, చిరాకు, పట్టుదల మొదలగునవి జరుగును. కాని కోపము, చిరాకు, పట్టుదల మొదలగునవి అధికమగును.

హస్త వారికి మొదటి వారంలో ధనలాభం కలుగును. ఆ ధనలాభం రెండవ వారంలో కూడ కొనసాగును. అయితే భార్యకు శరీరంలో చిన్నచిన్న నలతచేసి నిమ్మళించును. పెద్దల సహాయ సహకారములు లభించును. కాని శని దోషము వలన ఎన్నివిధముల కలిసివచ్చినను, అసంతృప్తి, మనఃఖేదం, త్రిప్పట, అలసట, ఏరోగము లేకుండానే అస్వస్థతగా ఉండుట జరుగును.

చిత్త 1, 2 పా. వారికి 7తే. వరకు బాగుండును. తరువాత శరీరంలో అధిక వేడిమి, తాపము మొదలగునవి కలుగును. ధనమునకు లోపముండదు. అంత సమృద్ధిగా కాకపోయినను, అవసరములకు తగినట్లు ధనము లభించి కార్యములు అనుకూలముగా జరిగిపోవును. మొత్తం మీద శుభాశుభ మిశ్రఫలం కలుగును.

## తుల (చిత్త 3,4 పా. స్వాతి. విశాఖ 1,2,3 పా.)

చిత్త 3, 4 పా. వారికి మనఃఖేదం, అనవసరంగా త్రిప్పటా, అన్నియు ఊరిగి నిష్కారణముగా బాధపడుట, ఏ విషయములోను లోపము లేకపోయినను ఏదో విధమైన అసంతృప్తితో ఎదుటివారి వలన జరగని ఏదో చిన్నవిషయమును గురించి బాధపడుట జరుగును. భార్యకు నలత, లేదా, భార్యతో తరచు వాగ్వాదములు చేయుట జరుగుచుండును.

స్వాతి వారికి అనుకోని విధంగా తటస్థించిన సంఘటనలచే మనోవైకల్యం కలుగును. చుట్టపక్కములు, సోదరీ సోదరవర్గము తప్పనిసరియైన, బంధుమిత్రాదుల ఇండ్లలో జరుగు, శుభకార్యములు, అధికారుల మొగమాటములు, వగైరాల వలన అనేక విధములుగా వ్యయమగుటయే కాక, ఇంకను స్వల్పముగా అప్పటప్పటి ఋణము కూడ చేయుట జరుగును.

విశాఖ 1,2,3 పా. మొదటి వారమంతా అధికశ్రమ, అల్ప ఫలం మిగిలిన 3 వారములు శ్రమకు తగిన ఫలితము కలుగును. వ్యవహార విషయములలో చివరివరకు చిన్నచిన్న ఆటంకములు కలిగినను, జయము కలుగును. బంధు మిత్రాదులతో అనుకూలత కలుగును. శుభకార్యములకు ఆటంకములు జరుగును సంసారంలో చిన్న స్పర్థలు, పొరపొచ్చెములు ఏర్పడును.

## వృశ్చికం (విశాఖ 4 పా. అనూరాధ, జ్యేష్ఠ.)

విశాఖ 4 పా. వారికి శుభాశుభ మిశ్రమఫలం కలుగును. ముఖ్యంగా 16 తే. వరకు మనోవైకల్యం, భార్యకు అనారోగ్యం,

కుటుంబంలో చిన్న చిన్న కలతలు, నలతలు మొదలగునవి జరుగును. ఎన్ని విధములుగా కలసివచ్చినను మనఃఖేదం తప్పదు. సువర్ణాది సంపాదనము, స్థిర, భాగ్య సంపాదనము కూడ కలుగును. అనేక విధాల కలసివచ్చినను, సంతృప్తి సరిగా నుండదు. శరీరశ్రమ హెచ్చుగా నుండును.

అనూరాధ వారికి 16 తే, మొదలు చివరి వరకు అధికశ్రమ కలుగును. అయినను కార్యములందు విజయం కలుగును. భార్యా వర్గము వారితో చిన్నచిన్న అభిప్రాయ భేదములు కలుగును. బంధు మిత్రుల మూలకముగా వ్యయము హెచ్చుగా నుండును. మొత్తంమీద అన్నివర్గములవారికి, అన్ని వృత్తులవారికి మధ్యలో కొన్ని అప్పటప్పటి ఆటంకములు కలిగినను, ఈ నెలంతా లాభదాయకముగానే యుండును.

జ్యేష్ఠ వారికి గతంలో ఉన్నచిక్కులు పూర్తిగా తొలగినట్లే, 11-19 తే. ల మధ్య కొంత మానసికంగా ఖేదం కలుగును. శుభ కార్యముల గురించి వ్యయము జరుగును. అన్నివ్యవహారములు అనగా ఇంతవరకు అపరిష్కృతములుగా ఉన్నవన్నీ ఫలించి జయమును కలిగించును. విద్యార్థి, ఉద్యోగి వర్గములకు, వైద్యులకు, న్యాయ వాదులకు కూడ మంచి అనుకూలంగానే ఉండును. వర్తకులకు, కర్ష కులకు బాగా కలసివచ్చును.

## ధనుస్సు (మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1పా.)

మూల వారికి నెలంతా శరీరంలో నలత, శ్రమ కలుగును. భార్యకు నలత చేయును. అనవసరంగా శ్రమ, త్రిప్పటా మొదలగు నవి జరుగును. ధనవ్యయం హెచ్చుగా జరుగును అనుకొన్న వ్యవ హారములు జరిగినట్లే కనబడి వాయిదా పడుచుండును. పితృసంబంధ మైన బంధువులకు నలత చేయును. ఉద్యోగ వ్యవహారములలో చిన్న చిన్న పేచీలు ఏర్పడును. ఆరోగ్యం సరిగా నుండదు.

పూర్వాషాఢ వారికి శరీరంలో నలతే ఈ నెలంతా కొన సాగును 7తే. నుండి మరింత వ్యవహారపు చిక్కులు కలుగును. ఎంత ధనము వచ్చినను ఖర్చు అగుచుండును. తరచు ప్రయాణములు చేయవలసివచ్చును. శుభకార్యములగురించి శ్రమ, ధనవ్యయం జరు గును. ఆరోగ్యం బాగుండదు.

ఉత్తరాషాఢ 1 పా. వారికి ఇప్పటి వరకున్న చిక్కులు తొలగిపోవును. ఇప్పుడిప్పుడే యోగము, అనుకూలత కలసివచ్చును. కుటుంబంలో సుఖసంతోషాలు హెచ్చును. సంతానసౌఖ్యం కలుగును. అనుకొన్న కార్యక్రమములు ఫలించును. ఉద్యోగులు, విద్యార్థులు, మొదలగు అన్నివర్గములవారికి అన్నివిధముల అనుకూలముగా ఉండును. గతంలో నిరాశ చేసికొన్న వ్యవహారాలు తిరిగి కలసి వచ్చును

## మకరం (ఉత్తరాషాఢ 2,3,4పా. శ్రవణం, ధనిష్ఠ 1,2 పా.)

ఉత్తరాషాఢ 2, 3, 4 పా. గతంలోని చిక్కులన్నీ తొలగి పోవును. స్తంభించిపోయిన వ్యవహార, కార్యము లన్నియు చక్కగా నెరవేరును. కాని అతి చిన్నపనికి కూడ అత్యధికంగా శ్రమపడవలసి వచ్చును. కార్యసిద్ధి జరుగునో, జరుగదో అన్న సందేహము కల్గును. పితృవర్గ బంధువులకు పీడ కలుగును. అన్ని వ్యవహారములలోను విజయం కలుగును. కాని ప్రతి పనిలోను ఏదో ఒక చిన్నచిన్న ఆటంక ములు కలుగుచునే యుండును. అయినను మంచి ఫలితం వచ్చుటవలన శ్రమ అనిపించదు.

శ్రవణం వారికి శ్రమ హెచ్చు. ఫలితం తక్కువ. ధనవ్యయం హెచ్చు. రాజకీయ వ్యవహారములలో ధనము ఖర్చగుటయేతప్ప, అనుకూలత ఉండదు. విద్యార్థులకు, ఉద్యోగులకు సామాన్యముగా ఉండును. సోదరీసోదరవర్గ మూలకముగా కొంతవరకు సహాయ సహ కారములు లభించును. పెద్దవారితో ఎంతమంచి సన్నిహిత సంబంధము ఉన్నను, ఫలితం మాత్రం తక్కువగానే యుండును. రాజకీయవాదు లను నమ్మి చివరకు నిరాశ మిగుల్చుకొనుట జరుగును. శనికి జపం చేయుట మంచిది.

ధనిష్ఠ 1,2పా. వారికి మానసికంగా వ్యథ హెచ్చు. త్రిప్పట, నలత, ధనవ్యయం, బంధు విరోధము కలుగును. అన్నిరంగముల యందు, అన్నివర్గములవారికి అకారణముగా శత్రువులు ఏర్పడుదురు. అయినను వారివలన తాత్కాలికశ్రమయే తప్ప నష్టము కలుగదు. కాని మనస్సునకు పిరికితనము కలుగుచుండును.

## కుంభం (ధనిష్ఠ 3, 4పా.శతభిషం, పూర్వాభాద్ర 1, 2, 3పా)

ధనిష్ఠ 3, 4 పా. వారికి భార్యకు అనారోగ్యం, తరచు వాగ్వాదములు, ఇతరులతో మాట పట్టుదలలు వచ్చును. బంధు సంతాన సౌఖ్యం, సంసార కుటుంబసౌఖ్యం బాగుగానుండును అవస రములకు తగినట్లుగా ధనము సర్దుబాటు జరిగి పనులు గడచిపోవు చుండును. శ్రమపడినా అంతగా బాధ అనిపించదు.

శతభిషం వారికి బంధు విరోధం, ధనవ్యయం, సంతానముతో, బంధువులతో, మాతృవర్గ బంధువులతో కూడ వాగ్వాదములు, అభి ప్రాయ భేదములు కలుగును. ధనము ఉండియు, అది ఇతరులచేతికి ఇచ్చి ఉండుటవలన అవసరములకు సర్దుబాటుకాక త్రొటుపాటు పడ వలసివచ్చును.

పూర్వాభాద్ర 1,2,3 పా. వారికి నెలంతా డాబుదర్పములతో, లగ్నరీ ఖర్చులతో వచ్చినదంతా వ్యయమగుట జరుగును. బంధువుల నిమిత్తం మొదటి, రెండువారములలో విపరీతముగా ఖర్చుజరిగి, నెల మధ్యలో కొంత ఇబ్బంది పడవలసి వచ్చును. ఔదార్యమునకు, గొప్ప లకు, పదుగురిలో మెప్పులకు తలకుమించిన పరుగులు వీయి బాధ పడుట జరుగును. మిగిలిన అన్నివిషయములు అనుకూలముగా నుండును.

## మీనం (పూర్వాభాద్ర 4పా. ఉత్తరాభాద్ర, రేవతి)

పూర్వాభాద్ర 4పా. వారికి ముఖ్యంగా వర్తకులకు, వ్యవసాయ దార్లకు, విద్యార్థులకు ఈనెల 7తే. నుండి యోగదాయకమైన కాలము. నెలమధ్యలో కుటుంబంలో చినచిన్న కలతలు కలిగి తొలగిపోవును. నెలంతా మంచి అనుకూలముగా ఉండును. ఉద్యోగులకు, రాజకీయ వాదులకు ఉన్నతమైన పదవికలుగును. విద్యార్థులకు శ్రమలేకుండా, ఉన్నత విద్యావకాశం కలుగును.

ఉత్తరాభాద్ర వారికి నెలమధ్యలో అనగా 11-20 తే. ల మధ్య కొన్ని చిక్కులు కలిగినను, ఉద్యోగ - వ్యవహార-వ్యాపారాదు లతో జయమూ విద్యార్థులకు ఉన్నత విద్యావకాశము, కలుగును. కాని శరీరములో అధిక శ్రమవలన అధిక వేడిమి హెచ్చి, ఏదోచిన్న అనారోగ్యముతో బాధపడుచున్నట్లు అనిపించును. కాని వ్యవహారము లన్నింటియందును, అన్నివర్గములవారికిని విజయం, ఉత్సాహంకల్గను. కాని మూర్ఖత్వం, పట్టుదల హెచ్చుగా నుండును. అహంకారము పెరుగును.

రేవతి వారికి అన్ని వ్యవహారములు సానుకూలముగానుండును. విద్యార్థులు, ఉద్యోగులు, వర్తకులు, వ్యవసాయదారులు, రాజకీయ వాదులు మొదలగు వారందరికిని అన్నివిధముల అనుకూలముగా ఉండును. దైవభక్తి, పరమార్థచింతనము హెచ్చును. సత్సాంగత్యము, పెద్దలతో గోష్ఠి, పుణ్య ధర్మకార్యములందు పాల్గొనుట, వివాహాది శుభకార్యములలో పాల్గొనుట, అందరిచేత గౌరవమర్యాదలు పొందుట మొదలగునవి జరుగును. నెలమధ్యలో ఏవో చిన్నచిన్న ఒడుదొడుకులు వచ్చినను, అవి అంతగా చెప్పుకొనదగినవి కావు. మొత్తం మీద బాగానే యుండును.

సిద్ధాంతి: నిష్ఠల వేంకట సత్యసుబ్రహ్మణ్యం



డా॥ శివలెంక ప్రకాశరావు

# భావకవితా యుగంలో శ్రీ కొనకళ్ల

ఆధునిక కవులలో నండూరి వారిని తలపించేవిధంగా కవిత అల్లిన భావకవి శ్రీ కొనకళ్ళ. 'సున్నితమైన ప్రకృతి' గల వెంకటరత్నంగారి హృదయ వీణాతంత్రులు స్వల్ప విషయానికైనా స్పందిస్తాయి. అప్పుడు వెలువడే నాదంనుంచి ఒక చక్కని గేయం లయబద్ధంగా సృజించబడుతుంది. పొందిన ప్రతి అనుభూతినీ ఒక 'కవిత్వపు మూస'లో పోతపోయగల ప్రతిభాశాలి వీరు.

వీరి కలంనుంచి వెలువడిన కావ్యాలు బంగారిమామ పాటలు (1960) ప్రొద్దు తిరుగుడుపూలు (వసంతం-వెలాటి) వీటిలో ఉన్న వస్తువునుబట్టి (1) ప్రణయం (2) ప్రకృతి (3) దేశభక్తి (4) మానవత (5) స్తుతి (6) స్మృతి అనే విభాగాలు చేసి వెంకటరత్నంగారి కవిత్వాన్ని పరిశీలించవచ్చు.

ప్రణయం :

వెంకటరత్నంగారు రచించిన 'బంగారిమామ పాటలు' ఈ కోవకు చెందినవే. నండూరివారి 'ఎంకిపాటల'లోలాగా జానపద శృంగారంలోని హొయలు ఒలికిస్తాయి ఇవి.

'బంగారిమామ పాటల'లోని నాయికీ నాయకులైన బంగారిమామా, కోడలుపిల్లా అనే రెండు పాత్రలూ చాలా అపురూపంగా, గ్రామ వాతావరణానికి అనువైన తీరులో తీర్చిదిద్దాడు కవి.

'దారంట మగటీవి'ని ప్రకటించే 'పదునుగుండె' కలవాడుగా, 'గుండెలోతులు దొలిచే గోరువెచ్చటి వాలుకళ్లూ' 'మాటలో మంత్ర' శక్తీ, 'పాట'లో సమ్మోహనశక్తీ ఉన్న యువకుడుగా, ఏ 'చీరకు పయటింపో', ఏ 'రైకకు గడిసొంపో' చెప్పి అందాలను తూచేటి పసందు చూపుగల సరస హృదయుడిగా బంగారిమామ రూపొందించబడ్డాడు.

అలాగే 'కన్నెలేడి'గా, 'వన్నెలాడి'గా, 'చిన్నిరాణి'గా 'చిటిమల్లెపూవు'గా, 'అందాలదీవి'గా, 'సుకుమారి'గా, కోడలుపిల్ల పేర్కొనబడింది. 'కదిలే పెదిమలతో కలలు వ్రేల్చి కళ్ళకు పని' కలిపించీ, 'మాటల తేనియ తేటలతోనే మైమరపులు' కలిగించీ, 'కొమ్మతేనె ఆల్లార్చిన పాటకు కోయిల కొధనులు మూగబోయే'ట్లు చేసి ఒప్పించగల ధీరగా ఆమె చెప్పబడింది.

వీరిద్దరూ పరస్పరం ప్రేమించుకున్నారు. ఏ గంటకు ఎక్కడకు వెళ్ళడానికీ, కొండ కోన వెతికి ప్రేయసి కోరిన మొగలిపొత్తి తేవడానికీ, ఆమె "ఊ" అంటే 'ఒక్క సిటికలోన' ఏరు దాటించడానికీ సిద్ధమయాడు బంగారిమామ. 'తుళ్లింతల ఏటినీటి తుంపరైన సోకకుండా, తన కవుగిటలోని ఆమె 'సిగపూగమగమలైనా' చెదరనీకుండా అస్తారపదంగా చూచుకున్నాడు ప్రేయసిని. 'చీకటి వెలుగుల సందున' 'గుట్టుచప్పుడుగ తన చిన్నారి తనను చేరాలనీ, 'చిన్నిముద్దు ఒకటి' ఇవ్వాలనీ అతడి కోరిక. ఒంటిగా ప్రేయసివెంట ఒక్క గడియ ఉండే చాలని అతడి అభిప్రాయం. 'మనసున్నచోట మాటలు' అక్కరలేదనీ, 'నగ వుంచితె ఒడలి మెరుగు సగము తరిగిపోతుందనీ అతడి సిద్ధాంతం. 'మనిషి పుటక మట్టిలోన మానసుకొన్న అమాయకుడిగా ఉన్న బంగారమామ ప్రేయసి పిలుపు చెవిని బడడంతోటే 'అందగాడ్నని' అతిశయించి 'గాలినచుక్క'గా, 'దివిలోకపు వరాలముద్ద'గా వున్న ఆమె రూపం తన 'కటికి చేతుల్లో' కసి గందుతుందనుకొన్న ఒక ప్రణయారాధకుడిగా పరిణామం చెందినట్లు తీర్చిదిద్దడంలో కవి తన ప్రతిభను చాటుకున్నాడు.

ఈ సందర్భంలో—

> ఏ తీయలోకాలు ఏలాలొ నీ చూపు
> తెప్పలా బూదేవి తేలిపోతావి!
> కాలాడకే గంగ కళ్ళప్పగించేను
> సూడ కళ్లే నీయి సోజ్ఞాల మారి....
> నీ వెన్న మనసేను నీ కన్ను షలిచేను
> నీ సూపులో సోకె నా రూపురేక'

(ఊహపై ఊహ - బం.మా.పా - పు.61)

ఇత్యాదిగా కల బంగారిమామ ప్రేమావేశం పేర్కొనతగ్గది.

అలాగే ఆ తడి 'కాలిధూళిగ మారి రాలిపోయినా', 'వాలు కన్నులలో కాలిపోయినా', 'కవుగిట్లో కడసారి కన్ను మూసినా', ఆఖరికి అతడి పాట వింటూ ప్రాణాలు విడిచినా' తన జన్మ చరితార్థమవుతుందని భావించింది కోడలుపిల్ల. అంతేకాదు. పంటకాలవ ప్రక్క జంటగా నిలబడి నీడల్లా, తమ 'ఈడు జోడు' చూచుకోవాలి. 'వెన్నెల

సొలపూ' 'తెమ్మెరల పలపూ' రాత్రి తమ 'సుఖకేళి'లో రంగరించాలి. ఎంత దూరాన ఉన్నా ఎప్పటికీ తమ 'పూసు' 'పంతెనలు' కట్టాలి. 'ఏటి పడవ సరంగు పాట గిరికీలలో' తమ సొదలు కలబోసుకోవాలి. 'గోదారి గట్టంట' మసక వెన్నెల లింకు ఇసక తిన్నెలకేసి ఇద్దరూ కలిసిపోవాలి. తమ చిలిపి పొదాల ఛెదరిపోయే తెరటాలు 'జంట చూపుల్ల మరులు గిలకొట్టా'లి. 'రాతిరివేళ' ఏటిగట్ల ఇసకలలో, మామిడితోపుల్లో, మల్లెపందిరులున్న చోటుల్లో 'వయాళిగ' ప్రియుడితో కలిసి తిరగాలి. ఇవీ ఆమె ఉరకలేసే కోరికలు.

అయితే ఈ యువతీ యువకుల ప్రేమవ్యవహారమంతా రహస్యంగానే జరిగినట్లు చాలాచోట్ల స్పష్టపరచాడు కవి. మేనమామతో, బావతో సరసాలాడడం, ఇష్టమయితే వివాహమాడడం తెలుగుగడ్డమీద సంప్రదాయబద్ధమే. "మామా" అని స్త్రీలు వ్యవహరించడం కూడా కద్దు. కాబట్టి ఈ 'కోడలుపిల్ల'లో అభిసారికా లక్షణం గోచరిస్తుంది.

అయితే 'పనలు కట్టి యెత్తి పలకరిస్తే'నూ, 'చెరుకుతోట మలుపుకాడ చిటికవేసి నవ్వితే'నూ, 'మోటబావి వెనక మోటు సరస మాడితే'నూ ఒక ఖండిత నాయికలా కోడలిపిల్ల తన మామను కసిరి తిట్టింది, విసిరికొట్టింది. అది 'సలుగురిలో సిగ్గు'వల్ల తప్ప అతడిపై ప్రేమ లేక కాదట.

ఈ సందర్భంలో 'మొక్కజొన్న తోటలో ముసిరిన సీకట్లలో మంచెకాడ' కలుసుకొమ్మనీ, 'జాతర లోపల పిల్లామేకా సరదాలో సతమత'మయే మాపటివేళ విందుకు రమ్మనీ ఆమె పిలవడం, 'గొడ్డు గోద మళ్లేసే కుర్రకుంకలకూ', కలుపుతీతలయి మళ్లే కన్నెపడుచులకూ,' 'భూకామందు'కూ కంటపడొద్దని హెచ్చరించడం, అనుకోకుండా మామ వచ్చినప్పుడు ఇంట్లో ఎవరూ లేరనీ, ఎవరో వస్తారనీ 'మనసు కింద'మీదవడం, 'చిగురాకు వెనకాల మల్లె' పువ్వు తొంగి చూస్తున్నట్లూ, 'చూరుక్రిందుగ వాలి చుక్కల్లు గుమికూడి' తమను గూర్చే గుసగుసలాడుతున్నట్లూ సందేహించడం, తమ 'సుతిమెత్తని సహవాసము'ను లోకం చూడలేక 'తప్పులెంచి కళ్ళల్లో నిప్పులోసుకొన్నట్లు' కొండదేవతకు కోడలిపిల్ల మొరపెట్టుకోవడం గమనించ తగ్గవి. ఇవన్నీ ఆ ప్రేయసీ ప్రియుల రహస్యప్రవర్తననే చాటి చెపుతాయి.

అయితేనేం? వారి ప్రణయానికి ఏ లోటూ లేదు. తన 'పెదిమల కౌసలో కదిలే కలలకు పొంగే వలపుల రంగేస్తూ' అతడి హృదయంలో 'అడియాసలు పరచి' అలంకరించగలదు ఆమె. అతడి కోసం కోయిలయై, మామిడి కొమ్మలలో వొదిగుంటుంది 'నెరె విచ్చిన గుండెలపాట' పాడుతుంది. 'అలసి సొలసి దస్సిపోయిన' మామకు 'చిలకలు కొరకని' సీమరేగు పండ్లేలిచి ఒడినిండా తెచ్చిపెడుతుంది. తాను ఎంత అందగత్తె అయినా, మామ 'మెచ్చని కళనేర'మనీ, 'అపచార'మనీ ఆమె నమ్మకం. 'మోహపడిన తన రాజా కనులలో మోజు చెడిన బ్రతుకే' నిరర్థకమని ఆమె విశ్వాసం. అందుకే 'కన్నులలోనా, కలలోనా' మామ 'కలరూపే అవరించుకొన్న' కోడలు పిల్లకు రాత్రింబగళ్ళు అతడు రాలేదని 'గుండెలలో దిగులు' వస్తాదని విన్న తరవాత పదిరోజులైనా ఆమె మస్తాబు తెమలదు. 'అడవికోన' గాలించినా సిగలోకి ఒక్క 'అందమైన పువ్వు' దొరకదు ఆమెకు.

ఈ విషయాలన్నీ కోడలుపిల్ల అరమరికలు లేని ప్రణయాన్ని పట్టి చూపుతాయి.

అందుకే 'మనిషి మసలని యేటి మళుపులో మాటా మంతీ లేని మౌనాలు' వహించి, 'కాటుకల చీకట్ల'లో భయమేసినా, 'దవుదవ్వుకు పోతూ మామ దరికేసి రాకపోవడం ఆమెకు నచ్చలేదు. 'ఏమో తెలియని తరితీపుల ఉయ్యేలలూపి', 'మరపురాని తొలిరేయి అలజడిని మనసు తీరలేద'ని మామ చెప్పడం బాగనిపించలేదు.

ఈ సందర్భంలో 'రాతిరి వేళకురా, మళ్ళీ ఒక రాజ్యమేలుదువుగానీ, 'నలిగినపూవుల తొలి సువాసనల నాజెమెరుంగని నంగనాచివా?' అని ఆమె అనడంలో క్రమక్రమంగా వారిద్దరి ప్రణయం అమలిన స్థితిని దాటినట్లు ధ్వనిస్తుంది.

అందుకే 'ఏడతెళ్ళిసగాని కొండపెనొందురుడు' వెంటబడ్డట్లూ, పంటకాలువ ఆగినట్లూ, గట్టు కదిలినట్లూ, 'కొండ కొమ్ముూదేటి కోటి మబ్బులలో' తన మామ ముక్కూ, రూపు తీరూ కనబడినట్లూ అనుభూతులను పొందింది కోడలుపిల్ల.

అయితే ఏ కారణంవల్లనో 'కలకలేని వలపులోని మెళుకువ తెరిగిన' మామ కోడలుపిల్లపై అలిగి, పంతంపట్టి దూరమయాడు. దాంతో ఆమె కుమిలిపోయింది. తన 'రాత నలుగురిలో నవ్వులపాలు' కావడానికి వగచింది. తమ ప్రణయ కలహాలను తీర్చే దిక్కులేదని వాపోయింది. 'నివరమాను నీడల'లో 'చెదరిన వెన్నెలరేకుల పదునెక్కిన చురకత్తులు పట్టి' ఎవరో జళిపించినట్లు భయపడింది.

ఆ సమయంలోనే—

సరస నీవు లేని బతుకు
సందరమనిపిస్తదోయి'

(ఒంటరి పయనం – అదే-పు.57)

ఇత్యాదిగా విరహార్తిని ప్రకటించడం అకలంకమైన ఆమె ప్రేమకు నిదర్శనం.

అంతేకాదు. 'ముసురేసిన' సమయంలోని 'మబ్బు తెరల మసకలలో – మంచుపొగల మెలికలలో' ఆమె మనస్సు చిక్కుపడి 'మనేద' కుదిపేసింది. అతడు తిరిగిన 'చెలకలవంకే గరాళం

నురుగులు' గ్రక్కింది. 'కోవెల చిరుగంటలు' దుర్వార్తలు విని పించాయి. 'ఏటి మలుపులో ధనుసల్లే తోట ఒడలు విరిచినచోట' ఉన్న మెరుపునకు వారి సరసం నవ్వులాట అంది.

ఈ సందర్భంలో 'మంద విడిన తువ్వాయి'తో కోడలుపిల్లను ఉపమిస్తూ, కొండ లోయలో చిక్కిన నీడలు గుంపులుగా నడుస్తున్నప్పుడు ఆమె గుండె లోతులో నల్లని పరపడి రహస్యంగా రాసినట్లయిందనీ, ఎండుటాకులో పడిన ఒక్క చినుకు కూడా కోరికలు గుదిగుచ్చుకొన్న హారాన్ని తెంపినట్లయిందనీ, చిడీలపై ఏదో సిగ పూవు రాలినట్లూ, కడవనీళ్ల బుజాన కరుడు గట్టినట్లూ భ్రమ కలిగిందని చెప్పి విరహవేదనను మిన్నుముట్టేటట్లు చేశాడు కవి.

అంతేకాదు 'చందమామ'తో తన మామకు ప్రేమరాయబారం కూడా ఆమె పంపినట్లు చిత్రీకరించారు కొనకళ్ళవారు. ఆ సందర్భంలో ఏటిగట్టు ఇసకలలో వెన్నెల దుప్పటి పరచి' తన రాజును రమ్మని ఆహ్వానించుమనీ, చల్లనిదొర' అయితే తమ జంటను కలిపిపొమ్మనీ నెలరాజును అర్థిస్తుంది ఆమె.

కోడలుపిల్ల మొరపెట్టుకోవడం ఊరకే పోయినట్లు లేదు. మళ్ళీ మామ తిరిగివచ్చాడు. అందుకే ఎల ఏటుదాఏట ఎద్దు తమ 'సంసారము సూళయినా' సర్దుకుపోవాలని అనగల్గుతుంది ఆమె. మామ తోలే బండెక్కిపోతూ 'గడ్డివాము నీడల్లో కలలు ముసిరి కవ్వించి'నా, 'పొదమాటున కోకిలమ్మ పదమేదో అల్లుతుంటే మూగసూపుగా నడుమనే ఆగిపోదా' మనుకోవడం, ఎద్దులజత మెడగంటలలో, బండి కుదుపులలో సిగ్గిడిసిన మనసులెవో మొగ్గ తొడగడంలాంటి లక్షణాలు చెప్పి సంసారంలోని అనురాగాన్ని చవిచూపించాడు కవి.

అంతేకాదు. 'చంకలో పసివాని కన్నుల ఝల్లుమనిపించేటి మాటల వీరకతలే తెల్పిపొమ్మ'నీ, నాటి చేవా నాటి జీవమూ తమ 'నేటి బైరాగి బ్రతుకున ఊదా'లనీ, మామను ఆమె అర్థించడంలో వారి సంసారవృక్షం కొన్ని ఫలాలను కూడా కాసిందనీ, క్రమంగా జీవితాన బరువు బాధ్యతలు పెరిగినాయనీ స్ఫురిస్తుంది.

ఆ విషమ పరిస్థితులే వారి పట్నవాస ప్రవాసానికీ, ఎన్నో కష్టాలకూ కారణమయాయి.

అయితేనేం? 'సందరాలుదాటి'నా మామ సరసన ఉంటే చాలు కోడలుపిల్లకు ఎంతో ధైర్యం. తన వన్నెకాడు 'గడప ముంగిట్లో' అడుగు పెడితే 'ముగ్గేసి'నట్లే అని ఆమె భావం.

అందుకే

ఏ రాజు గెలిచేనో-ఎందుకీ సొద నాకు
ఏ రాజులేమైతే-ఎందుకో యీ మామ
నా రాజె నాకేసి నడచిరా-కూడబెట్టిన వయసు
గుట్టు చెదరని మనస
నీ కోసమేనోయి-నిరుకుగా ఓ మామ
నిలుపుకొన్నానోయి నీకిగా'

(పాట విసురు - అదే - పు. 70)

అని అంటుంది ఆమె చిట్టచివరి పాటలో. అదే వారిద్దరి నిష్కల్మషమైన ప్రణయానికి వేసిన రాచబాట!

ఈ విధంగా కొనకళ్ళవారి ప్రణయ కవిత్వంలో గ్రామ జీవనంతో తొణికిసలాడే ప్రేమ తీరుతెన్నులు ద్యోతకమవుతాయి.

## ప్రకృతి

ముఖ్యంగా 'బంగారిమామ పాటలు' సహజసిద్ధమైన పల్లెటూరి వాతావరణాన్ని ప్రతిబింబిస్తాయి. నది గట్టూ, పంటకాలువలూ, నీళ్ళ తూరలూ, మోటబావులూ, ఏటి పడవలూ, బల్లకట్లూ, గుబురైన జొన్నచేలూ, పుగాకు, కొబ్బరి, చెరుకు, నిమ్మ, సరుకు మొదలైన తోటలూ, దొండపందిరులూ, మొగలిపొత్తులూ, అవిసెపూలూ, బంతి పూలూ, తీగమల్లెలూ, గులాబిఅంట్లూ, పొంచిచూసే గుమ్మడిపూలూ, విరబారిన జొన్నపొట్టలూ, కాలికి తగిలే తమలపాకు తీగెలూ, మసక వెన్నెల లింకు ఇసకతిన్నెలూ, కారుమబ్బుల వెన్కనుంచి ఓరచూపులు చూసే చంద్రుడూ, గుమికూడిన నక్షత్రాలూ, సంధ్యపొద్దులూ, పైరగాలులూ, కోయిలకొదమలూ, కోవెల చిరుగంటలూ, ఎద్దులబళ్లూ, గడ్డివాములూ, గొబ్బెమ్మలూ, పొడుపుకతలూ, ఏటిపాటలూ ఇత్యాదులు పేర్కొన్నాడు కవి. వీటన్నింటినీ ఒకేచోట పట్టికలో చేర్చకుండా కథాకథనంలో మిళితమొనర్చడంలో కవి చూపిన నేర్పు అసాధారణం.

ఉదాహరణకు 'మొక్కజొన్న తోటలో' మంచెకాడ తనను కలుసుకొమ్మని కోడలుపిల్ల బంగారిమామతో చెప్పే సందర్భంలో-

సుక్కలన్ని కొండమీద - సోకు చేసుకునేవేళ
పంటచేది పరిమడిలో - పకపక నవ్వేవేళ
సల్లగాలి తోటకంత - సక్కలగిల్లి పెట్టువేళ....'

(పు. 18)

ఇత్యాదిగా గల పాదాలు అపరసంధ్యా కాలాన్ని ధ్వనిస్తున్నాయి. ఇక్కడ ఒక్కొక్క సన్నివేశం ఒక్కొక్క భావచిత్రంగా మలచబడింది.

అలాగే 'చీకటి మిణుగురు జోతుల చిటిలి చిల్లులడక'మునుపూ, 'సుద్దులరాగాలు చెవుల నిద్దుర తీయక'మునుపూ, 'ఆకాశపు టొడిని తోట ఆవలింతగొనక మునుపూ' తనను కలుసుకొమ్మనడంలో కూడా సంధ్యాకాలమే ధ్వనిస్తుంది.

అదేవిధంగా 'గోదారి గట్టంట' అనేపాటలో

వానలో మెరుగుతూంట్ - పోకలై ఉగటార
బెదరి కొబ్బరితోట - తేలైగ రమ్మంది' (పు. 85)

ఇత్యాది పాదాలు ప్రకృతికి మానవతను ఆరోపించడాన్ని ప్రకటిస్తాయి.

అలాగే—

'మిసమిసల్ చిమ్మేటి ఖిరపతోటల నీలు
కాటుకల చీకటుల కరగిపొయ్యేను' (పు 29)
'ఏటి మళుపులో వాలే ఇసకలపైపయిసోలే
ఎన్నెల సూడోలే....' (పు 37)
'పామల్లె నీ పైట పాకి వస్తా వుంటె
మలివెచ్చగా ఊది మలుపు కొంతాగాలి
ఏటి పిల్లంగోడు మీటుకొంటది చూడు' (పు 58)
'మబ్బంచుల గుర్రమెక్కి మహపసందు రాజతీవి
మంచుతెరల వల్లెవాటు మాటికి సవిరించుకొంట'
(పు 58)

ఇత్యాదులు ప్రతిభావంతమైన ప్రకృతి చిత్రీకరణకు ఉదాహరణలు.

అదేవిధంగా 'మరో వసంతం' అనే కవితలో 'అప్సరవోలిక నవతరించినది' ఇత్యాదిగా చెప్పడం పేర్కొనతగింది (ప్రతిభ-అక్టో-1940-జన. 1941 - పు 89)

## దేశభక్తి

వెంకటరత్నంగారు రచించిన 'ప్రొద్దు తిరుగుడు పూలు' అనే సంపుటంలో ఎక్కువగా దేశభక్తి కవిత్వమే ఉంది. 'విచిత్రగతి శీలమైన కాలమనే ప్రొద్దుతో సముద్విగ్నములైన కదుష్ణభావప్రసూనముల సమాహారమే ఈ కృతి. (పరిచయం-బొడ్డు బాపిరాజు-పు. 4) కొనకళ్ళవారి హృదిలో ఉవ్వెత్తుగా పైకి లేచిన దేశభక్తియుతమైన భావాలు గేయరూపం పొందాయి. 'కర్మభూమిలో జననము నాదని ఖండాంతరముల నిలుమన్నా' (పు 20-21) అనే మానసిక తత్త్వం వీరిది. భరతభూమి అస్వతంత్రతతో క్రుగ్గిపోడానికి వీరి మనస్సు విలవిలలాడిపోయింది. ఆ అనుభూతినే రెండో ప్రపంచయుద్ధంనుంచి అస్వతంత్ర భారతానికి తిరిగివచ్చిన సిపాయి ముఖంగా వినిపించాడు కవి. రెండు ప్రపంచయుద్ధాలలో కరిగిపోయిన భరత సంపద గూర్చి విచారించడమూ (పు 8-12) స్వాతంత్ర్య సమరంలో విజయం లభిస్తుందా లేదా అని సందేహించడమూ (పు 13-15) ఇక్కడ ద్యోతకమవుతాయి. 'మానధనులకు స్వేచ్ఛ మధుర'(పు 16-17) మని కొనకళ్ళవారి అభిప్రాయం.

ఈ సందర్భంలో—

'స్వరాజ్యమంటే స్వర్గంలా ఈ
వరాలపంటకు దొరలంటా' (పు 38)

ఇత్యాదిగా అంటూ 'స్వతంత్ర నృత్యం' చేయడం పేర్కొనాలి.

'స్వార్థపరత రక్తపు లోతులతో వేదుదన్ని సెలఘీయనిచోటికి రాజదండ సంచాలనల్ దేసల రాజసములు వెల్గిగక్కని చోటికి' (పు 39-40) పోయి ఆ స్వర్గధామంలో హాయిగా నివసించాలని కొనకళ్ళవారి ఆకాంక్ష. 'నాది' అనే నినాదం విడిచిపెట్టి 'మనది' అనే విశాలభావం ఏర్పరచుకోవాలనేది వారి ప్రబోధం (పు 41) ఒళ్ళు పెంచిన గడ్డమీదే ఒరిగిపోవాలనేది వారి ధ్యేయం.

అలాగే 'ఆంధ్ర రాష్ట్రోద్యమం' సందర్భంగా

లే లే నిద్దుర తెలుంగుజోదా
లేవోయి తెల్వారాలేదా!

అడుగడుగున విజ్ఞాన శౌర్యములు
ఆరబోసిన తెలంగాణాలో
పిరికిపాలు రక్తనాళములలో
చొరబారేనా? జోల పాడేనా?' (పు 18)

ఇత్యాదిగా చెప్పిన పాదాలు కొనకళ్ళవారి మాతృదేశభక్తికి తార్కాణాలు.

## మానవత

స్త్రీ అంటే అపరిమితమైన గౌరవం కొనకళ్ళవారికి. 'ఏ జాతి చైతన్యరేఖ' ఆమె చేయి మలుస్తుందో ఆ జాతి 'సంపత్సువాసనలు' వెదజల్లుతూ 'కాంతిచ్ఛాయ అలముకొంటుం'దని వారి అభిప్రాయం. అందుకే 'అవిద్య, అజ్ఞానం ఘనీభవించిన బ్రతుకులలో పురుషజాతి మెడకి గుదిబండగా' (పు 84-85) నిలిచిన స్త్రీమూర్తిని గాఢసుషుప్తి నుంచి మేలుకొల్పారు వారు.

అలాగే 'బంగారిమామ పాటలు'లో పల్లెపట్టులను వీడి పట్నవాసానికి ఎగబ్రాకేవాళ్ళను విమర్శిస్తూ అక్కడ 'తొడిమసున్న జంట పూలు దూసినట్టులయిపోతా'మనీ(పు74) పట్నవాసపు కుళ్ళువీధులలో 'కల్లాకపటాల'తో పట్టెడన్నం కోసం ఊరేగాలనీ (పు 75) మామ ముఖంగా అంటాడు కవి.

ఇందులోని 'రోడ్డురోలరు' అనే పాట కొనకళ్ళవారి మానవతకు ముఖ్యోదాహరణ

అందులో—

'రోల్సురాయి మోటార్ల షికార్లకు కుదుపొచ్చిందట
పూలపానుపల్లె తోవ పొడుగున మలపాలంట....
మారువాడీ అప్పుకంటె, మాయదారి బ్రతుకుకంటె
బరువా ఇంతోటి పెద్ద బండరాయి మామయ్యా?...
మర్రిసెట్టు ఊడనీడ, మడిసి పురుగులేనికాడ
సనుబాలకు కక్కటిల్లి సంటోడేడుస్తుండడు.' (పు78-79)

ఇత్యాది పాదాలు పేర్కొనతగ్గవి.

అలాగే 'రాచపగ' అనే పాటలో

కుమిలిపోయే బ్రతుకు కుళ్ళబొడిచే తిట్లు
దిగమింగమంటావు తగవాడకంటావు
నా చేతిమీదుగా నడిచిపోయిన సిరులు
ననె వెక్కిరించితే నన్ను కాదనుకోనా?...
కుతికకంటా తిన్న గొప్పోరి పాదాల
రాదారి మన బ్రతుకు లేదారి మనకింక?
కూరుచున్నా దొరకు కుప్పలందించాల!
తిరిగి తిరిగీ మనకు తిప్పలేనా కొసకు?....' (పు 80)

ఇత్యాదిగా 'బంగారిమామ' అనడంలో కూడా కొనకళ్ళవారికి కూలీ నాలీ చేసుకునే అభాగ్యులమీద గల మానవతాదృక్పథం స్ఫురిస్తుంది.

అంతేకాదు. 'రంభా రతికేళీ పసందు'నూ, 'రణవీర స్వర్గాన్ని' సిపాయికి ఆశపెట్టి 'దేశభక్తి' అనే పరదాలలో 'కీర్తిమెరుపు'ను ఎరగా చూపించి, ఆతడి 'కళ్ళకు గంతలు'కట్టి, చెవులకు 'గడియలు' వేసి అనాదిగా మభ్యపెట్టే పురాణాలను, విమర్శిస్తూ 'కీర్తిలతానుమాళి' మనకూ, 'పేరులేని సమాధి' ఆతడికీ దక్కడానికి వాపోయాడు కవి (సిపాయి - మణిమకుటము - పు 218)

స్తుతి :

సిపాయికి లోకంలో గల స్థానాన్ని వివరిస్తూ
'నీ చిందిన నెత్తురుబాట - రారాజుల నవ్వులతోట
నీ త్రెళ్ళిన గుక్కెడు ప్రాణం - రాజ్యాంగపు తొలిసోపానం
నీ అస్థులు విస్మృతిపాలై - యుగసంధుల వంతెనలై నై' (అదే)

ఇత్యాదిగా స్తుతిస్తాడు కవి.

స్మృతి :

గాంధీజీ మృతి చెందిన సందర్భంలో 'జాతిమతాల కతీతమైన ఒక జ్యోతి మాయమై సురిగినచోట, మతము మరచి 'మానవులమన్న నుడి స్మృతిపథాన గడియయేని నిల్పుకొని' (సౌధ్ధ-తి.పూ. పు౮౯) కన్నీరు నింపుదామని శ్రద్ధాంజలి ఘటించాడు కవి.

అలాగే పటేలు మరణించిన సమయంలో 'ఇంక జవహరు మనకు రక్ష ఎవర'ని వాపోయాడు (అదే పు. 88)

ఈ విధంగా వివిధమైన తీరుతెన్నులలో తన కవితాధారను ప్రసరింపజేశారు శ్రీ కొనకళ్ళ. తెలుగు నుడికారపు సొంపు వీరి కవితా సుమానికి సహజ సుగంధం. శబ్దప్రయోగంలో, అర్థస్ఫూర్తిని సమ కూర్చడంలో, భావావేశాన్ని ప్రకటించడంలో, ప్రకృతి పరిశీలన నైశిత్యాన్ని చూపడంలో వీరు అందెవేసిన చేయి. వివిధగతుల్లో లయ బద్ధంగా గేయచ్ఛందాన్ని రుచి చూపించడంలో వీరు సిద్ధహస్తులు. వీరి 'బంగారిమామ పాటలు' కవికన్నా ఎక్కువ ప్రసిద్ధి గనడం' ఆశ్చర్యం.

చలంగారన్నట్లు 'ఇవి ఎంకిపాటల అనుకరణం కావు. ఎంకి పాటలనేవి లేకపోయినా ఇవి తెలుగు ప్రపంచంలోకి రావడం ఆగేది కాదు. కొన్ని కొన్ని పాదాల్లో ఎంకిపాటల్ని మించిన లయ-విరుపులు, శబ్దంలో సంగీతం, ఎక్కడనించో అపురూపపు పుష్పాల్ని వీరి తెచ్చి నట్లు ఆ మాటలు, మాటతో మాట ఐక్యం-అంతా ఒక గొప్ప అపు రూపమైన, చాలా అందమైన కవిత్వపు పటం.' (పరితోషణ-పు.౬)

'ఎంకి పాటలూ, 'బంగారిమామ పాటలూ' రెంటిలోనూ స్త్రీ ఆధిక్యతయే ప్రకటించడం గమనించాలి. అయితే నండూరివారి 'క్రొత్త పాటలు'లో ఉన్న భాషాపాటవం, భావచిత్రీకరణ బంగారి మామ పాటల్లో ఎక్కువగా చోటుచేసుకున్నాయి. గ్రామీణ శృంగారం లోని నైర్మల్యం, భావావేశం - ఈ రెంటిలోనూ సమానమే. అయితే 'ఎంకి పాటల'మీద లేచిన 'గాలి దుమారం', 'బంగారిమామ పాటల' కాలానికి సర్దుమణిగింది. అందుకే ఎంకిపాటలతోపాటు నండూరివారు ప్రసిద్ధులయినంతగా, బంగారిమామ పాటలతోపాటు కొనకళ్ళవారు పేరుపొందలేదు - రోడ్డున పడలేదు.

ఏది ఏమైనా సాక్షాత్తు నండూరివారే 'బంగారిమామ పాటల'ను మెచ్చుకొని, కొనకళ్ళవారిని సాహితీవేత్తల సమక్షంలో 'సత్కరించడం' భావకవితాయుగంలో ఈ పాటలకున్న స్థానాన్ని ప్రకటిస్తున్నాయి. వీటి ప్రభావం తరువాతి కవులపై పడడానికి ఇదే ముఖ్యకారణం.



## అజంతాలు

గీతంలో పొల్లుల్ని
తొలగించి చూడు!
అక్షరాలు,
ప్రాణులై శ్వాసిస్తాయి!
శబ్దాలు
అజంతాలై భాసిస్తాయి!!

## యావత్తు

పదాలను.
పద్యాలుగా మార్చే వైనం.
యావత్తు తెలిసినవాడే కవి!!

## కవిత్వం

కవిత్వం పుట్టేది,
ఇప్ప పువ్వుల్లోంచి కాదు!
నిప్పు రవ్వల్లోంచి!
కోశాల లోంచి కాదు!
క్లేశాల లోంచి
ఆవేశాలలోంచి

## నినాదాలు

ఇప్పుడు.
మా కవితలు.
వట్టి నినాదాలే కావచ్చు!
ఇవే రేపు,
సూత్రాలై భాసిస్తాయి!
శాస్త్రాలై మీ వాక్కుల్ని శాసిస్తాయి!!

## కవిగాడు

కవిత్వ మంటే
టక్కుటమా రాలూ,
గజకర్ణ గోకర్ణ విద్యలూకాదు!
అక్షరాలతో
ఇంద్రజాలాలు చేసే క్షుద్రుడు
కవిగాడు!!

## జయంతి తే...

"ఆ తాళ పత్రచ్ఛద్మంలో
తపిస్తున్న దెవరు?"
"రస సిద్ధులు"
"ఆ రక్త చందనచ్ఛాయలో
జపిస్తున్న దెవరు?"
"గంధక సిద్ధులు!"
"ఆ యూపా గ్రాల
దీపాలై జ్వలిస్తున్న దెవరు?'
"పాషాణ సిద్ధులు!!"

## ఆల్కెమీ

"క్రొత్త సీసాలలో
మెరుస్తున్న దేమిటి?"
"పాదరసం!"
"నీవు చేస్తున్న దేమిటి?"
"రసవాదం!'
"నీవు ఆశించే దేమిటి?"
"సువర్ణ యోగం!!"

**శ్రీ గడియారం శేషఫణిశర్మ**

డా॥ ఇంగువ కార్తికేయశర్మ

# ఆనందేశ్వరాలయము: పెద్దకొండూరు

పెద్ద కొండూరు గ్రామము గుంటూరు జిల్లా, తెనాలి పట్టణము నకు 19 కిలోమీటర్లు ఈశాన్యముగా నున్నది. కృష్ణానది చేరువగా ప్రవహించుచున్నందున, వరదలలో గ్రామము మునిగిపోవుట కలదు. గ్రామవాసులు పాత యిండ్లను వదిలి వూరికి పశ్చిమముగా పంటచేలలో నూతనవాసము ఏర్పరుచుకొనుచున్నారు. ఇటీవలనే నదీతీరమున పెద్ద గట్టుకూడ నిర్మించిరి. పాత గ్రామమున ప్రాచీన స్థలములు-దేవాలయములు పెక్కులున్నవి. మధ్యమధ్యగా యిండ్లకు చేరువగా పాటి మట్టికై పెద్ద గుంటలు త్రవ్విరి. రమారమి 7-8 మీటర్ల లోతున క్రీ.పూ. 5-6వ శతాబ్దికి చెందిన మట్టిపాత్రలు (యెరుపు నలుపురంగు గలవి), పూసలు, యిటుకలు లభ్యమగుచున్నవి. పై స్తరములలో సాతవాహన - ఇక్ష్వాకు కాలమునకు చెందిన మట్టిపాత్రలు-నాణెములు కూడ లభించుట కద్దు.[1] గ్రామస్థులు చాలమటుకు యీ ప్రాచీన స్థలముల మట్టిని త్రవ్వి యెరువుగా వాడుకొనిరి. ఈ గ్రామమున పూజలందుకొనుచున్న ఆలయములు మూడున్నవి. ఇవి శ్రీ రాజ రాజేశ్వరస్వామి, జనార్దనస్వామి మరియు ఆనందేశ్వరస్వామి. రాజ రాజేశ్వరస్వామి దేవాలయమున లభ్యమయిన శాసనమునుబట్టి క్రీ.శ. 1170 యీ గ్రామనామము కొండూరు[2]గా ఖ్యాతికి వచ్చెను. కొన్దు 9, కొను యన వస్తువులు కొనుగోలు చేయుట కృష్ణానది రేవు చేరువైనందున ఈ గ్రామము ప్రాచీనముగ వ్యాపారస్థలముగా ఖ్యాతి బడసినది. ఆనందేశ్వర దేవాలయ శాసనమున కొండూరి స్థలముగా చెప్పబడియున్నది. (క్రీ.శ 1317).

గ్రామము మొదట్లోనే కానవచ్చుచున్న యీ దేవాలయము ఆనందేశ్వరమని పేరు గల్గినది. ఈ నామమునుబట్టి ఆనందగోత్రికులైన రాజుల స్థానమని వెంటనే తోచును. ఆనందగోత్రవంశము రాజ కందర వలన ఖ్యాతి లోనికి వచ్చెను. ఈ రాజు క్రీస్తుశకము మూడవ శతాబ్ది చివరిదశలో స్వరాజ్యము స్థాపించి తెనాలి-చేజర్ల ప్రాంతములలో ఇక్ష్వాకుల యనంతరము రాజ్యము చేసెను. ఈ గ్రామము కొండ్రూర-పెద్దకొండూరు, యని బహుశ ఈ రాజకందరుని వలన ఆర్చియుండ నగును.



1. పెద్దకొండూరు, ఆనందేశ్వరస్వామి దేవాలయము

ఇచ్చట దేవాలయమున ఆనందేశ్వరస్వామి లింగముగా నెరుపలయును. ఈ లింగము దాచేపల్లి సున్నపురాతికృతము. గర్భగృహ, అంతరాల, అగ్రమండపము మున్నగు దేవాలయ భాగములు తరువాతి కట్టడములేయైనను-లింగపీఠము మాత్రము మిక్కిలి పురాతనమైనది. అసామాన్యమైనది. ఆంధ్రమున యిట్టి మానుషలింగము కానరాలేదు (చిత్రము-2). చతురస్ర పద్మపీఠముపై సధిష్ఠింపబడిన ఈ లింగము 60 సెం.మీ యెత్తు గల్గియున్నది. నిత్యపూజ లందుకొనుచున్నది. లింగము వెనుక (రుద్రభాగము, శిఖ (చిత్రము 3) గలదు ఇట్టి శిఖయున్న లింగము కడపజిల్లా చిలమకూరు[4] యను గ్రామమున ఆపదసహాయేశ్వర స్వామియని పేరుగాంచిన దేవాలయమున కలదు. ఈ

లింగము ప్రతిష్ఠించి కట్టడమును చేసినవారు క్రీ.శ. 8వ శతాబ్ది ఈ ప్రాంతమును పరిపాలించిన తెలుగు చోడరాజవంశీయులు ముఖ్యముగా రుద్రభాగమున తత్పురుష రూపముండినట్లు తోచుచున్నది. కాని సున్నపురాయిపై నిత్యాభిషేకము జరుగుచుండుటచే, లింగముపైనున్న చెక్కడములు లక్షణహీనములైనవి. అందువలన నిర్ధారణగా చెప్ప జాలని స్థితియైనది. విష్ణుభాగమున నొక దైవరూపమున్నది. 30.6 సెం.మి యెత్తు గల్గి చాలవరకు శిధిలావస్థలోనున్నను గోచరమగు చున్నది (చిత్రము-3, 4). ఈ స్వరూపమును నాలుగు చేతులు గల్గిన అర్ధనారీశ్వరుడని గుర్తింపవచ్చును. కుడిచెవిని మకరకుండల-వామ కర్ణమున పత్రకుండలము స్పష్టముగా కానవచ్చుచున్నవి. కుడిచేతుల త్రిశూలము, మరియు డమరుక యున్నది. యెడమవైపు చేతులలో చిత్రితములు స్పష్టముగా నున్నవి. ఆభంగమున, యెత్తైన పిరుద, సన్నని నడుము, వక్షోజము, కంఠమున పుష్పమాల మున్నగు లక్షణములు ఇట్టి వామభాగమున స్త్రీ రూపము నుద్దేశించినటుల నెరుగనగును. కుడిభాగమున త్రిశూల, డమరుకలు, ముఖ్యముగా పొడుగాటి కపాల మాల, మోకాలి క్రిందవరకు కానవచ్చుచుండుటచే శివరూపముగా చేకొన వచ్చును. అధోవస్త్రము నూపురములవరకున్నది. బ్రహ్మభాగము చతురస్రము పీఠమున భద్రితమైనది.

ఈ శివలింగమిట్లు - సదాశివుని వామదేవరూపమును మూర్తియు యేకముగా తత్పురుషుని, ఈ యున్నిందున - శుద్ధవైదిక నిరాకార రూపమున ఈశానుని (యోగినాం అప్యగోచరం) స్పష్టీకరించుచున్నది. ఇట్టి మానుషలింగము సకళబేరము[5] కోవకు చెందును. ఈ వైదిక సదాశివుని ఆనందగోత్ర వంశీయులు బహుశ కులదేవతగా ప్రతిష్ఠించి కొలచిరి కాబోలు. కందర వంశజులు శంభుశివుని చరణ కమలముల నిత్యము అర్చించెడివారని శాసనమున విదితము చేసిరి.[6]

అర్ధనారీశ్వరరూపము లింగముపై అరుదు. ఉత్తరభారతమున మధుర (యు.పి) లోని, భండాగారములోనొక అర్ధనారీశ్వర లింగమున్నది. కాని ఈ లింగము కుషానుల కాలమునకు చెందినది.[7] కాలానుగతమున ఈ సున్నపురాతి లింగము నిత్యాభిషేకము వలన చాలవరకు శిధిలమైనను భగవత్ప్రేరణ వలన కాబోలు యిట్టి అపురూప స్వరూపమున్న లింగమును దర్శించి, నలుగురికి తెలియజెప్పు నవకాశమును నాకు మా పుచ్చా పరబ్రహ్మశాస్త్రిగారు, శ్రీ శివలెంక రాధాకృష్ణగారు ప్రసాదించిరి. వీరిరువురికి నా నమోవాకములు.



చిత్రము–3



చిత్రము–2



చిత్రము–4

**2.** పెద్దకొండూరు, అనందేశ్వరస్వామి దేవాలయము, లింగచిత్రము

**3, 4.** పెద్దకొండూరు, లింగము విష్ణుభాగమున అర్ధనారీశ్వర స్వరూపము

**అధోజ్ఞాపికలు**

1. హైదరాబాదులోనున్న డా॥ పుచ్చా పరబ్రహ్మశాస్త్రిగారి స్వగ్రామమిది. వారు నాతో కలిసి (మార్చి 28, 1987) దయతో నీ గ్రామమునకు వచ్చి దేవాలయముల, ప్రాచీనస్థలముల శ్రద్ధగా చూపుటయేగాక పుష్టిగా భోజన సత్కారముల చేసిరి కూడ. వారికి నేనెంతో ఋణపడియున్నాను.
2. ఏ. పి. డిస్ట్రిక్టు గజిటీర్స్. గుంటూరు (హైదరాబాదు, 1977, పుటలు 364-361)
3. ఆనందగోత్ర వంశజుల చరిత్రకై - కె. రాజగోపాలాచారి, ఎర్లి హిస్టరీ ఆఫ్ ఆంధ్ర కంట్రీ) మద్రాసు 1976) పుటలు 191-200 మరియు ఓరుగంటి రామచంద్రయ్యగారు, సాతవాహనాస్ అండ్ దేర్ సక్సెసర్స్, సర్ విలియమ్ మేయర్ "యెండోమెంటు లెక్చర్స్ ఇన్ హిస్టరీ" మద్రాసు విశ్వవిద్యాలయము సంపుటి-50, సంచిక-2 (జూలై 1978) పుటలు 40-43.
4. ఐ ఎ ఆర్. 1971-72, పు. 100-101.
5. కె. ఎస్. సుబ్రహ్మణ్యశాస్త్రి, మాయా మతం, 38. (తంజావూరు 1966)
6. ఇండియన్ ఆంటిక్వయరీ, 9. పు. 103.
7. జోయన్నా విలియమ్స్. "అన్ అర్థనారీశ్వర లింగ" కుసుమాంజలి. (న్యూఢిల్లీ, 1987) పుటలు 299-305.

# హార్డీ రామానుజౌ ప్రాజ్ఞౌ - గణ్యౌగణిత కోవిదౌ

## శ్రీ కె. సూర్యకోటేశ్వరరావు

అతీవదక్షో గణిత ప్రబోధనే
సుబ్రహ్మచారీ చ కుశాగ్రబుద్ధిః
ఆచార్య హార్డీ విబుధేషుగణ్యః
జగామ కీర్తిం గణితప్రపంచే॥

రామానుజోఽయం గణితాధినేతా
ఆచార్య హార్డీప్రియ శిష్యవర్యః
ఆంగ్లేయదేశే గణితాగమాబ్ధి
మామూలచూడం స్వధియామమంథ॥

విశేష పాండిత్యధురీణ ఏవ
రామానుజస్స్వస్య విశేష ప్రజ్ఞయా
ఆహ్లాదయన్ సూరిజనాన్ గురూంశ్చ
రాకా సుధాంశు ప్రతిమోరరాజే॥

హార్డీ రామానుజౌ ప్రాజ్ఞౌ గణ్యౌగణితకోవిదౌ
ఏకస్య స్మరణాదన్యః స్మృతిమార్గేఽవ తిష్టతే॥

ఆంగ్లేయ పండితస్త్వేకః భారతీయోఽపరస్సుధీః
అవినాభావసంబంధ స్తయోరస్తి విశేషతః॥

ఏకస్తు నాస్తికోభావే పరస్తు పరమాస్తికః
జలశైలానుబంధేన చక్రతుస్సహ జీవనమ్॥

రామానుజ సుధీవర్యో నిరాడంబరమూర్తిమాన్
పదవీంవా ప్రతిష్ఠాంవా నతుస్వప్నేప్యకాంక్షత॥

నవీన ప్రాక్పశ్చిమ పండితానామ్
ప్రతిష్ఠితానాం గణితాగయేషు
లబ్ధ్వాసమం స్థానము దంచితాత్మా
రామానుజోఽరాజత రాజకాంతిః

# సుదర్శనం

## చౌడూరి

అక్కసు అభ్యుదయం కాదు
చెక్కభజనలో చైతన్యం లేదు.
ఉక్రోషంతో తిట్టిపోస్తె
ఊరంతా మారిపోదు—

భౌతిక విశ్లేషణలో
భావానికి తావు లేదు.
పాప భావ మోహాలకు
ఆత్మలు దాసోహమ్ములు—

సంపూర్ణ వికాసం కోసం
గత కాలం ఒక సోపానం
సమగ్ర విప్లవానికి
సమ్యక్ దృష్టి ప్రధానం—

అస్తులామిష చర్మాలగొలచి
ఆత్మను భావించలేవు.
శస్త్ర చికిత్సలు చేసి కూడ
చైతన్యాన్ని పట్టలేవు—

కనిపిస్తున్న కాయం మనిషి కాదు.
కమనీయోహాల కాంతివాడు.
ఆత్మకు దేహ మద్దె ఇల్లు
అవసరం తీరగానే చెల్లు—

ఆత్మను హత్య చేయలేవు
దాని దారి మార్చగలవు
దీనికొఱకు జీవితాన్ని
ధారపోయవలసియుండు—

నేటి విప్లవ భావాలవాడు
నాటి వ్యవస్థ సంతానమె.
పరవళ్ళు త్రొక్కు నేటి ప్రగతి
పాత బూజు దులిపినదే—

మారుపు యెవనికవసరమ్మొ
మారవలెను వాడు ముందు
ఆత్మవికాసం కొఱకు
అజ్ఞానం తృంచవలెను—

ప్రజలంతా మేలుకొన్న
ప్రతి వ్యవస్థ మారునన్న
సామాన్యుడు మేలుకొంటె
సమభావం మొలచునన్న—

మార్పు చేయనెంచువాడు
మనిషిని మెల్కొల్పవలెను
మాటతీరు మనిషితీరు
ఏకమై నిలువవలెను —

అతని తపస్సే విప్లవమ్ము
ఆతని జీవితమె ప్రగతి
అతడే మార్పుకు నిదర్శనం
అసురతను మాపే సుదర్శనం

# కలగూరగంప

## "చతుర్విధ కవితాచతురానన" విక్రాల. శేషాచార్య కవిశేఖరులు

ఆంధ్ర కవిచరిత్ర పోరాటాలలో ప్రకాశంజిల్లా - కందుకూరు తాలూకాకు ఒక ప్రత్యేకత కలదు. ఇది అత్యుక్తి కాదు సత్యోక్తి. కవితాహార హరమణియైన - ఎఱ్ఱాప్రెగ్గడ గుడ్లూరువాడు-బ్రహ్మాండి మహాపురాణచయ తాత్పర్యార్థ నిర్ధారిత బ్రహ్మజ్ఞాన కళానిధియైన-శ్రీనాథ కవిసార్వభౌమునిది. ఈ తాలూక పాకల పట్టణము. 'వాణి నా రాణి' అన్న పిల్లలమర్రి పిన వీరనది. కలికివాయ, బిట్రగుంట. నిరంకుశోపాఖ్యానాది బహుళ కావ్యకర్తయైన-కందుకూరు రుద్రకవిది చింతలపాళెం. విష్ణుపురాణము నాంధ్రీకరించి రాఘవరెడ్డి ప్రాపు సంపాదించిన వెన్నెలకంటి సూరనది గుడ్లూరు ప్రాంతము. లక్ష్మీనృసింహ విలాసమును రచించిన - పైడిపాడి లక్ష్మీనృసింహ కవి. ఏకామ్ర మంత్రిసుతుడై - ఆంధ్రనామ సంగ్రహమును శేషమును రచించి-లక్ష్మణాఖ్యునిపైడిపాదు. అభినవాంధ్ర కవితాపితామహుల ఆశుకవి చక్రవర్తులయి-మోచర్ల వేంకన దత్తపులది - తెట్టు - ఆంధ్ర బిల్హణీయకర్త-చిత్రకవి సింగరాచార్యులది-కలికివాయి బోభకాపాలీయము - సంపత్కుమారీయముల కర్తయైన - వేంకట వీరరాఘవాచార్యులదియు కలికివాయే. వీరిగాక నవీనులతో పలువురున్నారు.

ఇట్టి మహాకవులకు - మహామనీషులకు జన్మభూమియైన - ఈ తాలూకాలో కలికివాయ గ్రామమున-ఏడు మూడు పురుషాంతరముల నుండి-పర్ణశాలవారు-విక్రాలవారు-మున్నగు శ్రీవైష్ణవ కుటుంబములు పూర్వాచార్య సంప్రదాయమును విడజాలక నవీనమును స్వీకరింపలేక-అటునిటుగనుండి ఆ గడ్డను కనిపెట్టికొనియుండి పాండిత్యముచే-వైదుష్యముచే-సంస్కృతాంధ్ర భాషావరివస్య నెరపుచు అధీతిబోధాచరణ ప్రచారణులై - అభ్యాగతఅతిథి సేవాతత్పరులైయున్న కుటుంబములలో - శ్రీ విక్రాలవారి కుటుంబము వన్నెవాసి గాంచినది. ఈ కుటుంబములో అందరు పండితులే కవులే. ఈ విక్రాలవారినే, విక్కిరాల, ఎక్కిరాల అని ఇంటిపేరు క్రమముగ మార్పు చెందినట్లు చెప్పుచున్నారు. ఎక్కిరాల కృష్ణమాచార్యులు, భరద్వాజ పగ్గెరాలు-ఈ వంశ మౌక్తిమణులే.

ఈ వంశమున మూడు నాల్గు తరములకుముందు రాఘవాచార్యులనువారు మహాపండితులు, చతుస్తంత్రవేత్త. తన వైదుష్యమును ప్రదర్శించి-కాళహస్తి ప్రభువులచే 'కళత్తూరను' అగ్రహారమును సర్వమాన్యమున పడసిరి. నేటివరకు ఇందలి ఫలసాయమును ఈ కుటుంబీకులు అనుభవించుచునేయున్నారు.

ఈ రాఘవాచార్యులవారి కుమారులు - మహావిద్వాంసులు రామచంద్రాచార్యులవారు. వీరు 80 గ్రంథములు రచించి అనేక ఘనసన్మానములు పొంది విద్యారణ్యపంచాననాది అనేక బిరుదములు పొందిన మహామనీషులు. వీరికి పలు శాస్త్రములలో వైదుష్యము కలదు. వీరి గ్రంథములలో - 'భీష్మ వివాహము' తరిగొండ వేంగమాంబా విజయము. వేదాంతము జడ్జిమెంటు. ఇత్యాదులు పరశ్కృతములు. వీరికి ఇద్దరు కుమారులు - రాఘవాచార్యులవారు పెద్దవారు. చిన్నవారు శేషాచార్యులవారు. వీరి తాతగారు తమ జాతకములో తమ కుమారునకు ఇద్దరు కుమారులు కలుగుదురనియు, వారికి సంతానము కలుగదనియు వ్రాసికొన్నారుట. అట్లే వీరిరువురకు సంతానము లేదు.

పెద్దవారైన రాఘవాచార్యులవారు తండ్రిగారి శాస్త్ర విజ్ఞానమునకు ప్రతినిధికాగా, శేషాచార్యులవారు పాండిత్యముతోబాటు కవిత్వమునకు ప్రతినిధియై ఆ వంశకీర్తిని నేల నాల్గువైపుల వ్యాపింపచేసిరి.

ప్రకృతము శ్రీ శేషాచార్యులవారు శేపగుణ సంపన్నులు. తండ్రిగారూహించియే ఈ పేరు పెట్టియుందురు. ఆదిశేషునివలె-వీరి ప్రతిభ సర్వతోముఖమైనది. శేషాచార్యులవారు తండ్రిగారివద్ద, మామగారికడ, అన్నగారి శుశ్రూషవలన అనేకములైన శాస్త్ర సాహిత్య రహస్యములను పుక్కిట నింపినారు. అనేక గ్రంథముల రచించినారు. వీరి గ్రంథములు చిన్నా పెద్దా కలసి 50 వరకున్నవి. కొన్ని సంస్కృతము కొన్ని తెలుగు.

వీరికి చిత్రకవిత యందును బంధకవిత యందును ఆసక్తి మెండు. అందుననే శ్రీనివాస ప్రసాదః, శ్రీ వేంకటేశ్వర చరిత్ర, రత్నాకరము, శ్రీ పాదరేశతకములలో పై కవితకే ఎక్కువ ప్రాధాన్యమిచ్చినారు. అందుననే వీరికి వీరి కావ్యములకు రావలసినంత ప్రశస్తి రాలేదు. ఏ కొద్దిమంది పండితులకో సంతోషము కూర్చినవి. శ్రీ ఆచార్యులవారిని సంస్కృతాంధ్రములలో ఏ విషయమైనను అడిగినదే తడవుగ ప్రత్యుత్తరము సప్రమాణముగ నుడువెడివారు. ఆ బలముతోనే "సంస్కృతాంధ్ర పదార్ణవమను' నిఘంటువును రచింపగ ఈ పండితుని వైదుష్యమెరిగిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి అధ్యక్షులైన శ్రీ డా॥ బెజవాడ గోపాలరెడ్డిగారు ఆ గ్రంథమును అకాడమి తరపున ప్రచురించుటకు తీర్మానించి ఆటకు పిలిపించి ఘనమున సత్కరించిరి. అంతటి వైదుష్యము కలవారు శ్రీ ఆచార్యులవారు.

కాని వీరి గ్రంథములలో చాలా గ్రంథములు అముద్రితములుగ నున్నవి. వీరు తమ తాత, తండ్రులు సంపాదించినవేగాక వీరును సేకరించిన అపూర్వములగు గ్రంథములెన్నియోగలవు. ఆ గ్రంథాలయమును చూచిన ఆచార్య డా॥ బి. రామరాజుగారు ఆశ్చర్యపడినారుట.

1917వ సంవత్సరమున జన్మించిన శ్రీ ఆచార్యపాదులు షుమారు ౫ దశాబ్దములకు పైగా ఆంధ్ర సంస్కృత భాషాసేవ చేయుచు భారతి, ఆరాధనవంటి అనేక పత్రికలకు వివిధ ప్రక్రియలతో వ్యాసములు వ్రాయుచు, పలు సభలలో కవితా వైదుష్యముతో, పాండిత్య ప్రతిభతో ఉపన్యాసములిచ్చుచు ఎంతో సేవచేసిరి. కొనగాలి విడుచువరకును వాఙ్మయసేవ చేయుచునే ఉండిరి.

అటు మద్రాసునుండి ఇటు హైదరాబాదు శ్రీకాకుళము వరకు అన్ని ప్రాంతములలో దంపతులుగ సంచరించి ఎంతో భాషాసేవ చేసిరి. ఆచార్యులవారి పరిచయము ఎంతటిదన్న నేను నా పని మీద శ్రీ శివలెంక రాధాకృష్ణ (ఆంధ్రపత్రిక ప్రధాన సంపాదకులు)గారిని సందర్శింప వెళ్ళితిని. నా పరిచయమైన పిదప వారు "ఏమండీ మా విక్రాల శేషాచార్యులవారు కులాసాగానున్నారా?" అని ఎంతో ఆప్యాయముగ పలుకరించి వారి యోగక్షేమములు విచారించిరి. ఆ కుగ్రామములోనున్నను - వారి విద్యా వైదుష్య సౌరభమును ఆంధ్ర పత్రిక సంపాదకులచేత ఆఘ్రాణింపచేసిరి.

వీరి అముద్రిత రచనలు సాహిత్యాభిమానులు వెలుగు తెచ్చిన వాఙ్మయమునకెంతో ఉపకారము చేసినవారగుదురు. ఇందు కథలు గాథలు, జీవిత చరిత్రలు, ప్రబంధముల ఖండకావ్యములు, క్షేత్ర మాహాత్మ్యములు, విమర్శలు, స్తోత్రములు, శతకములు, దండకములు ఇట్లు అనేక ప్రక్రియలలో వీరి లేఖిని నడచినది. వీటిని పరిరక్షించుకో వలసిన బాధ్యత సాహిత్యాభిమానులది.

శ్రీ ఆచార్యులవారి దత్తపుత్రుడు కాని, వారి సంబంధులు కాని వారి కీర్తిచిహ్నముగ ఆ గ్రంథములను ఏ గ్రంథాలయమునకైనను సమర్పించి చరితార్థులు కాగలరని మనవి చేయుచున్నాను.

ఇక శ్రీ శేషాచార్యులవారి ధర్మపత్ని కవయిత్రీతిలక. విక్రాల శ్రీ దేవమ్మగారు. పర్ణశాలవారింటి ఆడపడుచు. అటు పుట్టిన ఇల్లు, ఇటు మెట్టిన ఇల్లు రెండును పాండిత్యమునకు సంప్రదాయములకు నిలయములగుటమూలాన ఈమెకు ఉగ్గుపాలనుండే ఆవాసన యేర్పడి. ప్రాయమున కవితాకళయు స్వాధీనమై వాసవదత్తా పరిణయము, రసిక శరణాగతి, ప్రార్థనాలహరి వంటి ఉత్తమగ్రంథములు వెలువడినవి. ఈమెయు తమ భర్తగారివద్ద భాషాశాస్త్రరహస్యముల నెన్నిటినో నేర్చినది. జంటకవులవలె ఇరువురును అనేక సభలలో ఉపన్యాసములిచ్చుచుండెడివారు. ఈమె గ్రంథములకు 'దివాకర్ల రామరాజు' వంటి పెద్దలు చూచి తలయూచిరి. ఆంధ్రదేశమున అనేక సన్మానములందికొనినారు. ఈమె షుమారు ఆరు మాసముల క్రితం పరమపదించినది.

ఈ దంపతులను కందుకూరు తాలూకా రచయితల సంఘము వారు - ఈ సంఘ గౌరవాధ్యక్షులు పవని శ్రీధరరావుగారు, ఒంగోలు ఎర్రన పీఠమువారు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి - నెల్లూరు వర్ధమాన సమాజమువారు, గూడూరు కాళిదాస కళాక్షేత్రమువారు చీరాల పురప్రముఖులు ఇట్లా ఎన్నో సంఘములు పలురీతుల సన్మానములు చేసినవి.

కాని ఇంత పాండిత్యమున్నను, ఇన్ని గ్రంథములు వ్రాసినను, ఇన్ని సన్మానములు పొందినను వారికి రావలసినంత కీర్తిప్రతిష్ఠలు రాలేదు. దీనికి కారణం వారు ప్రతిష్ఠకోసం ప్రాకులాడలేదు. నిరాడంబరత.... పైగా 'కవినై పుట్టినదానికన్ ఫలము భక్తవ్రాత మందారమా? భవదీయాంఘ్రి సరోజసేవనసుధా పానంబునంగాక వేరె విధానంబున చిత్తతాపము, నివారిసంపదను చిత్తవృత్తి కలవారు అందున వారి కావ్యములు వారి కవిత పాండిత్యాభిమానమున్న ఏ కొద్దిమందికి మాత్రమే పరిచితమయినయి.

1917న జన్మించిన శ్రీ శేషాచార్య కవిగారు ఐదు దశాబ్దములకు పైగా వాఙ్మయసేవ చేసి 'యన్మరణం తదవభృతం' అన్న శృత్యనుసారముగ 13-10-86న ఈ లీలా విభూతిని విడనాడి నిత్య విభూతికి వేంచేసి సాహిత్యలోకమునకు ఎనలేని కొరతను దీర్పరాని దుఃఖమును కలిగించిరి.

ఈ నాల్గు మాటలు వ్రాసి వారి పవిత్రాత్మకు శాంతి కలుగుగాక యని భగవంతుని ప్రార్థించుచునున్నాడను.

—విద్వాన్ కొండూరి రామానుజాచార్యులు

# చర్మవ్యాధులకు




# అతి గాఢంగా పనిచేసే అమృతాంజన్ డెర్మల్ ఆయింట్‌మెంట్

చర్మవ్యాధులకు ఉపయోగపడే సాధారణ ఆయింట్‌మెంట్లు ఎక్కువగా చర్మం లోపలకు ప్రవేశించలేవు. కాని అమోఘమైన చర్మరోగ నివారణ ఔషధాలు విశిష్టంగా చేరిఉండడంచేత అమృతాంజన్ డెర్మల్ ఆయింట్‌మెంటు మాత్రము లోపలకు ప్రవేశిస్తుంది. సాధారణ చర్మవ్యాధులను అతి శీఘ్రంగా నిర్మూలించి చర్మాన్ని పూర్వస్థితికి తెచ్చి సహజంగాను ఆరోగ్యవంతంగాను ఉంచుతుంది. అమృతాంజన్-డెర్మల్ ఆయింట్‌మెంట్ తామర, గజ్జి, దురద ఇతర చర్మ రోగాలకు ఆదర్శమైన నివారిణి. నేడే కొనండి!

**అమృతాంజన్ లిమిటెడ్ 42-45, లజ్ చర్చ్ రోడ్డు, మద్రాసు 600 004**

**Amrutanjan Limited**





157-TG

# "తాతాజీకో నూలుపోగు" -"చిన్నిపూవు!"

గ్రాంథికవాద ఛాందస పండిత సుమోధనుల్ని
వాదుకుబట్టి వంకలు దీర్చిన ధర్మారావు!
వ్యావహారిక భాషాప్రియులయిన తమ్ముగుఱ్ఱల్ని
రేకమోవకుండా కాపాడిన ధర్మారావు!
విజయవిలాసాన్ని రాపిడిపెట్టి
అది తొలకరి మెఱుపని
తొలకరి దొరబిడ్డ మెఱుపని
ధీరుల కెరిగించి
వెలుగు పడజేసిన ధర్మారావు!
కోవెల గోడలమీద, గర్భగుడి విమానాలమీద
గోపురాలమీద, రథాలమీద
లక్షోపలక్షల
బూతుబొమ్మ లెందుకుంటాయన్న
"జొన్నకల్లు ప్రశ్నలకు" - పరిశోధనాబుద్ధితో
బాపురే! ఏమనగునట్లు
సమాధానాల్ని చెప్పిన ధర్మారావు!
పెళ్ళి తంతుల్లోని చిత్రవిచిత్రాలన్నీ
ఆచారాల పేరుతో
మనల్ని అప్పుల్లో ముంచి చంపెడి
"శ్వేత అశ్వత్థామలని" (వైట్ ఎలిఫెంట్స్)
గట్టిగా నొక్కి పల్కిన ధర్మారావు!
తామరసనేత్రల కినుపకచ్చడాలు గట్టి
ఇండ్ల బంధించు కీచకుల్ని
వ్రేళ్ళతో పెరికి పారవేసే "జయంతులే"
సంఘానికి కావాలని గర్జించిన ధర్మారావు!
మదరిండియా దేహంలోని రక్తపుబొట్లయిన
మనుష్యులు ముష్టివాళ్ళయి
బొడ బొడా నేలరాలుతూ
ఈ దేశ సుందరాకారాన్ని కళంకితమొనరిస్తున్నారని
వాళ్ళని అభ్యుద్ధరించే
పుంభావ ద్రౌపదులుద్భవించాలని ఆరాటపడిన ధర్మారావు!
పూర్వాచారాలు సంప్రదాయాలు
మాయపుచ్చెడి సొగటాల కాయలని
వాటితో గుడ్డిగా ఆడుతూ
చేజేతులా
పచ్చటి జీవితాన్ని బుగ్గి చేసుకోవటం మూర్ఖత్వమని
ఆధునిక విజ్ఞానకాంతులు సూచించెడి ఉపాయాలతో
వాటి ఆట కట్టించి
"త్రోసి-రాజవ్వాలని" బోధించిన ధర్మారావు!
ప్రజారాజ్యసూయంలో మూఢాచారాల శిశుపాలుర
-కగ్రాసనాధిపత్య మివ్వటం పాడిగాదని
హేతువాద శ్రీకృష్ణులకే పెద్దపీట వేయటం
న్యాయసమ్మతమని ఘోషించిన ధర్మారావు!
అక్షరం శారద సుపాసించి
సాహిత్యపు స్థాలిని పొంది
ఎప్పుడు తిన్నా - ఓ పిడికెడు ఎక్కువ తిన్నా
అజీర్ణ బాధ కలుగని రుచికరమైన
'ధర్మపాకం' మొర్మొరాల్ని సృజించి పంచిపెట్టిన ధర్మారావు!
'పత్రికల గోవులు' కుంటొకింత లేని
నాలుగు పాదాలతో నడుస్తూ
వార్తలను వలుద పొదుగులతో పెంపొందుతూ
సత్యక్షీరాలి వర్షిస్తూ
జనకోటికి హితాన్ని అందించాలని ఆకాంక్షించిన ధర్మారావు!
విషయాన్ని విడిచిపెట్టి
విధానానికే ప్రాధాన్యమిచ్చి చదవండని
పాత కొత్త పాళీలతో
చేతుల్ని ముకుళించి అర్థించిన ధర్మారావు!
సినిమా మాటల పాటల 'గ్రంధుల్ని'
నేర్పుగా సడలించి
పాత్రధారులకు, గాత్రధారులకు ఊపిరులు పోసి
ప్రాణదానం చేసిన ధర్మారావు!
నిన్నటికి నేటికి క్షణం క్షణం మార్పు ఉంటున్నదని
మనం ఒక్క గడియ మత్తుగా ఉన్నామంటే
ఒక్క శతాబ్దమే అశ్రద్ధగా బ్రతికినట్లని
హెచ్చరిస్తూ 'ధర్మదార వట్టిన' ధర్మారావు!
'ఛస్తే ఎలాగ బతుకుతావురా' ఛలోక్తికి
సరిపడు చెక్కు చెదరని కీర్తిమూర్తిని
సంపాదించుకొని
జైవాతృకుడయి మినమినలాడిన ధర్మారావు!
అకుంఠిత ప్రత్యయాహంకారంతో
'అనంత విజయశంఖం' పూరించి
గ్రంధసాంగుల నోళ్ళు మూయించి
చక్కట్లు దిద్దిన ధర్మారావు!
ఆల్‌రౌండు చాంపియినయి

సమకాలమువారల మెప్పులందుకొనిన
వేయి పడగల ధర్మారావు!
జస్టిస్ రాజకీయాలలో మునుకల భాగ్యం లభించినా
జనావళిని జ్ఞానకిరీటధారుల్నిగా చేయటంలోనే
అహర్నిశలు - పాటుపడిన ధర్మారావు!
వామపక్షపు సొగసులకు తలయూచి సొగసినా
వామమయిన సుధాప్రసన్నమయిన భావాల్ని
గుత్తకు పుచ్చుకొని మధువ్రతుడయిన ధర్మారావు!
క్షితిలో ఎవ్వరికీ పెనువేప విత్తవ్వనీ ధర్మారావు!
పశువను పరుషం దప్ప
అన్యములయిన గంద్రలాడని ధర్మారావు!
రేగినా తలపొలంవరకు వెళ్ళని సాధువయిన ధర్మారావు
మనసు పేదయిన ధర్మారావు!
'వెలది-పానం వ్యసనాలకు'
మరణాంతం వరకూ గొడ్డలయిన ధర్మారావు!
కాఫీ, చుట్టలకు మాత్రం
'మేనత్తకొడుకయిన' ధర్మారావు!
మసిబూసి మారేడుకాయలు చేసెడి 'గారడి'
నాలుగుకాళ్ళ కుందేటికి మూడే కాళ్ళనెడు-'తొండి'-
-విద్యలు తెలియని ధర్మారావు!
ఎయ్యెడలనూ జాబుపాటుల్ని గూడా
మేలుగానే గ్రహించిన ధర్మారావు!
జంగమ ధర్మారణ్యమయిన ధర్మారావు!
ప్రఫుల్ల నవాంబుజ ప్రసన్నమయిన డెందం గలిగిన ధర్మారావు!
చంద్రిక లీనెడు నవ్వుమోముతో కలకలాడిన ధర్మారావు!
కవి'తనమయిన' మహితోక్తులతో
కవి'ధనమయిన' నిడుదగడ్డంతో
పిన్నలకూ పెద్దలకూ అందరికీ
మనసు పుట్టించిన ధర్మారావు!
పట్టిన ప్రతి ప్రక్రియనూ పాఅజూసి
తనదైన 'ధర్మముద్ర' వేసి
'తాతాచార్యులయి' జోహారు లందుకొనిన ధర్మారావు!
జర్నలిజమను 'జాదుల ప్రసాదాన్ని'
ముందు తరాల వాళ్ళకు
కానుకగా నిచ్చిన ధర్మారావు!
కవీంద్రుడూ, రవీంద్రుడూ
ఋషీంద్రుడూ, విమర్శకుడూ అయి
వాఙ్మయ ప్రపంచంలో
ప్రతిభను సూయానంగా నొనరించిన ధర్మారావు!
శ్రీమంతుకెక్కిన శ్రీమంతుడయిన ధర్మారావు!
'తావకాగమన వార్తతో'
భువి కవివరులకే గాదు
దివిజ కవివరులకు గూడా
హృదయోల్లాసాన్ని కలిగించి
పుణ్యశ్లోకుడయిన ధర్మారావు!
జగమెరింగిన ధర్మారావు!
నుతింపశక్యంకాని ధర్మారావు!
అందుకే - ఈ "నూలుపోగు"
—"చిన్నిపూవు!"

శ్రీ కె. కిశోరుబాబు
శ్రీ కె. అశోకుబాబు

# మరికొన్ని పిట్టల [పక్షుల] పేర్లు

మన "భారతి" పత్రికలో సెప్టెంబరు 1986న "కలగూరగంప" శీర్షిక క్రింద 127 జాతుల పిట్టల పేర్లను వ్రాయడము జరిగినది. వేటగాళ్ళయిన కొత్తోజు లచ్చయ్య, ముచ్చపోతుల సర్వయ్యగారలు మరికొన్ని పిట్టల [పక్షుల] పేర్లు చెప్పినారు. వాటిని ఈ క్రింద పొందుపరచుచున్నాను.

128. వడ్ల సంఘం పిట్ట
129. ఎర్ర శీతువ
130. నల్ల శీతువ
131. తంగెడు శీతువ
132. మట్టి శీతువ
133. చిన బొత్త శీతువ
134. రేగడి శీతువ
135. చెవుల శీతువ
136. నేల పొట్టిర్ గాడు
137. జిట్ట పావురము
138. గుడ్ల పావురము
139. పగిడి పావురము
140. చిన నుగ్గుపిట్ట
141. పెదనుగ్గు పిట్ట
142. చిన జమ్మిపిట్ట
143. గడ్డి పూరేడు
144. ఎర్ర పూరేడు
145. చిన పూరేడు
146. గోరంత పిట్ట
147. చినకాకి పిట్ట
148. గుగ్గిలం పిట్ట
149. మల్లెల పిట్ట
150. కాళ్ళపిట్ట
151. తోకపిట్ట
152. మూడు మొకాల పిట్ట
153. కొమ్ముపిట్ట
154. బూడిద సెలగ
155. ఎర్ర సెలగ
156. జిట్ట సెలగ [పొట్టి సెలగ]
157. నల్ల సెలగ
158. తెల్ల సలువ పిట్ట
159. నల్ల సలువ పిట్ట
160. మంచె పిట్ట
161. సంద్రడ పిట్ట

162. ఒత్తు పిట్ట
163. ఇడిమోకు పిట్ట
164. చిన గోశెర గాడు
165. పెద గోశెర గాడు
166. చీమ దొర్సాని పిట్ట
167. చిఱుడంత పిట్ట
168. చిల్‌మాల్ పిట్ట
169. ఉల్చ పిట్ట
170. పందిముట్టె పిట్ట
171. పొట్టి పిచ్చుక
[రాళ్ళ గూటిలో నివసిస్తుంది.]
172. ఆట తప్పెడుగాడు
173. ఎఱ్ఱ బుర్క
174. కాళ్ళ ఉల్లెంద పిట్ట
175. పచ్చపిట్ట
176. ఊముడు కాకి
177. మాలకాకి
178. పిలికి పిట్ట
179. భరత పక్షి
180. మైనాక పక్షి
181. చిఱుత పక్షి
182. ఉష్ట్రపక్షి
183. మస్కకోడి
184. కార్ కోడి
185. కలివి కోడి
186. గబ్బిలము
187. బండ గబ్బిలము
188. నేతాడు గబ్బిలము
189. పూరి సెలగ
190. లకుముకి పిట్ట
191. కండ్లపిట్ట
192. పండ్లపిట్ట
193. నెత్తెంటికల పిట్ట
194. గుడ్ల పిట్ట
195. నల్ల మొదలు పిట్ట
196. కిరిటాయ్
197. కంచనగాడిది పిట్ట
198. మీసాల పిట్ట
199. అడవి నెమలి

జీవరాసులు మొత్తం 84 లక్షలు. అందులో పక్షులు 10 లక్షలు. పక్షిసంపద చాలావరకు క్షీణించిపోతున్నది. ముందు తరాల వారికోసం పక్షి సంపదను కాపాడవలసిన బాధ్యత మనపై ఉన్నది. అందుకోసం అడవులను సంరక్షించవలెను. మీసాలపిట్ట ముఖముపై వెంట్రుకలు మీసములవలె ఉండుటవలన మీసాలపిట్ట అని పేరు వచ్చినది. కొమ్ముపిట్ట, కండ్లపిట్ట, కాళ్ళపిట్ట, తోకపిట్టలకు వాటి పోలికలను బట్టే ఆ పేర్లు వచ్చినవి. అవసరమనిపిస్తే పై పిట్టల ఫొటోలను కూడా మీ ముందు ఉంచగలను. కొంత శ్రమను, కొంత ఆర్థిక భారమును మోయవలసి ఉంది.

ఇంతకుముందు వ్రాసిన ఎరుకలి భాషలోని పిట్టల [పక్షుల] తెలుగు పేర్లు తెలిసినవి - అవి పుట్టబాతు [తారావు], సుక్కకోడి [వత్తెనొ], సంద్రపిట్ట [ఆరెబుడ్డ], సముద్రము పిట్ట [బెరిఏండ్రి], సిలార్ ముసలాయ్ కోడి [కెర్‌కుష్‌గో]. తెలువాకు తెలుగు పేరు తెలియలేదు.

శ్రీ డి. నర్సయ్య

# గాథాసప్తశతి : మరొక వ్రాతపతి

నాథయామున ముఖముని నాథ - జనన
భావ్య - శఠ మర్షణాన్వయ వార్థిశీత
కరులు - తిరుమలనురు వరుల్ కన్నవారు
వినయశీలుండ వేంకటాభిఖ్యవాడ॥

ముఖపత్రము

శ్రీ అద్దంకి వేంకటాచార్యులవారు (1919-1947) శఠమర్షణ గోత్ర శుభాపస్తంబ సత్పూత్రులు లక్ష్మమ్మ - తిరుమలాచార్యులవారి తృతీయ పుత్రులు-అన్నగారైన తాతాచార్యులవారివద్ద, శ్రీ ధర్మాల సుబ్బరాయశాస్త్రిగారివద్ద కావ్యాలంకారములు నేర్చి, స్వయంకృషితో ఆంధ్రాంగ్లములలో చక్కని వైదుష్యమును సంపాదించి 'డిగ్రీ'లు లేని పండితులని, పండితులచే ప్రశంసలందినారు. 'కావ్యాలంకృతి నాటకాది నిపుణులైన కారణాన. కవితాకన్య స్వయమున వరించినది. కవితలోని లోతుపాతులను తెలుగు ప్రబంధములందలి మేలి సొగసులను మామగారైన శ్రీరంగం నల్లాన్ చక్రవర్తి నరసింహాచార్యుల వారి సంసేవ వలన నేర్చిరి.

ఒకవైపు కావ్యమరుగులను తెలిసికొనుచు, మరొకవైపు కవిత నారంభించి ఖండకావ్యాలు చాల రచించినారు. కవితలో పరిణతి జెందని కారణాన అవన్నియు వెలుగుకురాక కలుగులోనే యున్నవి. అట్లు కొన్ని సంవత్సరముల పిదప వీరు 'కలము పట్టి' 'శాలివాహన సప్తశతి రచించితి ముద్దులొలుకబోయు తేటతెలుగునందు। కలుగు సంతసమ్ము - కవితా రసజ్ఞుల। గొందరేని మెచ్చికొందురేని॥ అని సాలివాహన గాథాసప్తశతిని తుదముట్ట నాంధ్రీకరించినారు-ఇతరములైన కృతులు మరుగున పడినవి:

దీనిని శ్రీనాథ కవిసార్వభౌముడు ఆంధ్రీకరించాడని మూడు పద్యాలు - చాటుపద్య మణిమంజరిలో కనుపడుచున్నవి. అసలు గ్రంథమసలే కనుపడలేదు 'మా యింటినుండి శ్రీనాథుని శాలివాహన సప్తశతి' తాళపత్ర గ్రంథముపోవుట నేనెరుగుదును.' అని ఆచార్య బి. రామరాజుగారు శివరాత్రి మాహాత్మ్య పీఠికలో (11 పేజి) వ్రాసికొన్నారు - ఇట్లా మరికొందరు

దీని విలువ ఎట్టిదోకాని ఈ ఇరవయ్యో శతాబ్దమున పలువురి పండితుల కవుల దృష్టి నాకర్షించినది. అందులో కవులచే కవి యనిపించుకొన్నవారును, పండితులచే పండితులనిపించికొన్నవారును, సహృదయులచే సహృదయులనిపించికొన్న మహామనీషులు— శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ - కళాప్రపూర్ణులు - తొలుదొల్త - శ్రీకారము చుట్టి 'ఇతిశ్రీ' అనిపించినారు నానా కావ్యరచనా ప్రజ్ఞా ప్రభాకరులై తన మూర్తిని తానే ప్రతిష్ఠించికొనినవారు-శ్రీ శర్మగారని మనమనవలసియున్నది.

కవితలో గట్టివారైన గట్టివారు చల్లగ మెల్లగ గట్టుకు లాగినారు-దిగుమర్తివారు దిగినారు దిక్కుతోచక తీరం చేరలేక ప్రక్కకు మళ్లినారు. నేను తక్కువవాడనా అని 'వాశిరెడ్డివారు ఒడ్డుకుచేరి వాశిగాంచినారు. మేమువాౖతము చేయలేమా అని స్వామి శివశంకరులు ఆచార్య రఘునాథ చక్రవర్తిగారలు కొంతదూరము పయనించి అలసి సొలసి కలము ప్రక్కకు పెట్టినారు. ఇప్పటివరకు దూరతీరాలకు చేరినవారు - ముచ్చటగా ముగ్గురు మాత్రమే.

ఇంక వీరు వారికన్న మిన్ననెన్న తగినరీతిలో దీనిం తెనింగించినా జననంబున్ సఫలంబు చేసెద పునర్జన్మంబు లేకుండగన్, అని కలము పట్టి గాథా సముద్రమునకు ఆవలిదరిని చూచి - అహ అహా అని సంతసించినారు కాని పరిశీలనగ పరిశీలింపగ ఎవరి త్రోవ వారిదే! ఇందు అందరు సమర్థులయ్యు - ఒకరిని మించినవారు ఒక్కరునులేరు. ఎవరు ఎంతగ తమును గురించి, తమ అనువాదమును గురించి చెప్పికొన్నను ఈ యనువాదసభలో 'సభాపతి' తాంబూలము మాత్రము 'శర్మ'గారిదేనన్నది జగమెరుంగు దాని జగమెరుంగు.

ఈ వేంకటాచార్యులవారు చాల శ్రమపడి మూలమును-దీనికి కల మధురానాథ శాస్త్రి, గంగాధరభట్టు, పీతాంబరులు అనువారల వ్యాఖ్యలను పరిశీలించుచు ఇతర యనువాదములను సమాలోచన చేయుచు కత్తిమీద సాముపంటి యనువాదమును సాగించినారు

ఇందు సుమారు మూడువందల పద్యాలు - 'గోలకొండ' పత్రికలో వెలువరింపగ చదివిన రసిక సజ్జనలోకము పెదవులు చప్పరించారుట. కావచ్చును-మూలాని శర్మగారి అనువాదము కొన్నిచోట్ల మెరుగులు దిద్దగ గట్టివారు. అటనట కాస్త నటనట మెరుగులు పెట్టినారన్నారు. వీరందరకన్న నా యనువాదము మిన్నయన్న విశ్వాసముతో 'రచించితి ముద్దులొలుకబోయు తేటతెలుగునందు' అని అన్నారు.

దీనిని 1962 ప్రాంతమున ప్రారంభముచేసి 1964నకు పూర్తి చేసినారుట. అప్పటికి వీరి వయస్సు 47 సంవత్సరములు. ప్రాయంబందున పిన్నవారలయినన్ భావంబులో పెద్దలై స్వాయత్త తృవితా సుధారసము నాస్వాదించిన దిట్టలు.

ఈ ఆచార్యులవారు పొల్లుపదము రానీక, అలంకార శైలి తగ్గనీక తేనెసోక నోరు తీయనయగురీతితోడ సర్ధమెల్ల తోచునట్లు- ఆటవెలదియందు, తేటగీతియందు, కందమందు నందమొలుకునట్లుగ నాంధ్రీకరించి రసిక సజ్జనుల హృదయమును 'సిద్ధరసప్రవాహమగు నట్లుగ నాంధ్రీకరించి సాహిత్య లోకమునకు నెరచూరలిచ్చినారు.

ఇంకను ఈ శతక సప్తకమును పరిశీలింప ఆమెతలు-సామెతలు-పడికట్లు నుడికట్లు జాతీయాలతో ననువాదమొక ప్రత్యేకత సంతరించికొన్నదని చెప్పవచ్చును. వారి ఆశయము కూడా 'ముద్దులొలుకబోయు' అని కదా! అనువాదమునకిది యొక హద్దు అన్నను తప్పు లేదనుకొందును.

వారి వారి యనువాదములను మూలముతో పరిశీలింతము గాక!
శ్లోకావతారిక:- ఇంటి పెద్దల సమక్షమున నింటిపనులను విడిచి-చనలేని-ఓకుట దూతిచే తేబడిన కాముకుని సందేశము వినియును-అతనిని కలయజాలక అన్యాపదేశమున తన యసమర్థతను వెల్లడించు చున్నది.

'జాయతాం వనోద్దేశే కుబ్జోఽపిఖలు నీఃశిఖా శిథిలపత్రః।
మా మానుషేలోకే త్యాగీ, రసికో, దరిద్రశ్చ॥—

శర్మగారు—

ఆకులును గొమ్మలును లేని యడవి నడమ
బొట్టి మ్రోడుగ నెందైన - పుట్టవచ్చు
కాని - నరలోకమున - జేత కాసులేక
రసికుడై - దాతయై పుట్టరాదు సూవె॥

ఆచార్యులవారు —

అడవిలోన గొమ్మలాకులు లేనట్టి
పొట్టి మ్రోడుగాను - పుట్టవచ్చు
మనుజ జాతియందు - ధనవిహీనుడు త్యాగి
రసికుడౌచు పుట్ట - రాదు సుమ్ము॥

హెచ్చులొచ్చులు పాఠకులే నిర్ణయించికొందురుగాక:

అవతారిక:- తన సంపదను పరదారలకై వినియోగించు భర్తతో భార్య చేయు ఉపన్యాసము గమనింపతగినది

ఉత్పాదిత ద్రవ్యాణామపి ఖలానాంతే॥ భాజనంఖల ఏవ!
పక్వాన్యపి నిమ్బఫలాని కేవలం కాకైః ఖాద్యంతే॥

శర్మగారు:-పుడమి కూళజనము - గడియించు నాస్తికి
పాత్రులెవ్వరట్టివారెగాక।
వేపమాను పండ్లు వెలసిన కాకులె
పచ్చు దాని తినగ - వలయు కాదె॥

ఆచార్య:- దుర్జనుడు కూడబెట్టిన - దుష్టధనము
అనుభవింపగ పాత్రుడు నట్టివాడె
బాగుగా పండినను వేప - పండ్లు తినుట
కాసపడువారలెవరు వా యసము దక్క॥

పదముల మార్పిడి పరిశీలింపతగినది క. పాడి కూడబెట్టు పాడైన ధనమును తుదకు దొంగలెత్తురో దొరలకౌనో? అన్న సత్యమును మూలకవి చక్కని యుపమానముతో అట్టివారికి మహోన్నతమైన నీతిని చాటుచు లోభుల గుణములను తూర్పార పట్టుచున్నాడు. ఇతని లోకానుభవ మద్వితీయము.

అవ. ప్రపాలికయందలి పాంథ ప్రపాలికలు బయటకు పొక్కని అనురాగమును ఎంత చక్కగ వర్ణించినాడో పరిశీలింపుడు. నాడే కాదు నేడును ఇట్టి వింతలు విపరీతములును మనము లోకమున చూచుచున్నారము కదా!

యథోర్ధ్వాక్షః పిబత్యంబు - పథికో విరలాంగుళిః
తథా ప్రపాలికా వాపిధారాం వితనుతే తనుం॥

శర్మ-: వేళ్ళు సడలించి మీఁగన్ను వెట్టినీరు
తిన్నగా త్రాగు తెరువరి - తెరగు సూచి
ఔర! చలి పందిటిని గాచు నతివకూడ
సన్నసౌధార మరియును - సన్నగించు॥

ఆచార్య: పయికి చూచి చూచి - పాంథుడు ప్రేశుల
నెడమ చేసి చాల తడవు - నీరు
త్రావ సన్ననైన ధారను - గడు సన్న
పరచు ప్రపనుగాంచు - పైదలియును॥

మూలమందలి ధ్వని శైలీవిన్యాసము సమపాళ్ళలో రాలేదనుకొందును.

చలికాలమందు పశువులకై పచ్చడము అమ్ముకొనిన ఒక అభాగ్యునిగూర్చి పలుకుచున్న పలుకుల ములుకులు.

విక్రీణీతే మాఘమాసే పామరః ప్రావరణం బలీవర్దనేన।
నిర్ధూమ ముర్మురనిభౌ శామల్యాః స్తనౌ పశ్యన్॥

పూర్వకవి:-మాఘమాసంబు పులిపలె - మలయుచుండ
పచ్చడం బమ్ముకొన్నాడు - పణములకును
ముదిత చన్నులు పొగలేని ముర్మురములు
చలికి నౌరగాయ కేలుండు - సైరికుండు

శర్మ:- పొగయుకుండు కుమ్ము - బోలెడు చామచ
న్గవను బడసి - శీత - కాలమందు
పల్లెసేద్యగాడు - పచ్చడంబును విల్చి
క్రొత్త యెద్దు తెచ్చి - కొనియె నేడు

ఆచార్య యువిక హాలికుండు పొగలేని యుముకనిప్పు
కీడువచ్చు చామగుబ్బ పాలిండ్ల జంట
'నాసరా' జూచికొని మాఘమాసమందు
పచ్చడమ్మమ్మి కోడెను తెచ్చికొనియె॥

పూర్వకవి కవితలో బిగువు నవకవులలో లేదు కదా! మూల కవి భావము సంపూర్ణముగ వచ్చినదని పాఠకలోకము సంతసింప కలదా?

అ, ఆలు రానట్టి అన్నయ్యలందరకు అధికారయోగంబు పడుతుందయా, అన్న నేటి దేశస్థితిని ఆనాడే ఊహించి సత్యమును పలికినాడు. మనము చూచుచునేయున్నాము కదా!

వర్ణావలీ మప్యజానంతో లోకలోకై గౌరవాభ్యధికాః।
స్వర్ణకార తులా ఇవ నిరక్షరా అపస్కంధై రుహ్యంతే॥

ఓనమాలైన వ్రాయంగ లేనివారె
గౌరవాధికులౌచు లోకమ్మునందు
మోవబడుదురు - జనులచే మూపులన్ - ని
దక్షరు లెయయ్యు - నగసాలె త్రాసులట్లు॥

ఇందలి భావము సత్యమునకెంత చేరువగనున్నదో. మనము కళ్ళతో చూచుటే కాదు-చెవులతో కూడా ఆ మాటలు వినుచున్నాము కదా! అందుననె 'కవిని క్రాంతదర్శి' యన్నారు. కడుపులో లేని ప్రేమ కౌగిలించుకుంటే వస్తుందా? అన్నమాటను ఎంత చక్కటి వక్రోక్తిలో ననుచున్నాడో పరిశీలింపుడు.

అక్షర క్రమమ్మెక్కడే - యవును గాక
భావములు వేరు-వేరేను-పలుకుబడులు
ప్రణయమున పల్కు-పలుకుల పరుస వేరు
పట్టి మెరమెచ్చు మాటల - పట్టువేరు॥

'ప్రేమ' అక్షరద్వయ పరమార్థమును వివరించుట గమనించునది.

ఒక యువతి తన ఒంటరితనమును అన్యాపదేశముగ తెలియ చేయుచు ఆ పాంథునిపై యుండు ప్రేమాభిమానములు వ్యక్తము చేయు చున్నది.

గ్రామేస్మిన్ ప్రస్తరప్రాయః పాంథ: కింతన్నవిద్యతే
పయోధరోన్నతిం దృష్ట్వా వస్తుమిచ్ఛతిచేత్ వస॥

ఆచార్య:- ఓయి! తెరువరి నీకు వస్నుండ జాప
గూడ లేదిట - నిడిపట్టి - కొండపల్లె
యున్నత పయోధరమ్ముల యదుటు చూచి
యుందువేని యనియ్యోనసుండవచ్చు॥

మూలమందు "ప్రస్తర ప్రాయః" "పయోధరోన్నతి" పదములలో నున్న భావమంతయు కలదు. కాని అనువాదమున - ఆ మాటలను భావానువాదము చేసినాడు. అందలి ధ్వని 'ప్రస్తారప్రాయః' కఠిన హృదయులని రాళ్ళపందుకొనుట తప్ప వేరే సాధనము లేదని. ఇట్టివి ఇవి రాలేదు. ఇట్లుండుట సమంజసమనుకొందును.

"పల్లెయంత చూడ - ప్రస్తరప్రాయమ్ము
పాంథ! ఏమి చూచి - పరుగు లిడుట
కను పయోధరాల - గాంభీర్యమ్ముంజూచి
నిశిని గడుపుదేని - నిలువు మిచట॥

ఈ గాధలందు సామాన్యముగ పల్లెపట్టంబునుండు శృంగారము పాలు ఎక్కువగ కనుపడుచున్నది. కాని కూరలో తరుణకుస్తుంబరి పలె-నట నట 'నీతులు బూతులు-లోకఖ్యాతులు' విశేషము కనుపడు చున్నవి. కొన్నిచోట్ల మొండిచేతివాడికి నువ్వులు తినుటలు నేర్పుచున్నవి.

కొన్నిట దేశాచారములు, సాంఘిక ధర్మములును కలవు. ఏకకర్త్వకము కాకపోవుట్ల పునిరుక్తములున్నవి. కొన్నిట పూర్వక భావచ్ఛాయలు కనుపడుచున్నవి.

చేటులందు వెతల చెందరు - భయముం
గుండె చెడదు - సిరుల క్రొవ్వుకొనరు
ఎచ్చుదగ్గులందు నేకచిత్తముతోడ
నొప్పువారు సూవె గొప్పవారు॥ 'ఆపదలందు ధైర్య గుణ' అన్న పద్యభావము కొంత కనపడుచున్నది కదా!

కాని ఈ గాధలను ఆలంకారికులు తమ కావ్యములందు విశేషముగ నుదహరించికొనియున్నారు పరిశీలింపుడు—భోజదేవు సరస్వతీ కంఠాభరణమున షుమారు 100 గాధలు. కావ్యప్రకాశక కారుడు 29, ధ్వన్యాలోకకారుడు 34, సాహిత్యదర్పణకారుడు 12, దశరూపకకారుడు 10, కువలయానందమున కొన్ని ఇంకను ఆయా గ్రంథములలో తక్కువగ కనపడుచున్నవి.

ఇట్టి యుత్తమకృతిని శ్రీ తిరుమలార్ధంకి వేంకటాచార్యుల వారు చాల శ్రమపడి 'శాంతిపాఠము' వల్లించిరి. కాని వెలుగు రాక పూర్వమే వారికి నూరేండ్లు నిండినవి. కాని వారి కుమారులైనను తండ్రి ఋణము తీర్చికొందురని ఆశించుచున్నాను. 'నా తిరుమలార్ధంకివారి వంశచరిత్ర రచనకు-ఈ అముద్రిత ప్రతిని అందించిన శ్రీ టి. యన్. సి. నరసింహాచార్యుల (తిరుపతి) వారికి కృతజ్ఞత తెలుపుచు వారి కృషిని మాత్రము లోకమునకు కొలదిగ తెలుపుచున్నాను.

**—విద్వాన్ కొమాండూరి రామానుజాచార్యులు**

# గ్రంథ విమర్శలు

## కడలి తరంగాలు (మినీ కవితాసంపుటి)

[డాక్టర్ బాలాంత్రపు శ్యామలరావు, వెల: రు. 2-00లు, ప్రతులకు: ఎక్స్‌రే పబ్లిషర్స్; కొల్లూరిహౌస్; అమలాపురం-533 207 తూ. గో. జిల్లా.]

సాంస్కృతీసమాఖ్య యువసాహితీ వికాసవేదిక ఆంధ్రప్రదేశ్ అమలాపురం తూర్పుగోదావరిజిల్లాశాఖవారు ప్రచురించిన ఒక 38 మినీ కవితల సంకలనం ఇది.

శిల దైవంగామారి
జాలి కురిపిస్తుంటే
మానవుడు గుండె
రాయిచేసుకొని
కర్కశంగా ప్రవర్తిస్తున్నాడు

ఇట్లా ఉంటై వీరి కవితలు.

## మిణుగురులు

[కుంటి మద్దిశేషశర్మ, వెల: రు. 2-25లు, ప్రతులకు: కుంటి మద్దిశేషశర్మ; 2.228 4వ అడ్డరోడ్; అనంతపురం-515004]

శ్రీ కుంటి మద్దిశేషఫణిశర్మగారు బహు గ్రంథకర్తలు. 16 గ్రంథాలు రాసినట్టుగా ముద్రిత గ్రంథాల పట్టిక ఇచ్చారు.

"అప్రాచ్య సభ్యతకు నలవాటువడిన/ భారతీయులు పడెడి పాటులను జూచి/ మేలు కొల్పుటకు నీ 'మిణుగురులు' వ్రాసి/ తిని" అన్నారు శర్మగారు. భారతీయ సంస్కృతిని పునరుజ్జీవింపచేయుటకు కంకణం కట్టుకున్నట్టుగా వారు చెప్పలేదుగాని ఫలితార్థమదే. ఇందులో అనేక విషయాలపై పద్యాలున్నై. ముక్తక సంప్రదాయంలో ఏ పద్యానికాపద్యం పరిపూర్ణార్థాన్ని ఇస్తుంది. కులమతాలు, అర్థకామములు, పురుషులలోని భేదాలు, చదువులు, వరదక్షిణలు, ప్రజలు-ప్రభుత్వము అనే శీర్షికలకింద 186 పద్యాల సమాహారం ఈ మిణుగురులు.

## వేంకటేశ్వర భక్తి శతకము

[వీరభద్రకవి, వెల: రు. 1-00లు ప్రతులకు: నవరత్న పబ్లికేషన్స్: బి/ 791 హిల్‌కాలనీ; నాగార్జునసాగర్; 508202.]

శాంతిస్తుతి, అవతారికాస్తుతి, దైన్యస్తుతి, వ్యాజస్తుతి, నిందాస్తుతి, లౌకికాయత్తస్తుతి, సరసస్తుతి, కాథావ్యాజస్తుతి, భక్తిక్రియానుస్తుతి, భక్తినిర్ణయానుస్తుతి స్థలస్తుతి, తీర్థస్తుతి గుణస్తుతి, పూజస్తుతి, అవతారస్తుతి, శరణాగతస్తుతి, శీర్షికలకింద రాసిన 108 పద్యాల శతకం ఇది. భక్తి మహిమ ప్రధానం కనుక భక్తులు చదవవలసిన శతకం ఇది.

## శ్రీ రాఘవ శతకము

[జోశ్యుల సూర్యనారాయణమూర్తి; వెల 1-50: ప్రతులకు: జోశ్యుల సూర్యనారాయణమూర్తి; భారతీసదనం; అవనిగడ్డ, కృష్ణాజిల్లా.]

ఈ రచయిత గతంలో అనాధుణ్ణి గురించి, విశ్వనాధను గురించి విమర్శగ్రంథాలు వెలయించిఉన్నారు. సహజ సౌరభము అనే కావ్యాన్ని గూడా రాశారు. ఇప్పుడీ శతకాన్ని తిరుపతిదేవస్థానము వారె కొంత ఆర్థిక సహాయంతో ప్రచురించారు. భక్తిశతకాలన్నీ భక్తితత్వాన్ని, మహిమను వెల్లడించేవిగానే ఉంటై. అట్లాంటివాటిల్లో ఈ శతకంకూడా ఒకటి.

## భారతం (భరతకథ)

[వెల: 2-00లు, రచయిత-ప్రతులు పై పుస్తకానికున్న మాదిరిగానే.]

ఈ పుస్తకంకూడా సూర్యనారాయణమూర్తిగారు తిరుపతి దేవస్థానంవారి ఆర్థిక సహాయంతోనే ప్రచురించారు. భరతుడి వ్యక్తిత్వం ఆధారంగా రాసిన పద్యసమాహారం ఈ భారతం. మంచి నడక గలిగిన, రసవంతమైన పద్యరచనలో చెయ్యితిరిగినవారు జోశ్యులవారు. ఆలక్షణం ఈ కావ్యంలో ప్రస్ఫుటంగా కనిపిస్తుంది.

## భారతీ శతకము

వెల: 1-50; భక్తిభారతి; వెల: 2-00లు; శ్రీ వేంకటేశ్వర స్తవమ్ (అష్టోత్తర శతమ్) శ్రీ ఆంజనేయస్తోత్రం; వెల: రు 2-50, రచయిత - ప్రతులు: పై పుస్తకానికున్నట్టుగానే.

ఈ మూడు పుస్తకాలుకూడా తిరుపతి దేవస్థానంవారి ధన సహాయంతో సూర్యనారాయణమూర్తిగారు అచ్చు వేసినవే. భారతీ శతకము సరస్వతీస్తుతికి చెందినది. భక్తిభారతి, వేంకటేశ్వరా, శివస్తవం, శ్రీదేవీ వీరరస్య, పార్వతీస్తుతి, శ్రీశైలము, పృథుకథ, ప్రభు ప్రార్థన అనే శీర్షికలక్రిందరాసిన కావ్యఖండికల సంకలనం, శ్రీ వేంకటేశ్వర స్తవం సంస్కృత మూలానికి తెలుగు తాత్పర్యం.

ఓ.స.

## అలలకం ఓటమి లేదు (కవితాసంపుటి)

[ఏ. సూర్యప్రకాశ్, వెల : రు. 7-00 ప్రతులకు : రచనా పబ్లిషర్స్; 1-7-87; పంత్‌రోడ్; ఆర్మూరు- 503 224.]

ఇది ప్రసిద్ధ రచయిత రావూరి భరద్వాజగారికి అంకితమిచ్చిన వచన కవితా సంపుటి. కవిత్వ వస్తువు కవికి కనిపించిన సమాజం. ఈ సమాజం అనేక సమస్యలచేత పీడింపబడుతోందని శ్రీ సూర్య ప్రకాశ్ తన కవితా ఖండికలలో ఆవేదనను వ్యక్తంచేశారు. సూర్య ప్రకాశ్‌గారి ఈ కవితా సంపుటిలో అధికభాగం వచనాన్ని ముక్కలుగా పేర్చటంగా కనబడుతుంది. ఎక్కడోకాని కవిత్వపుస్పృహ, చమత్కారం కనిపించవు. కవితోపనిషత్ అనే ఖండికలో ఆయన కవిత్వాన్ని గురించి కొంత చెప్పారు.

మంచుమీద స్కేటింగ్ చేసినా,
నిప్పుల ఏరు ఈదినా
పసివాడికి పళ్ళు వస్తున్నట్లుగా
పిల్లవాడి పైపెదవిపై నూనూగు మీసంకట్టు
పొటమరిస్తున్నట్లుగా
సహజ సుందరంగా, నిసర్గ రమణీయంగా
భావాలు అహమహమికలో పుట్టుకరావాలి
ఎవరూ ఊహించని లోకాలకు తలుపులు తెరవాలి

ఈ పంక్తులన్నీ కవిత్వ సహజత్వానికి, శిల్పానికి చెందినవి. ఈ విషయమై 'నవత-కవిత' అనే ఖండికలో తిలక్ వివరంగానూ, కవితామయంగానూ ఇదివరకే చెప్పాడు. సూర్యప్రకాశ్‌గారు ఇంతా చెప్పి తన కవిత్వరచనకు మాత్రం కొత్తదనాన్ని తేలేకపోయారు. వస్తువు ఎంత సమకాలికమైనా, ఎంత సామాజికమైనా అదే కవిత్వం కాదు.

బస్సే అతని ప్రేరణ బస్టాండే అతని చిరునామా
బస్టాండే అతనికి తెలుగు నేర్పింది తెలివినేర్పింది
కళ్ళమీదికి నిద్రముంచుకొచ్చినప్పుడు
అక్కడే ఎక్కడో తొంగుంటాడు
బస్టాండే అతని పెంపుడు తల్లి

సోడా కుర్రాడు కథలో కొన్ని పంక్తులు ఇవి. ఉదాహరణకు మాత్రమే నేను ఇవ్వి ఉదహరించాను. పై పంక్తులకు వచన రచనకు చెప్పుకోతగ్గంత తేడా ఏమీకనపడదు. పోగా వీరి కవిత్వ రచనకు ఒక ఉపన్యాసధోరణి ఉన్నది. ఈ ధోరణి కవిత్వ లక్షణంకాదు. ఎండనో, వర్షాన్నో మరో అంశాన్నో వర్ణించేటప్పుడు అక్కడక్కడ కవిత్వ స్పృహ తగులుతుంది

మంచి నీరేకాక, మంచితనంకూడా
ఆవిరై పోతున్నదా అన్నట్లు ఎండలు
ప్రాణావసరమైన కనీసావసర వస్తువుల ధరల్లా
ముక్కోపి ముక్కుమీద కోపంలా
బకాసురిడి ఆకలిలా, నిరుద్యోగి ఆవేశంలా

ఇట్లా కించిత్ చమత్కార ధోరణి కనబడుతుంది. దృక్పథం విశాలమైనా, రచనా సంవిధానం బలహీనమైనదవటంచేత విషయం శుష్కనినాదంగా మారే ప్రమాదంఉంది. ఈనాటి వచన కవిత్వం ఈ ప్రమాదానికి గురికాకూడదు.

— టి. యల్. కాంతారావు

## నల్లగొండజిల్లా మాండలిక పదకోశం

[సంకలన కర్త : డాక్టర్ ఆర్. శ్రీహరి, లెక్చరర్, తెలుగు శాఖ, హైదరాబాద్ కేంద్ర విశ్వవిద్యాలయం, హైదరాబాదు, డెమ్మీ 58 + 228 పటలు. వెల రూ. 40/- ప్రచురణ-పతంజలి పబ్లికేషన్స్, హైదరాబాదు, ప్రతులు దొరకుచోటు : శ్రీమతి ఆర్. అనంతలక్ష్మి]

భాష ఒక్కటే అయినా, ఆయా ప్రాంతాలలోని వాడుకనుబట్టి పదాలు అర్థాలు మారిపోవడం సహజం. ఇది సంస్కృత భాషలో కూడ కానవస్తుంది. ప్రజా వ్యవహారంలో ఉన్న ప్రాకృత భాష శౌరసేని, మాగధి, పాళీ. మహారాష్ట్రాది భేదాలు ఆయా ప్రాంతాలను బట్టి కలిగినవే! ఆ విధంగానే తెలుగుభాష ఆయా మండలాలను బట్టి మార్పులు చెందడం, ఒక ప్రాంతం వారికి మరొక ప్రాంతం వారు వాడే పదాలు, వాటి అర్థాలు విచిత్రంగా కానబడడం సహజం. శ్రీకాకుళం జిల్లాలో "మనిషిని పంపుతాను" అనుటకు, "మనిషిని తోల్తాను" అని అంటారు. ఇతర స్థలాల్లో "తోలుటను" పశువుల విషయంలోనే కనబడుతుంది. శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్నం జిల్లాలలో బాలికకు "గుంట" అనీ, బాలునికి "గుంటడు" అని వాడుక సాధారణంగా కనబడుతుంది. అది ఇతరత్రా కానరాదు. కొన్నిప్రాంతాలవారు "రొద్ద" అని వాడితే, ఇతరప్రాంతం వారు "రొట్ట" అంటారు. ఇలా ఎన్నిటినైనా చూపవచ్చును.

ఆయా మండలాలలోని, పద, పదార్థాలు ఇతరప్రాంతాల వారు తెలుసుకొనుటకు శబ్దార్థ కోశాలు ఉండడం అవసరమే! దీనిని గ్రహించే ఇదివరలో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు కొందరు సమర్థులు సంకలనం చేసిన మాండలిక పదకోశాన్ని ప్రకటించారు. కాని, అందులో ఎన్నో పదాలు విడువబడ్డాయి. అందువల్ల దానివల్ల ప్రయోజనం అంతమాత్రంగానే ఉండినది. ప్రతిమండలానికి ఒక

# "ఏమండీ. ఆ భరించలేని నొప్పి ఏమైంది?"

"పోయిందే!"




మేలుపరచబడిన అమృతాంజన్ వాడడంతో,

కోమలమైన అమృతాంజన్‌ను చాలా సులభంగా రాసుకోవచ్చు.

మృదువైన అమృతాంజన్‌తో చాలా సులభంగా 'మర్దనా' చేయవచ్చు.

తలనొప్పులను, ఒళ్ళు నొప్పులను, కీళ్ళ నొప్పులను, కండరాల నొప్పులను మరియు బెణుకులను మేలుపరచబడిన అమృతాంజన్ మునపటికంటే అతి త్వరితంగా ఉపశమింపజేయగలదు !

## మేలుపరచబడిన
# అమృతాంజన్

మీ మోముపై చిరునగవులను శీఘ్రంగా- తిరిగి వికసింపజేయుగలదు!



Amrutanjan Limited

OBM 149 TG R

ప్రత్యేక పదకోశం ఉన్నప్పుడే ప్రయోజనం ఉంటుంది. అట్టి ప్రయత్నానికి ఈ పదకోశం మార్గదర్శకమని చెప్పవచ్చును.

ఇట్టి గ్రంథాలు సమకూర్చడం మిక్కిలి శ్రమతో కూడినపని. ఓపిక కూడా మిక్కిలి అవసరం డాక్టర్ శ్రీహరిగారు ఎంతో శ్రమ కోర్చి ఓపికతో దీనిని తయారు చేశారు. ఆయన నల్లగొండ జిల్లాలోని వివిధ ప్రాంతాలకు తిరిగి వాడుకలో ఉన్న దేశ్య పదాలను, అన్యదేశ్య పదాలను సేకరించి, వాటి అర్థం చెప్పుతూ వాటిని ఉపయోగించి వాక్యాలు కూడా ఉదాహరించారు. పదాలు అకారాది క్రమంలో కూర్చబడినవి.

సంకలనకర్త నల్గొండజిల్లా మ్యాపును, దాని సరిహద్దు జిల్లాలతోకూడా ఇచ్చారు ఇది చాలా ఉపయోగకరమైనది. ప్రతిజిల్లా మాండలిక పదకోశాలు సమకూర్చే వారందరూ ఈ పద్ధతిని అనుసరించడం మంచిది.

నల్గొండజిల్లా తెలంగాణాలో మధ్యను ఉన్నది. దాని సరిహద్దుల్లో మెదక్, కరీంనగర్, ఖమ్మం, రంగారెడ్డి, మహబూబ్‌నగర్ జిల్లాలున్నవి. అందువల్ల ఆ జిల్లాలలో వాడుకలో ఉన్న పదాలు ఈ జిల్లాలో వాడుకకు రావడం సహజం. కొన్ని పదాలు దేశసామాన్యంగా వాడుకలో ఉన్నవీ కోశంలో చేరినవి. అలికిడి, కిస్తీ, కుంకుడుకాయ, తువ్వాలు, పురుడు మున్నగు పదాలు వీరిచ్చిన అర్థాలలోనే దేశవ్యాప్తంగా కానవస్తూ ఉన్నవి. కాని 'మొట్టిమొదట' అనే అర్థమిచ్చే 'తుర్తు', 'గట్టిపడి' అర్థంగల 'పిట్టికట్టు'. పిట్ట, అర్థంగల 'పిట్టె', పైకి ఎత్తు, పైకి లాగు - అనే అర్థాలనిచ్చే 'వేటట్టు' మొదలైన మాండలిక పదాలు ఇతరమండలాలవారికి వింతగానే తోస్తాయి. ఇట్టి పదాలుగల కోశాలు ఇతరులు తెలుసుకోవడం ఎంతైనా అవసరం. ఈ సంకలనాన్ని ఆదర్శంగా పెట్టుకొని, ఆయా జిల్లాలలోని అభిమానులు తమతమ జిల్లాల మాండలిక పదకోశాలను తయారు చెయ్యడం అవసరం. తెలుగుకోసం పాటుపడుతున్న తెలుగు విశ్వవిద్యాలయం వారు అట్టి ఔత్సాహికులకు తగిన ప్రోత్సాహం ఇవ్వగలరని ఆశిస్తున్నాను. ఇట్టి కోశాలు భాషా పరిశోధనకి మిక్కిలి ఉపకరించగలవు.

సుప్రసిద్ధ భాషాశాస్త్ర వేత్తలు ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తిగారు, ఆచార్య జి. యన్. రెడ్డిగారు, ఆచార్య బి. రామరాజుగారు, ఆచార్య వి. సుబ్రహ్మణ్యంగారు, ఆచార్య చేకూరి - ఆచార్య కృష్ణకుమారిగారు, ఆచార్య ఎమ్. కులశేఖరరావుగారు ప్రొఫెసర్ జి. అప్పారావుగారు దీనిపై సదభిప్రాయాలు ఇచ్చి ఉన్నారు. ఇది శ్రీ నారాయణరెడ్డి గారికి కృతి ఇవ్వబడినది.

డాక్టర్ శ్రీహరిగారు తెలుగు భాషా వాఙ్మయములకు బహుముఖాలసేవ చేస్తున్నారు. ఇట్టి ఉత్తమ గ్రంథాన్ని కూర్చిన యీ సంకలనకర్త, దీనిని ప్రచురించిన హైదరాబాదు, పతంజలి పబ్లికేషన్స్ వారు అభినందనీయులు. దీనికి తెలుగునాట ఆదరామోదాలు లభించగలవని ఆశిస్తున్నాను.

—బులుసు వేంకట రమణయ్య

# ఆళవందార్ స్తోత్రము

[మూల రచయిత: శ్రీ యామునాచార్యులు, వ్యాఖ్యాత: శ్రీ కందాళ వేంకటరామ నరసింహాచార్యులు, ప్రకాశకులు: శ్రీ గోదా గ్రంథమాల, ముసునూరు-521 207, కృష్ణాజిల్లా. వెల: రు. 15/-]

పన్నెండేళ్ళ బాలునకు ఒక రాణి మాటవల్ల వచ్చినపేరు 'ఆళవందార్'. తల్లిదండ్రులు పెట్టిన పేరు 'యామునుడు'— ఆళవందార్ అనే పేరే ప్రసిద్ధమయింది. ఈయన విశిష్టాద్వైతానికి మూలకందం. శ్రీరంగక్షేత్రమందు చరమదశలో ఉన్న యమునాచార్యులను దర్శించి శ్రీరామానుజుడు విశిష్టాద్వైత ప్రచారానికి బాస చేశాడు. అప్పటికి ఆయన వయస్సు 21.

ఆళవందార్ శ్రీవిష్ణువును స్తుతించిన 65 శ్లోకాలకూ తెలుగున 'రత్నప్రభ' పేరున శ్రీకందాళ ఆచార్యులవారు వ్యాఖ్య సమగ్రం, సప్రమాణం, సరళమూ అయిన రీతిని వ్రాసి విష్ణువైభవమును సువ్యక్తం చేశారు. శ్రీవైష్ణవ సంప్రదాయజ్ఞులు అవశ్యం పఠనీయముగా యీ గ్రంథమును నిత్యసన్నిహితముగా భద్రపరుచుకోవచ్చు.

శ్రీమన్నారాయణుని పరత్వమును వ్యక్తీకరించే యీ శ్లోకం సుశ్లోకం.

'వేదాపహార గురుపాతకదైత్య పీడా
ద్యాపద్విమోచన మహిష్ఠ ఫలప్రదానైః
కోన్యః ప్రజాపశుపతే పరిపాపి; కస్య
పాదోదకేన సశివః స్వశిరోధృతేన'-13

వేదాలు పోగొట్టుకున్న బ్రహ్మను, బ్రహ్మ శిరస్సును తెగనేసిన పాపంనుంచి రుద్రుణ్ణి కాపాడినవాడు కనుక శ్రీమన్నారాయణుడు అందరికీ పై స్థానంవాడు. ఆ దేవుని పాదోదకం శిరసున ధరించి నందువల్ల రుద్రుడు శివుడయాడు.

ఇలా విష్ణు పారమ్యమును ప్రకటించే దివ్యగ్రంథం ఇది. చివర శ్రీదేవిని స్తుతించే 'చతుశ్శ్లోకి' ఆ తల్లి దివ్యమాతృత్వమును నిరూపిస్తుంది.

## పెరుమాళ్ తిరుమొళి
(కులశేఖర సూక్తిమాల)

[లఘు వ్యాఖ్యాత: 'శ్రీచరణ రేణువు', ప్రకాశకులు: శ్రీ గోదా గ్రంథమాల, ముసునూరు. వెల: రు. 18/-.]

చేరదేశ రాజకులశేఖరుడు కులశేఖరుడు. శ్రీరంగనాథ స్వామిని ఆత్మైకమూర్తిగా భావించి సంభావించి 105 పాశురాలు పలికాడు. వాటిని దశకపద్ధతిని విభాగించి యిందు ప్రచురించారు. వాటికి ప్రతిపదచ్ఛేదం, తెలుగు అర్థం తాత్పర్యం శ్రీచరణరేణువుది. మూలం తమిళం.

శ్రీరంగనాథుడు తనకి పెరుమాళ్ (భగవానుడు లేక దేవుడు) కాగా తన భక్తులకు 'పెరుమాళ్'గా సంభావ్యుడైన చరితార్థుడు కులశేఖరుడు. రాజు, కవిరాజు.

శ్రీరంగనాథుని స్తుతితో ఆరంభించిన యీ దివ్యకృతి యశోదా కౌసల్యా మాతలనూ గోపికా లీలలనూ రామకృష్ణులనూ కూడా పాఠకునకు ప్రత్యక్షీకరిస్తుంది. సుతిమెత్తని భావాలు, సుందరమైన పలుకుబడి.

కౌసల్య పాడినజోల మనోరంజనం. 'హృదయ దేహబంధువు లందరును వదలలేక నిన్ను వెన్నంటుచుండగా అహంకార మమకారము లను ఛేదించినవారు మాత్రము పొందదగిన దుర్గ మార్గమునకు అమృతౌషధమా! అయోధ్యా నగరాధిపతివై, వేదాంతవేత్తలు నిత్య నివాసము చేయు తిరుకణ్ణ పురాధిపతీ! చిన్నతల్లి కైక మాటను (మన్నించి) శిరసావహించి అరణ్యమున కేగిన శ్రీరాముడా! జో! జో!

పాశుర భావాలను వింపుగా నింపుగా తెలుగున చెప్పిన 'శ్రీచరణ రేణువు' ధన్యజీవి. అదే ఎతబుదితో అందరూ ఆదరించదగిన భక్తిప్రబంధం.

## శంకరగ్రంథ రత్నావళి

[నవమ సంపుటము, స్తోత్రములు-ద్వితీయము, అనువాదకులు: శ్రీ తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రి; ప్రకాశకులు: సాధన గ్రంథ మండలి, తెనాలి. వెల: రు. 12/-

ఏకపాద రుద్రావతారుని స్తుతితో ఆరంభం, మౌనవ్యాఖ్యాత దర్శనముతో ముగిసే రత్నమాలికలో లక్ష్మీనరసింహుజ, గంగ, గౌరి, భవాని, మణికర్ణిక, యమున, రాముడు, జగన్నాథుడు, శ్రీకృష్ణుడు, అచ్యుతుడు, పాండురంగడు, గోవిందుడు, కాశీ విశ్వ నాథుడు దర్శనమిస్తారు. దేవికి చేసే చతుష్షష్ట్యుపచారాలూ దీని మూలాన తెలుస్తాయి. అన్నీ ఆదిశంకర భగవత్పాదులు పలికినవే. అన్నీ ఒక యెత్తు-చివరనున్న దక్షిణామూర్తి స్తోత్రం ఒక యెత్తు.

'బీజస్యాంతరివాంకురో జగదిదం ప్రాఙ్నిర్వికల్పం పునః
మాయాకల్పిత దేశ కాల కలనా వైచిత్ర్య చిత్రీకృతం
మాయావీవ విజృంభయత్యపి మహా యోగీవ యస్స్వేచ్ఛయా
తస్మైశ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే'-(

ఈ ఒక్క శ్లోకం విశ్వతత్త్వాన్ని తెలుసుకొనడానికి గురుపీఠ అని నేననుకున్నాను. దీనికి మాన్యశ్రీ శాస్త్రిగారిచ్చిన వివరణ అని వాదాల వారికీ తిరుగులేని సమాధానం అవుతుంది.

స్తోత్రాలన్నిటికీ శ్రీ శాస్త్రిగారు పొందికైన తెలుగులో టీ తాత్పర్యాలు సంతరించారు. ఆ తీరున ప్రతి స్తోత్రమూ జా రత్నమై భాసించింది.

శాస్త్రిగారు ముందుగా ఇచ్చిన 'ఉపోద్ఘాతం' ఈ గ్రంథాని వజ్రహారం. ఒకచోట 'హేతువాదులకు' ఇచ్చిన సమాధాన అమోఘం.

ఆస్తికతా ప్రతిష్ఠాపనకై సాధన చేస్తున్న సాధన గ్రం మండలివారి కృషి సర్వజన సంస్తవనీయం

## భారతీయ సంస్కృతి

[మూలం: సానే గురూజీ, అనువాదకులు: పొట్లూరి నాగ భూషణం, శ్రీ యలమంచిలి వేంకటేశ్వరరావు, ప్రతులకు: విద్యావనం పబ్లిక్ ట్రస్ట్, గుడివాడ, ఉయ్యూరు, విజయవాడ-2, ఏలూరు చిక్కవరపల్లి - మూల్యం: రు. 25/-]

తాను, తనది, తనకోసం - అనేదిలేక - లోకక్షేమం కోసం జీవితాన్ని కరగబెట్టిన పుణ్యపురుషులు ఆ యుగంలో ఇద్దరే ఇద్దరు. ఒకడు దశరథ నందనుడు రాముడు, ఇంకొకడు వసుదేవ సుతుడు కృష్ణుడు. యుగాలు దొర్లగా ఈ యుగంలో ఒక పుణ్యపురుషుడు అలాటివాడే పుట్టి వెళ్ళిపోయాడు. ఆయన గౌతమబుద్ధుడు. ఈ ఈ ముగ్గురూ అవతార పురుషులుగా గ్రంథాలలోనే దర్శనమిస్తారు. లో కోవకి చెందిన ధన్యచరిత్రుణ్ణి మనం ఎరుగుదుము. ఆ మహా త్ముడు గాంధీజీ. ఆయన అడుగుజాడలలో నడచిన ఆదర్శపురుషుడు, మహారాష్ట్ర వంశముక్తామణి సానే గురూజీ. ఆయన మాటలు ఆణి ముత్యాలు. జాతికి పసిడి బాటలు. వాటిమూట ఈ భారతీయ సంస్కృతి. దీనిని మృదుమధురమైన వాగ్విలాసముతో తెలుగుజాతికి

అందించిన నాగభూషణ వేంకటేశ్వరులు ఆంధ్ర వాఙ్మయానికి అనర్ఘమైన రత్నాలంకారం సంతరించారని మనసా అభినందిస్తున్నాను.

ఇదీ అదీ కాదు ఈ గ్రంథంలో విశ్వమంతా సానుభూతిపరయైన విమర్శతో గోచరిస్తుంది. ప్రాచీనతను మన్నిస్తూ ఆధునిక భావాలకు ప్రాధాన్యం ఇస్తూ గురూజీ చెప్పినది కాదనలేము. హృదయ పావిత్ర్యం వ్యక్తికి ప్రధానం. అది లేనపుడు ఏ శాస్త్రాలూ ఏ సూత్రాలూ అరణ్యరోదనమే అవుతాయి. ఆ పావిత్ర్యం ఎలా కలుగుతుంది? ఈ గ్రంథం సరియైన సమాధానమిస్తుంది.

> 'ముత్యము పగిలినా మనస్సు విరిగినా అతుకజాలడా విధాతయైన. ప్రపంచంలో తెంపటం తేలిక. అతకటం కష్టం. చెట్టు పెంచటం శ్రమకాని మొదలంట నరకడానికి క్షణం చాలు. ఇల్లు కట్టడం కష్టం పడగొట్టడం తేలిక'—

ఈ మాటలు చాలనుకుంటాను సమాజానికి చెప్పడానికి తగిన నీతిపాఠం అని.

కర్మ, కర్మఫలత్యాగం, గురుశిష్యులు, స్త్రీ స్వరూపం, అహింస, ధ్యేయనిష్ఠ, అవతారకల్పన, విగ్రహారాధన, శ్రీకృష్ణుడు, ఆయన మురళి ఇత్యాది శీర్షికలతో ఉన్న విషయం ఓర్పుగా చదివి అర్థం చేసుకోవాలి. కొన్ని సనాతనత్వానికి ప్రత్యాఖ్యానాల్లా అర్థం అవుతాయి. అలాటివాటిని పరామర్శించి చదవాలి. చివరకు 'ఔను' అని అనిపిస్తాయి.

కర్మవీరులకు వైపరీత్యం తోచదు. ధర్మవీరులకు సర్వమూ సముపాదేయమే. ఇంతకూ 'భారతీయ సంస్కృతి - అంటే ఏమిటి అంటే' ఇదే - అని అనిపిస్తుంది ఈ గ్రంథం. జాతి మత భేదం లేకుండా అందరూ చదివి అర్థం చేసుకోవలసే సామాజిక జీవసూత్ర గ్రంథి ఇది.

## కాంతి – శాంతి

[రచన: శ్రీ కొండిపర్తి శేషగిరిరావు, ప్రతులకు: కొండిపర్తి వీరరాఘవమ్మ, బి 2093, హిల్ కాలనీ-508 202 ఆంధ్రప్రదేశ్. వెల: రు. 30/-]

'సర్వం రసమయం జగత్'-'సఏవరసః' 'రసఏవ ఆనందః'- అని రసజ్ఞులు చెప్పే ఉక్తులు వినవస్తూ ఉంటాయి. ఆలంకారికులు నిర్వచించే రసార్థం వేరు. ఆనందపరంగా వినవచ్చే సూక్తులు వేరుగా చెప్పేది ఉంది. రసానుభవం లౌకికం, అలౌకికం అని తత్వజ్ఞుల అభియుక్తి. ఏమైనా రసజ్ఞత అమలిన జీవితసత్యం అని చెప్పవలసి ఉంది.

రసోత్పాదనకి కళ బీజం. దీనినెవరూ కాదనలేరు. కళలు భిన్నప్రకృతులుగా ఉంటాయి. వీటిలో లలితకళలు దైహికంగా హార్దికంగా రసస్పష్టికి హేతువులుగా భాసిస్తూ ఉంటాయి. ఈ సిద్ధాంతమును సర్వులూ అంగీకరించవలసిందే. కళకి రూపం స్వరం. స్వరం రసోత్పత్తికి దీపం. రెండూ కలిసి ఆనందమయితే ఆ ఆనందమే ప్రకృతికి ఉజ్జీవనం అవుతుంది.

---

కవిత, గానం, నృత్యం, చిత్రలేఖనం - ఇలా కళలు చతుష్షష్టి సంఖ్యాకములు. ఇవే కళలు కాగా వీనిలో కవితా సంగీత చిత్రలేఖనములు లలితకళలుగా వ్యవహారం విహారం చేస్తుంది.

'రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్
పర్యు' త్సుకో భవపి యత్సుఖితోపి జంతుః
పచ్చేతసా స్మరపి నూన మబోధపూర్వం
భావస్థిరాణి జననాంతర సౌహృదాని'—

అని పుంభావ సరస్వతి మాట. కనవలసేవి ఏవి? వినవలసేవి ఏవి? ఈ ప్రశ్నకి సలలితమూ సరసమూ అయిన సమాధానం దీనిలో ఉంది- అదే లలితకళ-కాదని ఎవరేనా అంటే శ్రీ శేషగిరిరావు పక్షాన నేను సమాధానం ఇస్తాను. ఆ విధమైన సలక్షణ కళవల్ల హృదయాన్ని ఆవరించిఉన్న తామసవికారం పోయి 'కాంతి' కలుగుతుంది. దాని ఫలం 'శాంతి'....

డాక్టర్ సంజీవదేవ్ 'పరిప్రేక్షితం' ఈ గ్రంథానికి సలక్షణమైన విమర్శాదర్శం. దానిలో శ్రీ శేషగిరిరావు కాంతి - శాంతి సువ్యక్తము లవుతాయి.

శ్రీ శేషగిరిరావు హృదయముపై అడవి బాపిరాజు రచన పలికించిన చిత్రవ్యాసతంత్రులు కాంతికీ శాంతికీ చక్కని రూపం సంతరించాయి. ఇందలి వ్యాసాలు ఇంతకుమున్నూ 'భారతి' మొదలైన ప్రసిద్ధ సంచికల్లో వెలువడినవి. పుస్తకరూపాన సచిత్ర ముద్ర వేసుకుని ఆధునిక చిత్రవాఙ్మయలక్ష్మికి అపురూపమైన రత్నాలంకృతి అయాయని ఆనందంగా అంటున్నాను.

శ్రీ సంజీవ్‌దేవ్ అన్నట్టే లోపలి వ్యాసాలకూ వాటిపై ఉన్న చిత్రాలకూ పొంతన కుదరలేదు. కొన్ని స్పష్టంగానూ లేవు. అవి ఎందుకు ముద్రించినట్టో నాకు అర్థం కాలేదు.

తెరవగానే దర్శనమిచ్చే వీణాపాణి చిత్రం ఆనందమూర్తిగా ఉన్నది.

ఈ పుస్తక ముద్రణకు ఆర్థికంగా చేదోడయిన ఆంధ్ర ప్రభుత్వ సాంస్కృతిక వ్యవహారశాఖ సత్కృతికి అభినందన సత్కృతి.

—యామిజాల పద్మనాభస్వామి

Printed & Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna, Vijayawada. Phones : 75667 & 61247